# ప్రేమ్ సబ్బుతో స్నానం
# రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మరియు ఆకుపచ్చ
రంగులలో లభించును



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

Imageads M-1783

ఈ 34వ

# రిపబ్లిక్ దినోత్సవ

సందర్భంగా

- సాధించిన లాభాలను పటిష్ఠం గావించుకునేందుకు
- దేశ నిర్మాణ కృషిలో సమర్పితులము అయేందుకు
- సాధ్యమైన సర్వ సంపదలను సమీకరించేందుకు
- వృధా ఖర్చులను విడనాడి నిరాడంబరంగా ఉండేందుకు

సహకారమవసరమైన ప్రతీ పిలుపుకు బదులు పలికి భారాన్ని పంచుకునేందుకు



మనలను బలహీన పరచడానికి ప్రయత్నిస్తూన్న సర్వ శక్తుల పట్ల జాగరూకత వహించేందుకు

## నేటి, రేపటి సవాళ్ళను

ఎదుర్కోడానికి సంసిద్ధంగా ఉండేందుకు ప్రతిజ్ఞ పూనుదాము

83/428

## ముఖచిత్రం

మా ప్రియతమ అభిమాని "నందమూరి బాలకృష్ణ" మంచి డిస్కో స్టైల్‌లో మీ(మా) ఆంధ్ర సచిత్ర వారపత్రికమీద చూడాలి అని నేనూ, నా యొక్క మిత్రబృందము కోరుచున్నాము.

తుమ్మల ఉమామహేశ్వరరెడ్డి, మైదుకూరు

## కథలు

ఎం. డి. సౌజన్యగారి "తలతన్నేవాడిని తాడితన్నేవాడు" కథ ప్రశంసనీయంగా ఉంది.

యర్రగుడి నబీరసూల్,
అనంతపురం.

* * *

వంగల పద్మగారి 'ప్రేమపాశం' కథ మా ఇంటిల్లపాదిని అలరించినది. ఈ కథలోని విజయ తల్లిలాంటి మనస్తత్వం గలవారు మనకు ప్రతిరోజూ ఎక్కడో అక్కడ తగులుతానే ఉంటారు.

శ్రీపతి ప్రభాకరశర్మ,
కాకినాడ.

* * *

సింహంగారి "భయం" అనే కథ నేచురల్‌గా చాల చక్కగా ఉంది.

పక్కి కృష్ణారావు,
కురుపాం.

## బ్రాహ్మణుని పతనం

20—1—84 సంచికలో "బ్రాహ్మణుని పతనము" అనే వ్యాసం ప్రచురణ ఇప్పుడు అప్రస్తుతం, 'ఆంధ్ర పత్రిక' లో అసలు రాకూడనిది.

ముందుగా ఎవరు పతనమైనారో చర్చిస్తూ కూర్చోవలసిన సమయం కాదిది. అందరూ పతనమైనారు కనుకనే గుజరాత్‌లోని సోమనాధ దేవాలయం 17 సార్లు కొల్లగొట్టబడింది.




బ్రాహ్మణులతో బాటుగా రాజులు కూడా పతనమైనారు కనకనే తన కుటుంబ తగాదాను ఆసరాగా చేసుకొని మహమ్మద్ ఘోరీని దక్షిణాపధానికి ఆహ్వానించాడు జయచంద్రుడు. బ్రాహ్మడు అయినా ఔరంగజేబు కొలువులో అన్ని వర్గాల హిందువులూ ఉన్నారు. బ్రిటిష్ రాజ్యానికి సహకరించని కులం వారున్నారా ?

అసలు వేదవిజ్ఞానానికే, హిందూత్వమనే ఒక శాస్త్రీయ జీవన విధానానికే చేటు దాపురించిన కాలమిది. పాశ్చాత్య దేశాల కుట్రకు లోనయి ప్రలోభాల్లోపడి హిందూ సోదరులు తమ మాతృసంస్కృతి నుండి విడిపోతున్న కాలమిది. మతం మార్చుకోని హిందూ కులం ఒక్కటి ఇవ్వాళ చెప్పగలమా ?

అందరం భ్రష్టులమవుతున్నాం. పైకి లేచే ఉపాయం కావాలి. అటువంటి వ్యాసాల్ని ప్రచురించండి.

మీరు ప్రచురించిన వ్యాసానికి, ఆ చర్చకు ఇది కాలం కాదు, పత్రిక స్థానమే కాదు.

గుండు అన్నపూర్ణ, ఏలూరు

## గోవు

"గోవు" ఎందుకు పూజనీయమైనది — అన్న వ్యాసం చిన్నదైనా బహు చక్కగా వుంది సంస్కృత పద్యాలతో — వాటి అర్థ వివరణతో క్లుప్తంగా పొందుపరిచారు. కొత్త విషయం తెలుసుకున్నానన్న తృప్తి కలిగింది

కోలపల్లి ఈశ్వరరావు, నెల్లూరు



## సీరియల్స్

స్వర్గీయ మాదిరెడ్డి "యక్షగానం" చదువుతూంటే ఇంతటి మహారచయిత్రి ఇక లేదు— అనిపించి ఎంతో బాధగా అనిపిస్తోంది. "అనురాగ తరంగాలు" సీరియల్ సుఖాంతంతో ముగించినందుకు రచయిత్రి జి. భవానీకృష్ణమూర్తిగారికి థాంక్స్. ప్రముఖ రచయిత్రి, సంఘ సేవాభిలాషి, సున్నిత విశాల హృదయిని అయిన లీలకి భయంకరమైన క్షయవ్యాధికి గురిచేసినందుకు రచయిత్రిమీద మాకెంతో కోపం వచ్చింది. అందుకు క్షమించవలసినదిగా రచయిత్రి భవానీకృష్ణమూర్తిగారిని కోరుతున్నాము. రచనశైలి బాగుంది. కథాగమనం ఎవరో తరుముకొస్తున్నట్లు స్పీడుగా సాగి అయ్యో! అప్పుడే అయిపోయిందా ? అనిపించేలా చేసింది

కె. పద్మలత, సికింద్రాబాదు

## స్త్రీలకి రిజర్వేషన్లు

16–12–83 సంచికలో హైదరాబాదు నోట్‌బుక్ శీర్షికలో స్త్రీలకి 30 శాతం ఉద్యోగాలు కేటాయిస్తూ రాష్ట్ర ప్రభుత్వం శాసనము జారీ చేయడాన్ని సమర్ధిస్తు, హర్షించదగ్గ విషయముగా — తిరుమల రామచంద్రగారు వ్రాసేరు. మహిళలకు ఆర్థికంగా సమాన ప్రతిపత్తి కోసం, ఆస్తి హక్కులు కల్పించబడినపుడు, 30 శాతం రిజర్వేషన్లు అవసరం ఎందుకోమరి వారికే తెలియాలి. అన్ని వర్గాల వారితోపాటు స్త్రీలకు కూడ రిజర్వేషనులు కల్పిస్తే, ఇంకా మిగిలి ఉండేది కేవలం 18 శాతం మాత్రమే ఒ.సి.లో ఉంటుందన్నమాట అంటే సంఘంలో మరొక క్రొత్త బలహీన వర్గం (అగ్రకుల పురుషులు) అవతరిస్తుంది రాను, రాను ఈ దేశంలో మరి ప్రతిభకు స్థానం ఉండదని అర్థమవుతోంది. ఇక ఈ కేటాయింపుల సదుపాయముతో కొన్ని కేటగిరిల వారికి, ఒకటి కాకపోతే ఇంకొటి 2 లేక 3 రకాలుగా అవకాశం లభించడం శోచనీయం.

వి. ఆర్. రాజు, రూర్కెలా (ఒరిస్సా)

## విజ్ఞప్తి

నేను భారత స్వతంత్ర ఉద్యమం అనే పరిశోధక గ్రంధాన్ని వ్రాస్తున్నాను. కావున ఉద్యమకారులు, రచయితలు, విజ్ఞానులు తమకు తెలిసిన వివరాలను నా చిరునామాకు పంపి నా ఈ ప్రయత్నంలో తోడ్పడగలరని భావిస్తున్నాను.

సి. ప్రతాప్, 47–7–32, ద్వారకానగర్, విశాఖపట్నం–16, పిన్ 530016. ★

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు .
**దేశోద్ధారక కాశీనాథుని**
**వాగేశ్వరరావు పంతులుగారు**
స్థాపితం . 1908
***శివలెంక శంభుప్రసాద్***
**సంపాదకుడు :**
[1938–1972]
శుక్రవారం . 10–2–84'
రుధిరోద్గారి నామ సం మాఘ శు అష్టమి
**సంపుటము 76 : సంచిక 22**
**సంపాదకుడు :**
***శివలెంక రాధాకృష్ణ***

విడి ప్రతి వెల రు. 1-50
ఆరు మాసాల చందా రు. 42-90
పోస్టులో ఏడాది చందా రు. 85-80
**ఆంధ్రపత్రిక కార్యాలయము,**
**గాంధీనగరం**, విజయవాడ-520 003.

## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**
హిందీ నటి కోమల్
(ఫొటో జి కె నరసింహం)



# లోకం పోకడ-ఊమెన్



# మనం సాధిస్తున్న అభివృద్ధి

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

"భారతదేశం ఎంత అభివృద్ధి సాధించిందో విదేశాలకి వెడితేగాని తెలీదు" అన్నారు రాజీవ్‌గాంధీ ఆయనే అధికారంలో ఉన్న పార్టీ ఉద్ధారకుడు కాబోతున్నారని వినికిడి ఆయన ఈ మాటలని కలకత్తాలో తమ పార్టీవారిని ఉద్దేశించి అన్నారుట

కాని, ఆ మాటల అర్థం ఏమిటి? అభివృద్ధిని ఎప్పటికప్పుడు గమనించే ప్రణాళికా సంఘం కేంద్ర కార్యాలయం లండన్‌కి మారిపోయిందా? లేక మాస్కోకి మారిందా? దేశంలో ఎందరికో సరయిన తిండిలేదు వారంతా విదేశాలకి బయలుదేరాలా? లండన్ వెళ్లాలా, న్యూయార్క్‌కా? లేక పారిస్‌కా? తమ మాటలకి అర్థంలేదని రాజీవ్‌గాంధీకే తెలుసు అందుకనే ఆయన వివరణ ఏదీ/ ఇవ్వలేదు.

నెహ్రూ కుటుంబం పాలనకింద భారతదేశం అభివృద్ధి చెందిందన్న మాటకి దేశంలో కొందరు (భట్రాజులు)మంచి ప్రచారం కల్పిస్తున్నారు (విదేశాలలోనూ భట్రాజులు లేకపోలేదు) ఈ ప్రచారాన్ని కొందరు నమ్మేస్తున్నారు వాస్తవం ఈ ప్రచారానికి విరుద్ధంగా ఉంది అంతర్జాతీయస్థాయిలో వెనుకబడుతున్న దేశం ఏదయినా ఉంటే అది భారతదేశమే ప్రపంచ బాంకు వాళ్లకి మనం మంచి ఖాతాదారులం అందుకని వాళ్లు మనని గురించి చెడుగా ఏమీ అనరు అయితే, లెక్కలని చూడండి!

1960లో భారతదేశం పారిశ్రామికంగా ప్రపంచంలో 10వ దేశం

1981లో భారతదేశం పారిశ్రామికంగా 22వ స్థానానికి పడిపోయింది త్వరలో 25వ స్థానం, 1990 నాటికి 30వ స్థానం అందుకుంటామా మనం?

ఇదే అన్నమాట అభివృద్ధి అంటే.

భారతదేశాన్ని దాటిన దేశాలు ఏమిటి? బ్రెజిల్, మెక్సికో, స్పెయిన్, అర్జెంటినా, (చెకోస్లోవాకియా కూడా) వంటివి

చమురు సంపదవలన అభివృద్ధి చెందిన దేశాల సంగతి మనకి అనవసరం వాటి సంగతి వేరు బ్రెజిల్, స్పెయిన్ వగయిరాలకి చమురు లేదే! మరి ఎలాగ ముందుకు పోతున్నాయి? వాటికి మాత్రం కష్టాలు లేవా?

గత 30 సంవత్సరాలలో అగ్రరాజ్యం స్థాయిని చేరుకోగలిగిన దేశం ఏదయినా ఉంటే అది భారతదేశమే మనకి సహజసంపద ఉంది తెలివిగల జనం ఉన్నారు సాంస్కృతిక సమయిక్యతా, చారిత్రికావగాహనా ఉన్నాయి ఏమి ఉంటే ఏమి లాభం? మనలో మనం కొట్లాడుకోవడంతోనే సరిపోతుంది మనకి మన జాతీయ సంస్థలు పరస్పర విరుద్ధంగా పని చేస్తున్నాయి ప్రభుత్వ రంగానికీ, ప్రయివేటు రంగానికీ పడదు పెద్ద పరిశ్రమల వారికీ, చిన్న పరిశ్రమల వారికీ పడదు గ్రామాలకి, నగరాలకీ పడదు రాష్ట్రాలకీ, కేంద్రానికీ పడదు అధికారులకీ ఎవరికీ పడదు

నా స్నేహితుడు ఒకాయన ఈ మధ్యనే పాకిస్తాన్ వెళ్లివచ్చాడు అక్కడి వాళ్లు ఇక్కడి కన్నా బాగానే ఉన్నారనిపించిందన్నాడు-- తిండీ, గుడ్డా విషయంలో ఆయన అమెరికా సంయుక్త రాష్ట్రాల కేంద్ర శాసనసభ అయిన 'సెనేట్' యొక్క విదేశీ వ్యవహారాల సంఘంలో సభ్యుడు ఆసియాలోని కొన్ని దేశాలు పర్యటించటానికి వచ్చాడు పాకిస్తాన్‌లో అంగళ్లన్నీ సరుకుతో నిండి ఉంటాయన్నాడు ఆయన వెలలు అధికంగానే ఉన్నా అమ్మకాలు బాగానే ఉన్నాయని ఆయనకి అనిపించిందిట పాకిస్తాన్‌లో ఎన్నో ఊళ్లు చూశాడు ఆయన బేనజీర్ భుట్టోని చూడటానికి వెడదామనుకుంటే ఆవిడ యూరోపు వెళ్లిపోయారని చెప్పారుట ఇదంతా సరే కాని, పాకిస్తాన్ అభివృద్ధి మాత్రం బాగానే ఉందని మా మిత్రుడి అభిప్రాయం [ఆయన జియా అభిమాని కాడు జియా విధానాలంటే ఆయనకి ఇష్టం లేదు]

మనం ఎందుకు ఇంత పతనం అయ్యాము? నా అనుమానం ఇది గత 30 సంవత్సరాలలో మనం ఒక వర్గాన్ని సృష్టించుకున్నాము ఈ వర్గానికి చెందిన రాజకీయవాదులూ, వారి పరివారమూ పరాన్న భుక్కులయి పోయారు. పేదరికం, ఆర్థికమాంద్యం ఉంటేనే వాళ్లకి మంచిది జనం బాగుపడిపోతే వీళ్లమాట వినరేమో! అలాగ కాకుండా నూటికి 30 మంది కటిక దారిద్ర్యం అనుభవిస్తూ ఉంటే వాళ్లని ఇష్టం వచ్చినట్లు దబాయించవచ్చు కదా! బ్రిటన్ సంగతే తీసుకోండి అక్కడ 30 లక్షల మందికి ఉద్యోగం లేదు ఇంతమంది నిరుద్యోగులు ఉన్నప్పటికీ అక్కడ ఉద్యోగాలు బాగా ఉన్నప్పుడంత అలజడి కూడా లేదు పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలలో నిరుద్యోగులు వెనుకబడిన దేశాలలో నిరుద్యోగుల లాంటి వాళ్లు బ్రిటన్‌కి శ్రీమతి థాచర్ ఉంటే మనకి శ్రీమతి గాంధీ ఉన్నారు ఇద్దరూ 'ఉక్కు వనిత'లే ఇద్దరి రాజకీయ సిద్ధాంతాలూ ఒకరకానివే బ్రిటన్ ఒకప్పుడు ప్రపంచంలో పారిశ్రామికంగా 4వ లేదా 5వ దేశంగా ఉండేది ఇప్పుడు 8వ దేశం భారతదేశం స్థానం 10 నుంచి 25కి పడిపోయింది అందుకనే మనం లండన్‌లో వేడుకలు జరుపుకుంటాము, ఇంగ్లీషువాళ్లు వాళ్ల రాణిని మన దేశానికి పంపుతారు

1945 లో రెండవ ప్రపంచ యుద్ధం ముగిసింది యుద్ధం తరువాత భారతదేశంలో తయారయినన్ని కారులు జపాన్‌లో తయారయ్యేవి కావు తాతా కంపెనీ ఒక్కటే జపాన్‌లో తయారయేటంత ఉక్కు తయారు చేసేది అప్పుడు జపాన్ తలసరి ఆదాయం మన ఆదాయంకన్నా కొంచెమే ఎక్కువగా ఉండేది ఇప్పుడో? జపాన్ పారిశ్రామికంగా ప్రపంచంలోనే 2వ దేశం, ముడి ఉత్పత్తి విషయంలో అమెరికాకన్నా కొంచెమే తక్కువ తలసరి ఉత్పత్తిని తీసుకుంటే జపాన్ సోవియెట్ యూనియన్‌ని మించిపోయింది మరి జపాన్‌కి చమురు సంపద ఉందా? లేదు ఇనుము ఖనిజాలు వున్నాయా? లేవు బొగ్గు ఉందా? అదీ లేదు మనకి ఇవన్నీ బాగా ఉన్నాయి మన ఉక్కు ఉత్పత్తి పెరగకపోగా తగ్గుతోంది! విదేశాలవాళ్లు కొందరు మనకి ఏదో అమ్మటానికి వచ్చినప్పుడు మనని ఒకటే పొగుడుతారు వీళ్ల మాటలను నమ్మే బదులు రాజీవ్‌గాంధి ప్రపంచబాంకు వెలువరించే నివేదికలని చదవాలి. అప్పుడు తెలుస్తుంది ఆయనకి అసలు పరిస్థితి ఏమిటో! ★

# చెప్పుల భాగోతం


అయ్యా! మీ మీద గౌరవం కొద్దీ
చెప్పులు గుమ్మం దగ్గరే వదిలేసి వస్తే
అవి కాస్తా ఎవరో
ఎత్తుకు పోయారు!


నా గదిలోకి చెప్పుల్తో వస్తావా?
ఎంత ధైర్యం - ఆఁ!
...చెప్పు తిన్న వారు తమ చెప్పు- విరుగరు...


చెప్పులతో లోనికి రాకూడదు!
వాటితో ఎవరైనా కొడతారేమోనని భయం!


గౌరవం కొద్దీ చెప్పులు విడిచేసి
రావటం కాదండీ - నాకసలు
చెప్పులే లేవు!


నిజమే- చెప్పులు బయట వదిలేసి రావాలి!
కానీ వెళ్లేటప్పుడు మర్చిపోతానేమోనని
భయమేసింది!
శాంత

## కావాలనుకున్న వారిని కడగండ్ల పాలు చేసిన

# కోహినూర్



విదేశీయుల పరమైన కోహినూర్ వజ్రం, నెమలి సింహాసనంవంటి పురాతన కళాత్మకమైన వస్తువులను తిరిగి పొందడానికి భారతదేశం తీవ్రమైన ప్రయత్నం చేస్తోంది ఇందుకై ముఖ్యంగా యునెస్కో, అలీనదేశాలు మద్దతు ఇస్తున్నట్లు విద్యా సాంస్కృతిక వ్యవహారాల మంత్రి శ్రీమతి షీలాకౌల్ చెప్పారు

వెలకట్టలేని కోహినూర్‌ను చూసి ముచ్చటపడి కావాలనుకున్న ఏ ఒక్కడు సుఖపడలేదంటే ఆశ్చర్యమేస్తున్నది

హుమాయూన్ చక్రవర్తిని ఒక రాజపుట్ బంగారు వ్యాపారి కోహినూర్ ధర గురించి అడిగితే అది ఎప్పుడు ఖరీదుకు అమ్ముడుపోలేదని, ఒక రాజునుంచి ఇంకొక రాజుకి కానుక ఇవ్వబడిందని, లేదా యుద్ధంలో గెలుచుకోబడిందని అన్నాడట

### కలియుగ శమంతకమణి !

ఈ వజ్రాన్ని మహాభారత కాలం నాటి శమంతకమణితో పోల్చవచ్చు శమంతకమణి పొందిన సత్రాజిత్, జాంబవంతుడు, కృష్ణుడు కష్టాలపాలయ్యారు కోహినూర్ పొందినందునే అశోకుడు అనంతరం అతని మౌర్య సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది అశోకుని దగ్గర ఈ వజ్రం ఉంది తరువాత చాల కాలం దీని అతీగతీ తెలీలేదు

బాబరు తన కుమారుడు హుమాయూన్ పానిపట్టు యుద్ధానంతరం 1526 లో ఆగ్రా నుంచి 187 కేరట్లుగల ఒక వజ్రాన్ని తనకు బహూకరించినట్లు తన స్వీయ చరిత్రలో పేర్కొన్నాడు

హుమయూన్‌కు ఇది ఎలా సంక్రమించింది అనేందుకు చాలా ఆధారాలే ఉన్నాయి

ఈ వజ్రం అబ్దుల్లా కుతుబ్‌షాహి తన మంత్రి మిర్‌జుమ్లాకు దీనిని బహూకరించాడు వీరిద్దరి మధ్య పొత్తు కుదరలేదు మిర్‌జుమ్లా అబ్దుల్లా చేతుల్లోంచి తప్పించుకొని షాజహాన్ ఆశ్రయం పొంది అతనికి ప్రతిఫలంగా కోహినూర్ బహూకరించాడని చరిత్ర చెపుతోంది మిర్‌జుమ్లా దీని చెడు ప్రభావం నుంచి తప్పించుకోగలిగాడు కాని షాజహాన్ తప్పించుకోలేకపోయాడు అతని సామ్రాజ్యం పతనమయ్యింది 1739 లో మహమ్మద్ షా మొగల్ చక్రవర్తిగా పరిపాలిస్తున్నప్పుడే నాదిర్‌షా మొగల్ సామ్రాజ్యంపై దండెత్తి కోట్లాది విలువచేసే ఆభరణాలతో కూడ కోహినూర్ వజ్రం, నెమలి సింహాసనం హస్తగతం చేసుకున్నాడు నాదిర్‌షా మొట్టమొదటిసారి ఈ వజ్రాన్ని చూసి కనులు మిరుమిట్లు గొలిపే దీని కాంతులకు ఆశ్చర్యపోయి "కో–హి–నూర్" ["కాంతి పర్వతం"] అన్నాడు మరో ముగ్గుర్ని నాశనం చేసి నాదిర్‌షా మనువడు షారుక్‌కు ఈ వజ్రం వారసత్వంగా సంక్రమించింది అహ్మద్‌షాఅబ్దుల్‌ఆలిషారుక్‌పై దండెత్తి అతనిని ఓడించాడు అబ్దుల్‌ఆలి అనంతరం అతని కుమారుడు తైమూర్ దీనిని పొందాడు తైమూర్ తరువాత అతని 23మంది కుమారులు రాజ్యం కోసం తన్నుకున్నారు వీరిలో మహమ్మద్‌షా, జామన్‌షా, షాసుజా సంహాసనం అధిష్టించను ఎదురు చూస్తున్నారు జామన్‌షా దగ్గర కోహినూర్ ఉండినది మహమ్మద్‌షా కాబుల్‌ను స్వాధీనం చేసుకొని జామన్‌ను ఖైదీ చేసి వజ్రం కోసం చిత్రహింసలు పెట్టాడు ఎలాగో సుజా సహాయంతో జామన్ ఖైదీ నుంచి బయటపడి అతనికి ప్రతిఫలంగా కోహినూర్‌ను బహూకరించాడు




### ఈస్టిండియా కంపెనీ కైవసం !

మహమ్మద్ తిరిగి సుజాపై దండెత్తగా అతను పంజాబ్‌కు పారిపోయి మహారాజ్ రంజిత్ సింగ్ ఆశ్రయం కోరాడు రంజిత్‌సింగ్ సహాయం చేసినట్లే చేసి కోహినూర్‌ను అపహరించాడు కాని రంజిత్‌సింగ్ కోహినూర్ వజ్రం పొందినందువల్ల వచ్చే కష్టాలు గుర్తించి దానిని పూరి జగన్నాథునికి కానుకగా ఇస్తే బాగుంటుందని అభిప్రాయపడ్డాడు కాని ఆ పని జరుగలేదు రంజిత్‌సింగ్ మరణానంతరం 1829 లో అతని కుమారుడు దిలీప్‌సింగ్ తన వద్దనున్న కోహినూర్ వజ్రంతో సహా అన్ని రాజరికపు ఆభరణాలు ఈస్ట్ ఇండియా కంపెనీకి ఇచ్చి బదులుగా సాలుకు అయిదు లక్షల రూపాయలు పెన్షన్‌గా పొందేటట్లు ఒడంబడిక కుదుర్చుకున్నాడు బోర్డ్ ఆఫ్ కంపెనీ పరంగా, సర్ హెన్రీ లారెన్స్, జాన్ లారెన్స్, సి. జి మాండల్ వద్ద కోహినూర్ భద్రపరచబడింది అటు పిమ్మట జె డబ్ల్యు హోగ్‌చే విక్టోరియా మహారాణికి కానుకగా సమర్పించబడినది ఆమె దానిని సాన పెట్టించి తన కిరీటంలో పొదిగించారు కోహినూర్ గల ఈ కిరీటం ఇప్పుడు టవర్ ఆఫ్ లండన్‌లోని ఆభరణాల గదిలో భద్రపరచబడింది.

1947 అనంతరం ఈ వజ్రాన్ని తిరిగి స్వాధీనం చేసుకోవాలని భారత ప్రభుత్వం చర్చలు జరిపింది ఒకవేళ భారతదేశం ఈ వజ్రాన్ని తిరిగి పొందితే అది భారత ప్రభుత్వానికి చెందుతుందా ! లేక పూరి జగన్నాథునికి చెందుతుందా అనేది ఒక మీమాంస లాహోర్ నుంచి తీసుకెళ్లబడింది గనుక పాకిస్తాన్ అది తమకు చెందాలంటుంది షాసుజా చిట్టచివరి స్వంతదారు గనుక ఆ వజ్రం మాదేనని ఆఫ్ఘనిస్తాన్ కూడ అనవచ్చునేమో ! ★

[ - ఒ. వి. ]

## ఉత్తమ ప్రమాణ గ్రంథాలు

(లక్షలాదిమంది ఎంపిక చేసుకొన్నవి)



1. డ్రాయింగ్ & పెయింటింగు రు. 20/-
2. ప్రైవేటు ఫొటో ఆల్‌బమ్ (144 పేజీలు) రు. 30/-
3. సెక్సు అట్లాస్ (320) వరములు రు. 20/-
4. కొక్కో శాస్త్రం (కామసూత్ర) రు 25/-
5. (68) పడకగది ఫొటోలు రు. 25/-
6. టెయిలరింగు & కట్టింగ్సు రు. 20/-

ప్రతి పుస్తకమునకు పోస్టేజి & ప్యాకింగుకు రు 7-50 పంపండి

**CHOICE INDIA (C-2)**
4, Ansari Road, DELHI-110002

---








## తలలు రెండూ కలిసినప్పుడు పేలకు లభిస్తుంది కొత్త నివాసం

స్కూలు గాని, ఇల్లు గాని థియేటరు గాని కావచ్చు పేలు వ్యాపించెందటానికి ఇదే అవకాశం
లైసిల్‌లో ఆల్కహాల్ లేదు
ఇతర పేల మందులవలె లైసిల్ ఇగిరిపోదు ఇది మీ తల జుట్టులో ఉండే తేమను పోషణనిచ్చే ముఖ్యమైన నూనెలను లాగేసి జుట్టు పొడిగా బిరుసుగా తయారయేలా చేయదు చుండ్రు పట్టనివ్వదు
లైసిల్ ఆయుర్వేద పద్ధతిలో రూపొందించిన నూనెలు గలది
సువాసనచిందే లైసిల్ పేలనూ ఈళ్ళనూ చంపివేసే పనేగాక తలకు, జుట్టుకూ పోషణను సమకూర్చి చుండ్రు పెరగకుండా చేస్తుంది
ఎందరెందరో డాక్టర్లు లైసిల్ వాడమని సలహా ఇస్తారు

**సత్వరం సురక్షితం ఫలప్రదం**


**సుజానిల్ కెమో ఇండస్ట్రీస్**
గణేశ్ నగర్ చించ్‌వాడ్. పూనా-411 033




సుజానిల్స్
## లైసిల్
సుగంధిత పేల సంహారిణి

Expresso/SCI/80/TL

---

# ఆంధ్రపత్రిక

## చందా వివరాలు

| | ఏజంటు ద్వారా | పోస్టు ద్వారా |
|---|---|---|
| 1 మాసం | 15-40 | 17-30 |
| 3 మాసములు | 46-20 | 51-90 |
| 6 మాసములు | 92-40 | 103-80 |
| 1 సంవత్సరం | 184-80 | 207-60 |

---

## విశాఖపట్నం జిల్లాలో ఎడ్వర్టయిజ్‌మెంట్ రిప్రజెంటేటివ్‌గా

పని చేయడానికి ఒక ప్రముఖ వార్తాపత్రిక సంస్థకి తగిన అభ్యర్థులు కావలెను ముఖ్యంగా విశాఖపట్నం సిటీలో పనిచేయవలసియుంటుంది గత అనుభవంగలవారికి, స్థానికులకు ప్రాధాన్యత చూపబడును. విద్యార్హతలు, అనుభవము, వయసు, కోరుకుంటున్న జీతము మొదలైన వివరాలతో మీ దరఖాస్తులను

బాక్సు నెం. W. 112,
కేరాఫ్ ఆంధ్రపత్రిక,
విజయవాడకి 20 రోజులలోగా పంపాలి.

# గాడ్సే పుట్టిన దేశం

పైడిశ్రీ




సాయంకాలమైంది

వెన్నుపోటు తిన్న జూలియస్ సీజర్‌లా తుపాకీ గుండుకు బలైన అహింసావాదిలా జల్లులా కురిసే గులకరాళ్లమధ్య గుట్టగా పడిపోయిన మానవతా ప్రవక్తలా బల్లేల పోట్లతో అరచేతుల మేకులతో సిలువమీద మిగిలి పోయిన విశ్వ మానవతామూర్తిలా నింగీ నేలల మధ్య వూగిసలాడే నిప్పుల సుడిగుండంలా నెత్తుటి ఖండంలా ఆకాశంలో మిగిలిపోయేడు సూర్యుడు విషపుగోళ్లతో చీల్చిన విశ్వప్రేమ చిందించిన నెత్తుటి కెరటంలో తడిసిన సమర భూమిలా వుంది పశ్చిమ గగనం

ప్రకృతి అంతర్గతంగా యింత బీభత్సరస ప్రధానమైనా ఆ సాయంకాలం చల్లగానే వుంది ఆ చల్లదనం ఎప్పట్లాగే ఆహ్లాదకరంగా వుంది ఎప్పట్లాగే గాంధీనగర్ కాలనీలోని ప్రతి యిల్లూ సాయంకాలాన్ని అంతో యింతో ఎంజాయ్ చేస్తోంది కానీ ఆ కాలనీ నుండి విసిరేసినట్టుగా కొద్ది దూరంలో ఒంటరిగా వున్న గుడిసె మాత్రం వెచ్చగా వుంది మౌనంగా వుంది. తుఫాను ముందరి ప్రశాంతత సంతరించుకుంది

అప్పటిదాకా తనని కొలిమిలో కాల్చి కాల్చి, బైటికిలాగి, డొక్కలో కుమ్మినట్టుగా విలవిల్లాడేడు అప్పలకొండ అతని శరీరం ఏ మూల తాకినా ఒకే జ్వరం — అది విషజ్వరం

ఎవరో అప్పలకొండ ? ఏమా కథ ?

అప్పలకొండ వెనుక తిరపతికొండంత కథే వుంది అందులోంచి చీమంత కథ చెప్పుకున్నా వాడి కథ చాలావరకు మనకు అర్థమౌతుంది.

అప్పలకొండది ఆ వూరు కాదు. ఏ వూరో ఎవరికీ తెలీదు. అతని తల్లిదండ్రులెవరో అతనికే సరిగ్గా తెలీదు అప్పలకొండ పుట్టుక గురించి ఆ కాలనీలో అనేక కథలు వినిపిస్తాయి. . వినే ఓపిక వున్నవాళ్లకి

మచ్చుకు రెండు.

చాలా యేళ్ల క్రితం యీ కాలనీలో సీతాలు అని ఓ పడుచుపిల్ల పని చేస్తుండేదని, దాని అమాయకత్వాన్నీ .. అతిచనువునీ ఆసరాగా

చేసుకుని ఎవడో పున్నెం కట్టుకున్నాడని తత్ఫలితమే యీ అప్పలకొండనీ ఓ కథ

ఆ కాలనీ అక్కడ నిర్మించక ముందు నుంచే ఊరికి దూరంగా ఓ పంచమ కులస్థుడి కుటుంబం కాపురముంటూ వచ్చిందని, కాలచక్ర గతుల్లో అది చెల్లాచెదురైందనీ ఆ కుటుంబానికి సంబంధించిన ఆఖరి పుష్పం యీ అప్పల కొండనీ ఓ కథ ప్రస్తుతం అందరూ నిజమే అని నమ్ముతున్న కథ కూడా అదే

అప్పలకొండ పుట్టుపూర్వోత్తరాలు ఎలా వున్నా దాదాపుగా పాతికేళ్లుగా అక్కడ వుంటూ వస్తున్నాడన్నది మాత్రం వాస్తవం ఇంతకీ అప్పలకొండకీ, ఆ కాలనీకి వున్న సంబంధం ఏమిటి ?

ఉదయాన్నే నిద్రలేవడం – రాజశేఖరంగారి యిల్లు మినహా ఆ కాలనీలోని ప్రతి యింటికి వెళ్లడం– వాళ్లేదయినా పని పురమాయిస్తే త్రికరణశుద్ధిగా దాన్ని చేసుకురావడం – ఏ యింట్లోనో వేళకింత తినడం – తనకంటూ మిగిలిన ఆ పాకలో కునుకు తియ్యడం ! ఇదీ అతని దినచర్య (అతను పంచముడని అతన్ని కాలనీలోకి రానిచ్చి అపరిశుద్ధులు కావద్దని రాజశేఖరం ఒకటే పోరు పెడుతున్నా, అప్పల కొండని దూరంగా వుంచితే యివతల కాలనీలో జరగవలసిన పనులు ఫ్రీగా, చవగ్గా జరగవు కాబట్టి పనులు చేయించుకునే విషయంలో అతను అంటదగిన నాడయ్యేడు ) ఆ కాలనీకి పెద్దదిక్కుగా వుంటున్న రాజశేఖరంగారు మాత్రం అప్పలకొండని తన యింటివేపు రానివ్వడు క్షీణించిపోతున్న ఆచార సాంప్రదాయాలకు ఆధారంగా నిలబడ్డ రాజశేఖరం వీలున్నంతవరకు అప్పలకొండని ఆ కాలనీ నుంచి దూరంగా తరిమెయ్యాలన్న ఆలోచనలో వున్నాడు

నిన్నటి ఉదయాన ఎప్పట్లాగే నిద్ర లేచిన అప్పలకొండ తలనొప్పిగా, ఒళ్లంతా నలతగా, కొంచెం జ్వరం కాస్తున్నట్లుగా వుండేసరికి ప్రక్కమీద అలాగే కూర్చుండిపోయేడు ఏదో ఆలోచిస్తూ సరిగ్గా అప్పుడే కబురొచ్చింది షణ్ముగంగారింటి దగ్గిర్నుంచి. పిలిచినప్పుడు వెళ్లపోతే పిట్టకడుపు నిండదు కనుక నిట్టూర్పు స్తూనే పైకి లేచేడు అతనికోసమే ఎదురు చూస్తున్న షణ్ముగం "రారా అప్పలకొండా " అంటూ పెరట్లో వున్న బావి దగ్గరికి తీసుకు వెళ్లేడు ఆయన వెంట లేని హుషారు తెచ్చుకు మరీ నడిచేడు అప్పలకొండ

"మా చిన్నోడు యిందులో బంగారు వుంగరాన్ని పడేసేడు కాస్త దిగి తీసిపెట్టు నీకు అరడజను యిడ్డెన్లు, మార్నింగ్ షోకి డబ్బులు యిస్తా " అన్నాడు షణ్ముగం బావిలోకే చూస్తూ

బావి లోతు, అందులో వున్న నీటిమట్టం, అందులో దిగి "ఉంగరం దేవులాడేందుకు" తనకున్న యోగ్యత, అనారోగ్యం వరసగా అంచనా వేసుకుని "నావల్ల కాదు బాబయ్యా" అన్నాడు మామూలు నీరసంతో ఆ మాటవిని తారెత్తి పోయాడు షణ్ముగం

"బాబ్బాబా కాదనకు కావాలంటే డజను యిడ్లీలు, మార్నింగ్ షోకి డబ్బులిస్తా. ఇంకా జాగు చేస్తే ఏ అడుగులోనో కూరుకు పోయినా పోగల్దు "

ఇంతలో షణ్ముగంగారి సతీమణి పద్మావతమ్మ వచ్చిందక్కడికి

"ఒరేయ్ అప్పడూ నువ్వు బావిలో దిగి వుంగరం కనుక బైటికి తీస్తే అయ్యగారు వేసుకునే బట్టల్లోంచి మంచివి ఓ జత బటలిస్తా " నొక్కవలసిన చోటే నొక్కింది పద్మావతమ్మ. లోగడ ఒకట్రెండు సార్లు అప్పలకొండ ఆమె నడిగేడు ఆ బట్టల కోసం అప్పట్నుంచి ఆమె ఆమాటా యీమాట చెప్పి వాయిదా వేస్తూ వచ్చింది

"అదికాదమ్మగోరో ఒంటో ఆరోగ్యం సర్నేదు అదట్టాగుంచీసినా రాత్తిర్నుంచి పడిసెం పట్టేసినాది జొరం గూడా గాసింది యిట్టా వుండి బాయిలో దిగి, నీలలో నానిపోతే యింకే టన్నా వుంటదా ఈ పూటకి ఒదిలీసిండి రేపెప్పుడయినా ఎదికిపెడతా" కాదనలేనట్టుగా మొహం పెట్టి అన్నాడు అప్పలకొండ

"ఒంట్లో నీరసంగా వుంటే యిడ్డెన్లు పెడతా తిను " అంటూ లోనికికెళ్లి ఆకులో ఓ అరడజను యిడ్లీలు తెచ్చిపెట్టింది పద్మావతమ్మ

అప్పలకొండ అనుమానంగానే బావిలోకి దిగేడు

పైనుండి షణ్ముగం, పద్మావతమ్మలు చెప్పిన చోటల్లా మునుగుతూ తేలుతున్నాడు ఫలితం కనిపించలేదు అర్థగంటదాక అప్పటిదాకా తన అధీనంలో వున్న అవయవాలు పట్టు తప్పినయ్

క్షణక్షణానికి శక్తి నశించిపోతోంది

తన అశక్తతని ఆవేదనగా వెళ్లబోసు కున్నాడు అప్పలకొండ "పై వాళ్లతో"

ఫలించలేదు

ఒడ్డుమీద నిలబడి రాళ్లేసే వాళ్లమాటలు తీవ్రంగా వున్నాయి

ఏదైతే అదవుతుందనుకుని మొండికెత్తి గాలించసాగేడు అప్పలకొండ. మరో అరగంటకు ఫలించిందతని శ్రమ ఉంగరం నోట్లో వేసుకుని బావిలోకి వ్రేలాడుతున్న తాడు దగ్గరికి ఈదుకు రాగలిగేడేగాని దాన్ని పట్టుకుని ఒడ్డుకు చేరడానికి శక్తి చాలక, "బాబో తాడట్టుకు ఎక్కలేక పోతుండా తాడు కాస్త గిలక్కి తగిలించి తమరే పైకి లాగండి"అన్నాడు అలవిగాని ఆయాసంతో

అలాగే చేసేరు ఒడ్డుమీదివాళ్లు

అతన్ని జాగ్రత్తగా పైకి లాగేక అతని ఎగశ్వాస చూసి ఇద్దరికీ భయమేసింది అతన్నుంచి ఉంగరం తీసేసుకున్నాక దాన్ని అరడజనుసార్లు సబ్బుతో కడిగి మరీ చేతికి పెట్టుకుంటూ పద్మావతిని పిల్చేడు షణ్ముగం

"ఏమేవ్ ! వాడి వాలకం చూడబోతే చచ్చేట్టున్నాడుగానీ వెధవకి ఓ రూపాయి చిల్లర డబ్బులు వుంటే యిచ్చి పంపించేసెయ్ ఇక్కడే చస్తే అదో గొడవ "

ఆ మాటలు స్పష్టంగా గాకపోయినా






## గాడ్సే పుట్టిన దేశం

లీలగా వినిపించేయి అప్పలకొండకి ఏరుదాటం తర్వాత తెప్పతగలెయ్యడం అనే లోకోక్తికి ప్రాణం పోసిన షణ్ముగాన్ని మనసులోనే అసహ్యించుకుంటూ పద్మావతి అందించిన చిల్లర డబ్బులు జేబులో వేసుకుని తడిసిన బట్టలతోనే తన పాక వేపు కదిలేడు అప్పలకొండ

తడిసిన తల తుడుచుకోకుండా పాకలో పడుకుని అలసటగా కళ్ళు మూసుకున్నాడు వెంటనే ఏ మాత్రమూ వ్యవధిలేకుండా ఆ దరి దాపుల్లోనే పొంచివున్న జ్వరం అతన్ని చుట్టేసింది అలా పునరావహించిన ఆ జ్వరం అసురరూపం దాల్చి విషజ్వరమైంది ఆ విషజ్వరం ఫలితంగానే ఆ మూల్గులు. ఆ రోదనలూను

ఎప్పుడూ తమముందరే యంత్రంలా తిరుగాడే అప్పలకొండ రెండ్రోజులుగా కనిపించకపోవడంతో అతనితో కొద్దిపాటి అవసరం పడ్డ ఎల్డీసీ యాదగిరి పాకవేపుగా వెళ్ళేడు లోపల్నుంచి వినిపించే మూలుగులు ఏమిటా అని చూస్తూ వెదురు తడికని నెట్టి చూసిన యాదగిరి నిశ్చేష్టుడయ్యేడు

లోపల చింకిచాపమీద ఉండలు చుట్టుకుపోతూ కనిపించేడు అప్పలకొండ

"ఒరేయ్ అప్పడూ ఏమైందిరా నీకు" అంటూ కంగారుగా అతన్ని సమీపించి అతను నోరు విప్పకముందే విషయం గ్రహించేసి హడావిడిగా బైటికొచ్చేసేడు యాదగిరి

అప్పలకొండ ప్రాణాలతో ఆడుకుంటున్న విషజ్వరం గురించి క్షణాలమీద తెలిసిపోయింది కాలనీ మొత్తానికి యాదగిరి చెప్పిందాకా తమకు ఆ విషయం తెలీనట్టు నోరెళ్ళబెట్టి చూసేరు అంతా

నిజానికి అప్పలకొండ పరిస్థితి ఆ కాలనీలో సగానికిపైగా తెల్సు కానీ పైకి మాత్రం ఎవరూ అన్లేదు .. అంటే ఆ భారం తన నెత్తికెక్కడ చుట్టుకుంటుందోనని అప్పలకొండని మార్కెట్‌కి పంపించాలని గంగప్ప అతని దగ్గరికి తన్న కొడుకుని పంపినపుడు వాడి కథనం ప్రకారం విషయం గ్రహించేసేడు "ఎవడేమయిపోతే నాకేం నేను మాత్రం నిశ్చింతగా నిక్షేపంలా వున్నాను అదే చాలు–" రాంభద్రం

ఉదయం నుండి పన్లోకి రాలేదెందుకని అని అడగడానికెళ్లిన పెరుమాళ్ళుగారికి ఉదయమనగా తెలుసు ఆ విషయం

షణ్ముగానికి సరేసరి !

ఇలా అప్పలకొండతో అవసరంపడి అతని పాకలోకి వెళ్లిన వాళ్లందరికీ అతను అపస్మారక స్థితిలో పడున్నట్టు – అతని విషజ్వరం కొండచిలువలా మింగేస్తున్నట్టు తెలుసు అయినా ఎవరికి వారే కుక్కిన పేను మాదిరిగా

యాదగిరి ఆ విషయం వాళ్లతో చెప్పి

నవుడు కొందరికి గ్లిజరిన్ అక్కరలేకుండానే కన్నీళ్లొచ్చేయి

"అప్పలకొండని హాస్పిటల్లో చేర్పిస్తే తప్ప బతికేట్టు లేదు" తక్షణ కర్తవ్యాన్ని తెలీ జేసేడు

"అందరం కలిసి రాజశేఖరంగారి సలహా ప్రకారం నడుద్దాం" అని నిర్ణయించుకుని ఆయన యింటికెళ్లేరు

తాపీగా చుట్టముట్టిస్తూ అన్నాడాయన "వాణ్ణి హాస్పిటల్లో చేర్పించాలంటే మాటలా యాదగిరీ ముందు మంచి డాక్టర్ని, నర్సింగ్ హోమ్‌నీ వెదకాలి ఆయన్నెలాగో బ్రతిమాలి ఓ బెడ్డు సంపాదించాలి పరీక్ష ఫీజు చెల్లించి పరీక్ష చేయించాలి రాసిన మందూ మాకూ తేవాలి ఇవిగాక పళ్లూ గ్రట్రా పట్టుకురావాలి అతన్నే కనిపెట్టుకుని పగలూ రాత్రీ ఓ మనిషి వెంటవుండాలి ఇదంతా జరగాలంటే ఎంతో డబ్బు, శ్రమ అవసరం ఎవరికీ ఏమీకాని అప్పుడికి యింతా చేయాలంటే అందరం తలా కాస్త భారం పంచుకోవాలి అసలే నెలాఖ రోజులయిపోయె ఇప్పట్లో అది అసాధ్యమని నా అభిప్రాయం" అంతా ఆ అభిప్రాయంతో ఏకీభ వించేరు ఆయన మాటలు సాంతం విన్నయాదగిరికి నోట మాట రాలేదు కానీ రాజశేఖరం మనసులో ఏదో పెట్టుకుని మాట్లాడుతున్నట్టు గ్రహించ గలిగేడు ఆ ఏదో ఏమిటో అతనికి తెలుసు అతడేగనుక సవర్ణుడై వుంటే ఆయన ఆ మాట అని వుండేవాడా? అదే తన కొడుకో కూతురో అయితే అలా తాపీగా మాట్లాడతాడా? పెల్లుబికి వస్తున్న కోపాన్ని అణచిపెట్టు కుంటూ "ప్రైవేటు హాస్పిటల్లో కాకపోతే గవర్నమెంటు హాస్పిటల్లో చేరుద్దాం అంతా వాళ్లే చూసుకుంటారు ఇన్నాళ్లు యీ కాలనీకి వాడు చేసిన సేవకి మనం యీ మాత్రమైనా చెయ్యడం కనీస ధర్మం" అన్నాడు యాదగిరి అందరివేపు చూస్తూ

"వాణ్ణి గవర్నమెంటు హాస్పిటల్లో చేర్పించి దారుణంగా చంపించేకంటే వాడి సొంత యింట్లోనే చావనివ్వడం మంచిది చచ్చేక వాడి ఆత్మకు ఆపాటి తృప్తయినా మిగుల్తుంది ఏవంటారు?" అన్నాడు పతంజలి అప్పుడు చావడం తథ్యం అంతదానికి మనం అనవసరంగా శ్రమపడ్డం, ఆందోళనపడ్డం ఎందుకు అన్న అర్థాన్ని స్ఫురింపజేస్తూ వెంటనే వ్యవధి ఏమాత్రం లేకుండా అందుకున్నాడు రాజశేఖరం "అయినా ఎవడో కోన్‌కిస్కాగాణ్ణి గురించి ఎందుకయ్యా యింత తర్జనభర్జనలు వాడేమైనా మన కులమా మన గోత్రమా మన చుట్టమా... అధమం ఏదైనా దూరబ్బంధువా ఆ వీధి కుక్కతో సమ్మానం వాడు. మున్సిపాలిటీ వాళ్లు వీధికుక్కలకి మందు పెట్టి మరీ మన కళ్లముందరే చంపుతోంటే మనం అడ్డుపడు తున్నామా? అంతే యిదీనూ ఎందుకొచ్చిన గొడవ యిదంతా ఏదైతే అదవుతుంది పదండి వెళ్దాం"

ఆయన మాటమీద ఎంతో గౌరవమున్నట్టు ఎక్కడివాళ్లక్కడ సర్దుకున్నారు ఆఖర్న యాదగిరి ఒక్కడే మిగిలిపోయేడు అతని దగ్గరగా వచ్చి భుజమ్మీద చెయ్యేసి మెల్లగా చెప్పేడు

"చూశావుగా యాదగిరీ ఎక్కడివాళ్లక్కడ జారుకున్నారు. ఎవరికీ పట్టని విషయం నీకు మాత్రం ఎందుకు నిన్నట్నుంచి కాస్తున్న విషజ్వరం వాణ్ణి యిప్పుడో యింకాస్సేపట్లోనో ఎగరేసుకుపోవడం తథ్యం" ఆ మాటలంటోంటే రాజశేఖరం మనసు సంతృప్తిగా నవ్వుకుంది చంద్రుణ్ణి పట్టిన గ్రహణం విడవడం నూసినట్టు—తను మనసుపడి పెంచుకున్న గులాబీ మొక్కకు పట్టిన చీడ, చచ్చిపోయినట్టు

రాజశేఖరం వేపు అసహ్యంగా చూస్తూ గేటు దాటి బైటకొచ్చేడు యాదగిరి పొద్దున్న లేచిందగ్గర్నుంచి నిద్ర పోయేదాకా పన్లు చేయించుకునే కాలనీ మనుషులేనా వీళ్లు?

అప్పుడు వాళ్లచేత వీధికుక్క అనిపించు కునేంత స్థాయికి దిగజారేడా? లేక అతన్ని వీధి కుక్కగా తప్ప సాటి మనిషిగా గుర్తించలేని స్థాయికి ఎదిగిందా వీరి సంస్కారం. ఛీ వీళ్లు మనుషులా? కాదు

యాదగిరి కడుపుమంట తారస్థాయికి చేరింది ఏదైతే అదవుతుందని పాకవేపు అడుగు లేసేడు యాదగిరి అది చూసిన ఎవరో రాజ శేఖరం చెవిలో వేసేరు ఉన్నఫళంగా కదిలేడు రాజశేఖరం యాదగిరి యింటివేపు

"అమ్మా వాసవీ" పిల్చేడు బైట్నుంచే

యాదగిరి భార్య వాసవి బైటకొచ్చి చూసి, "ఎవరూ బాబాయిగారా! అలాగే బైట నిల్చుండి పోయారేం? లోపలికి రండి" అంది, పమిటకొంగు సరిచేసుకుంటూ

"లోపలికి రావడం కాదమ్మా అవతల కొంపలంటుకుంటున్నయ్ నువ్వు కార్య రంగంలోకి దిగకపోతే యాదగిరి కులభ్రష్టు డయ్యేట్టున్నాడు"

"ఏం జరిగిందీ" కంగారుగా అడిగింది వాసవి

"జరగవలసిందే జరుగుతోందమ్మా ఆ అప్పడెవడు? పంచముడు, అంటరానివాడు! వాడేమైపోతేనేం మనవాడి కెందుకు వాడికి విషజ్వరం సోకిందట ఈయనగారు వెళ్లి హాస్పిటల్లో చూపించుకొస్తాట్ట యిదేమైనా సబబుగా వుందా ఏదంటే అది ఎప్పుడుపడితే అప్పుడు చేసెయ్యడమేనా? యివతల పెద్దల మాట, సాంప్రదాయం పాటించనక్కర్లా?"

వీధిలో నిలబడే విషయం బ్రీఫ్‌గా చెప్పేడు రాజశేఖరం, విషం కలిపి

అదివిన్న వాసవి ఉగ్రురాలై, "ఉండండి యింటికి తాళం వేసొస్తాను" అంది వరండా మెట్లెక్కుతూ రాజశేఖరంగారి ఆనందానికి అవధిలేదు "లేకుంటే ఓ అంటరాని వెధవ ఆచారాన్ని, సత్సాంప్రదాయాన్ని మట్టిపాలు చేస్తాడా!" నవ్వేడు పెద్దగా

*   *   *

వెదురు తడికని విసురుగా త్రోసుకుంటూ లోపల అడుగెట్టేడు యాదగిరి అంతా చీకటిగా వుంది అంతకు మించి మౌనంగా వుంది

"అప్పడు" పిల్చేడు యాదగిరి అదురుతున్న గుండెలతో

నిశ్శబ్దం!



# గాడ్సే పుట్టిన దేశం

ఇందాక తను అప్పలకొండని చూసిన చోటు మననం చేసుకుంటూ అటుగా ఓ అడుగేసేడు కాలికి మెత్తగా చల్లగా తగిలింది అప్పడి శరీరం

యాదగిరి గుండెలు ఝల్లుమన్నాయి

అర్ధగంట క్రితం కాల్చిన ఇనపముక్కలా కాలిపోతున్న శరీరం ఇప్పుడు చల్లగా మంచు ముక్కలా .! అర్ధగంటలో ఎంత తేడా !

క్షణం చాలు మనుగడ మరణంగా మార డానికి. అర్ధగంట చాలా ఎక్కువ వ్యవధి అర్ధగంటలో యిదొక్కటేకాదు సృష్టిరాతని సైతం తల్లక్రిందులు చేసెయొచ్చు

యాదగిరి కంట్లోంచి సన్నటి కన్నీటిధార.. బుగ్గలమీదుగా ప్రాకుతూ పెదాల చివరల్ని ప్రాకుతూ ఉప్పగా వెచ్చగా చిచ్చులా !

మౌనంగా బైటికొచ్చేడు "పాపం ! అప్పలకొండ !!!"

ఇప్పుడేమిటి చెయ్యడం

ఆలోచనలో పడ్డాడు యాదగిరి పాక ముందర ముసురుకుంటున్న చీకట్లో ఇంతలో అక్కడికి వాసవి వచ్చింది పాకకు కొద్ది దూరంలో ఆగింది

ఆమెను గమనించేడు యాదగిరి

సూటిగా వాడిగా చూస్తోందామె కళ్ళు, కళ్ళలోని భావాలు స్పష్టంగా కనిపించకపోయినా ఆమె నిల్చున్న భంగిమ ఆ విషయం తెలీజేస్తోంది

"ఏవండీ యిలా రండి" ఖంగుమందామె కంఠం

మౌనంగా ఆమెకేసి నడిచేడు యాదగిరి

"ఏమిటండీ యిది" అంటూ చుట్టూ చూసింది దగ్గర్లో ఎవరైనా వున్నారేమోనని

"ఎవ్వరికీ పట్టని విషయం మీకెందుకు మీరిలా ప్రవర్తించి ఏం సాధించాలని మీలోవున్న మానవత్వం మరెవరిలోనూ లేదంటారా ? మీదగ్గరున్న డబ్బు యింకెవరివద్దా లేదంటారా ఆ అంటరానివాడి మీద మీకున్నంత జాలీ కరుణా మరెవరికీ లేవంటారా అవ్వ. !!! సమాజానికి యిలా విరుద్ధంగా నడిచి నలుగుర్తో కలిసి బ్రతగ్గలమా? ఇప్పటికే మీ గురించి నానా రకాలుగా మాట్లాడుకుంటున్నారు జనం ఇంత వరకు అయింది చాలు పదండి యింటికి వెళ్దాం" లోగొంతుకలో అరుస్తున్నట్టు చెప్పింది వాసవి.

"అప్పడు చనిపోయేడు "

భర్తమాటకు నిటారుగా అయింది వాసవి

"వాడి ప్రాణాల్ని రక్షించలేకపోయినా కనీసం వాడి శవాన్నయినా కుక్కల నక్కల బారినుండి రక్షించాలి "

"మీరు మళ్లీ వాణ్ణి ముట్టుకుంటే యిక్కడికిక్కడే తల బ్రద్దలుకొట్టుకు చస్తాను" వాసవి ఎప్పుడూ అలా మాట్లాడగా విని ఎరుగని యాదిగిరి అవాక్కయ్యేడు

"వాసూ ఏమిటే నువ్వనేది "

"మీరా శవాన్ని ముట్టుకునేందుకు వీల్లేదు "

ఇంతలో దూరం నుంచి మనుషులు మందగా రావడం కనిపించింది

"అదుగో అంతా యిటే వస్తున్నట్లున్నారు యింకాస్సేపు యిక్కడే నిలబడితే ఆ అప్పణ్ణి మీరే చంపేరని అన్నా అనగలరు పదండి వాళ్లిక్కడికి రాకముందే వాళ్ళ కెదురు వెళ్దాం" భయం భయంగా అంది, చూసింది వాసవి

ఆమె కళ్లల్లోకే నేరుగా చూసేడు యాదగిరి .

అలా చూస్తోంటే అతన్లోనూ ఒకలాంటి పిరికితనం భయం

అక్కణ్ణించి కదిలింది వాసవి

ఆమె వెంట యాదగిరి

ఆ దృశ్యం దూరం నుంచి చూసిన రాజశేఖరం కడుపు చల్లబడింది

"ఇది ఒక్క అప్పలకొండ కథే కాదు అప్పలకొండవంటి ఎందరో అభాగ్యుల జీవితాల విషయంలో నాటికీ నేటికీ నడుస్తూనే వున్న చరిత్ర నవ నాగరికత అని చాటుకునే ఆధునిక అనాగరికత చరిత్ర, చెరచబడ్డ మానవత్వంమీద పరచుకున్న చిరుగుల బొంతలాంటి మానవతావాదుల విషయంలో క్షణానికోసారి పునరావృత మౌతున్న చరిత్ర వాడవాడల మృత్యునీడల్లో అల్లుకుపోయిన అభినవ గాడ్సేల చరిత్ర ఈ చరిత్ర గమనంలో చైతన్యం రానంతవరకు ఇటువంటి కధలకు ఇటువంటి ముగింపులు తప్పవు ఇటువంటి ముగింపులే తప్పనిసరవుతూ, పునరావృతమౌతూ చరిత్ర సాగితే మానవ చరిత్ర మరుగున పడక తప్పదు " (5)

## అంకితం

"సర్వమత సామరస్యం కోసం సమరం సాగించి, తత్సమరం నీ పాలిటి మరణ వేణు స్వరంకాగా అమర మూర్తిగా మిగిలిపోయిన బాపూజీ ఈ 'నూలుపోగు' నీకే !

— రచయిత

# ముక్తిప్రదమైన 'హరిద్వార్'

పరమ పవిత్రమైన 'హరిద్వార్' పేరు వినని భారతీయుడుండడు. హిమాలయములలో నుండి 'శివాలిక' పర్వతములగుండ, గంగానది మొదటిసారిగ ఇక్కడ భూమిమీద ప్రవహిస్తుంది. కనుకనే ఈ పుణ్యస్థలిని 'గంగాద్వార్' అనిగూడ అంటారు.

## పౌరాణిక ప్రాశస్త్యం

హరిద్వార్, స్కందపురాణములో 'మాయాపురి' అని సంబోధించబడింది. ఈనాటి 'కనఖల్' ప్రాంతమే దక్షప్రజాపతి యజ్ఞం చేసిన ప్రాంతమని పురాణ ప్రసిద్ధి. సతీదేవి యజ్ఞకుండములో భస్మమయిన స్థలమే నేటి 'సతీకుండ్'.

భక్తులు శంకరుని 'హర! హర!' అని కొల్వటం కలదు. శంకరుని కైలాసగిరికి, కేదార్‌నాథ్‌కు మొదటి మజిలీ హరిద్వారమే! కొందరు దీనిని 'హరద్వార్' అనుటకూడ కలదు. పాండవుల మహాప్రస్థాన మార్గము ఈ పుణ్యక్షేత్రము ద్వారానే అయినది. కనుక దీనిని 'మోక్షద్వారం' అని కూడ అంటారు. భీముని పాదాఘాతానికి ఏర్పడిన 'భీమగోడా' జలాశయం కూడ యిక్కడే ఉన్నది.

శ్రీరాముడు ఉత్తరఖండంలో తమ్ములతో సహా హరిద్వార్ ద్వారా హిమాలయాలకు వెళ్ళాడని స్థానికులంటారు. మానవ మరణానంతరము అస్థికలు ఇక్కడి గంగలో కలుపుతారు. బదరీ నారాయణుని దర్శించటానికి మార్గము ఈ పుణ్యస్థలే కనుక, 'హరిద్వార్' అంటారు.

శ్వేతమహారాజు బ్రహ్మను గూర్చి తపస్సు చేసిన ప్రాంతము కనుక, దీనికి 'బ్రహ్మపురి' అని పేరు వచ్చింది. ఇక్కడ గంగాతీరాన బ్రహ్మ తపస్సు చేశాడు. ఆ స్థలాన్నే 'బ్రహ్మకుండ్' అంటారు. నిత్యం వేలాది యాత్రీకులు 'బ్రహ్మకుండ్' లో స్నానం చేసి దివ్యాత్ములౌతారు. యాత్రీకులు తెచ్చే పవిత్ర 'గంగాజలము' బ్రహ్మకుండ్ నుండే!

కపిలముని శాపముచే భస్మీపటలమైన సగరుని సంతానము తిరిగి భగీరథుని తపస్సుచే ధన్యత నొందినది ఇక్కడే! అందువలన హరిద్వార్‌ను కపిలస్థానము, గంగా ద్వారము అంటారు.

సప్తమహర్షులు ఇక్కడే తపస్సు చేశారు. వారికి తపోభగ్నం కలుగకుండ, గంగ ఏడు



నిత్యాభిషేకంతో ధ్యాననిష్ఠలో 'మహాదేవుడు'

పాయలుగ చీలి ప్రవహించిన ప్రాంతమే నేటి సప్తసరోవర్. ప్రక్కనే సప్త మహర్షుల



హరిద్వార్ నగరము



బ్రహ్మకుండ్‌లో
స్నానంచేస్తున్న యాత్రికులు

ఆశ్రయ మున్నది. శుంభ, నిశుంభ రాక్షసులను యుద్ధంలో సంహరించిన పర్వతము పైననే 'మనసాదేవి' మందిర్ వెలిసింది.

## ముఖ్య ప్రదేశాలు

హరిద్వార్ వైశాల్యం దాదాపు 12 చ. కి. మీ. ఉంటుంది. కొన్ని వందల దేవాలయాలున్నవి. బ్రహ్మకుండ్, కుశావర్తఘాట్, భీమగోడా మందిర్, మనసాదేవి మందిర్, చండీదేవి మందిర్, బిల్వకేశ్వర మందిర్, మాయాదేవి మందిర్, గీతాభవన్, గోరఖ్‌నాథ్ మందిర్, రాఘవేంద్ర మందిర్, పావనధామ్ మందిర్, భారతమాతా మందిర్, సప్తసరోవర్, పరమార్థ ఆశ్రమ్, శాంతికుంజ్, సాధువేలా ఆశ్రమ్, దక్షప్రజాపతి మందిర్, సతీఘాట్, అవధూత్ మందిర్ మున్నగునవి తప్పక దర్శించవలసిన తీర్థాలు. ఈ మందిరాలలో నిత్యం వేదములు, భగవద్గీత, రామాయణ, భారత, భాగవతాది ప్రవచనాలు జరుగుతుంటాయి. రైలు దిగగనే యాత్రీకులకు మహామృత్యుంజయుడైన మహాదేవుడు నిత్యాభిషేకంతో ధవళకాంతు లీనుచు ధ్యాన నిష్ఠలో దర్శన మిస్తాడు.

## దీపమాలికలు

వేలాది యాత్రీకులు సంధ్యా సమయంలో చిన్న చిన్న బుట్టలలో పుష్పములు, దీపములు అమర్చి గంగాప్రవాహంలో వదులుతారు. ఇలాచేస్తే తమ పూర్వీకులకు పుణ్యఫలాలు, మోక్షప్రాప్తి చేకూరుతుందని వారి నమ్మకం. సంధ్యా సమయపు చిరు చీకట్లలో లేత నీలవర్ణంగా కానవచ్చే గంగా ప్రవాహంలో సువర్ణ వర్ణముతో వెలిగే సహస్రాధిక దీపాలు 'నీలకాంత మణులా!' అన్న భ్రమకు లోనుచేస్తాయి. అరమైలు వెడల్పు, రెండు మైళ్ళ పొడవున దీపమాలికలు ఆకాశంలో నక్షత్రమాలికలను ధిక్కరిస్తూ పయనిస్తుంటాయి.

శిక్కుమత ప్రవక్త గురునానక్ మొదటగా ప్రవచించింది హరిద్వార్‌లోనే! చైనా యాత్రీకుడు హ్యూయన్‌సంగ్ హరిద్వార్‌ను పరమ దర్శనీయ స్థానంగ పేర్కొన్నాడు. డల్‌హౌసి ఇక్కడ కాలువలు త్రవ్వించి 'గంగా జలం' పంటలకు అందేట్లు చేశాడు.

## యాత్రీకుల వసతులు

దేశంలో దాదాపు అన్ని ప్రధాన నగరాల నుండి రైల్వే సౌకర్యమున్నది. ప్రభుత్వ టూరిస్టు సంస్థలు, ఇతర ప్రయివేటు సంస్థలు, ప్రతిరోజు వందలకొలది బస్సులు, చిన్నకార్లు నడుపుతుంటాయి. ఢిల్లీనుండి 222 కి. మీ. ఉంటుంది, 5 గంటల ప్రయాణం.

ప్రభుత్వ టూరిస్ట్ సెంటర్లలో బస చేయవచ్చును. పాతికకు పైచిలుకు ఆధునిక వసతులతో పెద్ద హోటళ్ళు ఉన్నవి. వందకు పైగా ధర్మశాలలలో ఉచిత వసతి లభిస్తుంది. వానిలో కాలీకమిలీవారి ధర్మశాలలో భోజన వైద్య సదుపాయాలు కూడ ఉంటయి. శిక్కుల 'గురుద్వార'లో కుల, మత, ప్రాంత విచక్షణ లేకుండ ఉచిత భోజన వసతులందజేస్తారు. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం అడుగడుగున సహాయ కార్యక్రమాలు అందిస్తుంటుంది. రామకృష్ణ మఠంవారు, విశ్వహిందూ పరిషత్‌వారు యాత్రీకులకు సాదరంగ సాయపడతారు.

ఈ పుణ్యస్థలిని దర్శించినవారికి 'మోక్షప్రదాయిని' హరిద్వార్ అని తప్పక స్ఫురిస్తుంది.

అవతీర్ణా సురధుని ద్వార మాసీత్
మహాత్మనాం।
హరస్య సిద్ధక్షేత్రాణాం హరిద్వార
మతోఽభవత్ ॥

[దేవగంగ భువికి దిగివచ్చి మహాత్ములకు ముక్తికి ద్వారమయినది. కనుక సిద్ధక్షేత్రములకు హరులకు కూడాను హరిద్వారము అయినది.]

**— కెప్టెన్ షేక్ మౌలాలీ ★**

సీరియల్

# యక్షగానం

## స్వర్గీయ శ్రీమతి మాదిరెడ్డి సులోచన

(గత సంచిక తరువాయి)

"నీలూ! ఇంటికి వెళ్దామా!"

"పదండి అంకల్ .."లేచింది

ఆమెను దగ్గరగా తీసుకుని, హృదయానికి హత్తుకున్నాడు, శివాజి "నీలూ! అంకల్‌ని కాదమ్మా మీనాన్నని" అన్నాడు

నీలూ ఉలిక్కి పడింది తను తను నందనరావును తప్ప అన్యులను అలా పిలువ గలదా? అతని ప్రేమ, లాలింపు మరచి పోగలదా! ఇదేం సినిమా కాదు నిజమైన తండ్రి యెవరో తెలియగానే 'నాన్నా!' అంటూ అతని వడిలో యెలా వాలిపోగలదు! తను నందనరావును తప్ప అన్యులను నాన్నా అంటూ పిలువ లేదు

శివాజిని నిరసించటానికి కారణం కూడా కనిపించలేదు. ఆతను తను తల్లిని మోసం చేసిన వ్యక్తి కాదు ఆతడిని దూరం చేసుకోలేదు అందుకే ఒక నిర్ణయానికి వచ్చింది

అతని నడుము చుట్టు చేయివేసి ముందుకు నడిచింది

"డాడీ! నాబాల్యమంతా ఇక్కడే గడిచింది అమ్మకంటే నాన్నతోనే ఎక్కువ చనువు" అన్నది.

"నాకు తెలుసు నీలూ!తాతయ్య ఓ ప్రణాళిక వేసారు."

"ఏమిటి డాడి!"

"నందనరావు కోరినట్టుగానే ఈ ఇల్లు వృద్ధుల సంక్షేమానికి ఉపయోగించాలమ్మా తాతయ్య ఇక్కడి వారి కోసం తను పాటు పడతా నంటున్నాడు"

"అంతకంటే కావల్సిందేముంది డాడీ"

"అలాగే నువ్వు అప్పుడప్పుడు వచ్చి పర్య వేక్షించాలమ్మా"

"అలాగే డాడీ, నాన్నగారిది లైఫ్‌సైజ్‌లో ఒక ఫోటో చేయించాలి"

"ఇప్పటి వరకు నేను, తాతయ్య ఫోటోలన్ని వెతికాం. ఆయనవి వయసులో ఉన్నప్పటివే ఉన్నాయి" అన్నాడు

"లేటెస్ట్‌ది నా దగ్గరుంది డాడీ" అన్నదామె

ఇద్దరూ కృష్ణకుంజ్‌లోకి వెళ్లారు ఆమె డ్రాయర్ సొరగు లాగి ఒక ఫోటో తీసింది

వరండా గోడ కానుకుని నిల్చున్నాడాయన

"ఆమధ్య ఆయన గోడ ఆసరాగా నిల్చుంటే నేను తీసాను" అంది

"చాలా బావుందమ్మా"

అప్పుడే స్నానం చేసి బట్టలు వేసుకు న్నాడేమో, ఫ్రెష్‌గా చిరునవ్వుతో నిల్చున్నాడు ఆయన తనను చూచి నవ్వుతున్నట్టు అనిపిం చింది ఫోటో పేపర్లో చుట్టిపెట్టాడు

"ఇది చాలా బావుందమ్మా" అన్నాడు

ఇద్దరూ శివాజి ఇంటికి వచ్చారు అరవింద్ వాళ్లకోసం చూస్తున్నాడు వచ్చి నీలును కౌగిలించుకున్నాడు

"నన్ను పిక్చర్‌కు తీసుకువెళ్లవా "

"వెళ్దాం " వాడిని ఆప్యాయంగా వీపు నిమురుతూ లోపలికి తీసుకు వెళ్లింది

ముగ్గురూ భోజనం చేసారు

"నీలమ్మా మీకుత్తరం " అని, పనివాడు ఆమెకు, శివాజికి ఉత్తరాలు అందించాడు ఇద్దరూ ఉత్తరాలు చదువటంలో నిమగ్నం కాగానే అరవింద్ విసుగ్గా వెళ్లిపోయాడు

"ఆదిత్యది అంకుల్ . సారీ ! డాడీ !"

"ఇది మీ అమ్మగారిది" అన్నాడు ఉత్తరం ఆమె వైపు విసిరాడు

"ఏం రాసారో చెప్పండి" అన్నది ఉత్తరం మడిచి అతనికిస్తూ

**జరిగిన కథ — 15 :** ఇక తను ఆడే నాటకాన్ని విరమించాలని ప్రయత్నిస్తుంటుంది ముకుందాదేవి ముకుందాదేవి ఇంట్లో దోపిడి జరుగుతుంది తను ఇంతకాలం నాటకం ఆడి భక్తుల ముడుపుల ద్వారా సంపాదించిన సొమ్మును కొంచెం కూడా మిగల్చకుండా ఎత్తుకుపోతారు ముకుందాదేవి ఆదిత్యపై నేరం మోపి అరెస్ట్ చేయిస్తుంది. చైనులూ, రాయుడూ కలసి ఈ దొంగతనం చేశారని నీలిమ చెప్పినా వినదు ఆ ఆస్తి కోసమే కాచుక్కూచున్న సావిత్రి తన కొడుకుతో వెళ్లిపోతుంది డాక్టర్ శివాజి ఇచ్చిన పేపర్ ప్రకటన చూసి అప్లికేషన్ పెట్టిన నీలిమను ఆహ్వానిస్తాడు శివాజి వారిరువురూ మాట్లాడుకొన్న తర్వాత గుళ్లో పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకొంటారు ఆదిత్య కేసు వాయిదా పడుతుంది. నీలిమ తనకు పుట్టిన బిడ్డే అని ముకుందాదేవి ద్వారా తెల్సుకొంటాడు శివాజి ఆదిత్యను బెయిల్‌మీద విడిపిస్తాడు నీలిమను ఆదిత్యకిచ్చి పెళ్లి చేయాలని నిర్ణయించుకొంటాడు ఆదిత్య, నీలిమలకు తను విద్యార్థి జీవితంలో అనుభవించిన కష్టాలను చెపుతాడు డాక్టరు శివాజి యువ తరంగిణి ప్రోగ్రాం నుంచి ఇంటికి వచ్చిన నీలిమ శివాజికి, తన తల్లికి గల అక్రమ సంబంధాన్ని తెలుసుకొని తల్లిని అసహ్యించుకొంటుంది. తన ఉనికినే అసహ్యించుకొనే తండ్రి ప్రవర్తనకు బాధపడుతుంది నీలిమ నీలిమను నందనరావు అనరాని మాటలంటుండగా ఆదిత్య వింటాడు. ఆదిత్య, నీలిమల పెళ్లి జరుగుతుంది ఆ రోజే నందనరావు ఆత్మహత్యకు పాల్పడతాడు తండ్రి జేబులో తల్లి తనకు రాసిన జాబుని విప్పి చదవసాగింది నీలిమ. ముకుందాదేవికి చక్రధర్ వల్ల నీలిమ పుట్టింది నందనరావు కూతురి జననానికి ఆనందిస్తాడు వ్యాపారం నిమిత్తం ఊరు వెళ్లిన నందనరావు యాక్సిడెంటుకు గురవుతాడ తరువాత ముకుందాదేవి శ్రీకృష్ణపరమాత్మ అవతారం దాల్చింది చనిపోయిన నందనరావ్ అంత్యక్రియలు ఆదిత్యచేత జరిపిస్తుంది నీలిమ.

"మనఃశాంతిని వెతుకుతూ యాత్రలకు వెళ్లిందట తన మనఃశ్శాంతి నీవేనని గ్రహించిందట. వీలుంటే ఒక్కసారి నిన్ను స్టేషనుకు తీసుకురమ్మన్నది. మద్రాసు ఎక్స్‌ప్రెస్ దిగుతూనే బెంగుళూరు బండి ఎక్కుతారట."

నీలిమ ఏం మాట్లాడలేదు. తలవంచుకుంది.

"ఆ అభాగ్యురాలిని క్షమించలేవా నీలూ !"

"ఛ .. ఛ.. అదేం మాట డాడీ! అమ్మ ఉత్తరం చదివాను కదా. ఆమె నాకోసం రాస్తే అది నాన్న చేతిలో పడింది. ఆయన ఆ ఉత్తరం చదివాక అంతగా మారిపోయారంటే నమ్మ లేకుండా ఉన్నాను. అతని మరణవార్త విని అమ్మ ఎలా తట్టుకుంటుందో." అన్నది జాలిగా.

"ఆతని నమ్మకం, ఆతని ఆస్తి, అతని సర్వస్వం నువ్వే అనుకుని బ్రతికే వ్యక్తికి ఒక్కసారి అదంతా అబద్ధం, ఊహ అని తెలిస్తే యెలా ఉంటుంది. పసిపిల్లడిని ఓదార్చటానికి రంగుల బొమ్మ చూపినట్టు అయింది. బ్రతుకటానికి బలం నువ్వు. ఆ నువ్వు తనదానివి కావు, తన రక్తం పంచుకుని పుట్టలేదంటే యెలా భరించగలడు !" అన్నాడు. ఆమె మాట్లాడలేదు



"ఆదిత్య ఏం రాసాడు! అసలు నిమజ్జనం చేసి అక్కడ ఉండకూడదు అంటారు కదా." అన్నాడు.

"అదే రాసారు డాడీ! ఆతనికి కృష్ణ ఒడ్డున చైనులు కనిపించాడట. ఆతను ఆదిత్యను చూచి పారిపోయాడుట అతని విషయం తేల్చుకుని వస్తాడట అయినా ఆదిత్య పిచ్చిగాని అతను దొరుకుతాడా !" అన్నది

"ప్రయత్నం చెయ్యాలమ్మా! ఆ పట్టుదల మంచిదే" అన్నాడు అతను

"డాడీ !"

"చెప్పమ్మా !"

"నేనో ప్రశ్న అడిగేదా ?"

"అడగమ్మా అభ్యంతరం యెందుకు !"

''ఈ నీతి నియమాలు చేసింది పెద్దలే కదూ !''

''అవును.''

''మరి స్త్రీపట్ల ఇంత అన్యాయం చేసారేం డాడీ !''

''నాకు అర్థం కాలేదమ్మా ''

''ఇప్పుడు అమ్మవచ్చి మీతో ఉంటేనేం ?''

శివాజీ లేచాడు వెళ్లి కిటికీ ఊచలు ఎట్టుకుని, చాలాసేపు నిల్చున్నాడు. అనవసరంగా అతన్ని అడగానేమో అనుకుంది నీలిమ

''నీలూ ! నా ఆస్పత్రిలో అ స్ప ష్ట రూపంలో ఓ స్త్రీమూర్తి ఉంది చూచావా !''

''చూచాను ''

''అది యెవరిది ?''

''నాకు తెలియదు మీ జీవితంలో తారస పడిన ఒక స్త్రీమూర్తిదని విన్నాను.''

''ఆ స్త్రీమూర్తి మీ అమ్మ. నా కెందరి తోనో పరిచయాలున్నాయి అందరిలో ముగ్ధ, ముద్దబంతిపూవు ఆమె అదికాక నాకు విదేశాలలో స్కాలర్‌షిప్ వచ్చింది రూబీదగ్గరకు వచ్చిన యువకులలో, నేనొక్కడినే చదువుకుని పైకి వచ్చాను దానికి రూబీ భర్తకు మంట రూబీయే సహాయం చే స్తుం ద ని అతని అభిప్రాయం. ఆ కోపంతో నాకు సహాయం నిరాకరించాడు అప్పుడు మీ అమ్మ డబ్బిచ్చి వెళ్లిందట ''

''డాడీ .''

''అవునమ్మా ! ఆమె రా వా లే గా ని సంతోషంగా ఆహ్వానిస్తాను ఈ దేశాచారాలు అంగీకరించకపోతే విదేశాలకు తీసుకువెళ్తాను '' అన్నాడు ఆవేశంగా

నీలిమ లేచింది అతని గుండెల్లో తల దాచుకుంది

''థాంక్యూ డాడీ థాంక్యూ వెరీమచ్ నా ఒక్కదాని తరఫునకాదు— స్త్రీ లో కం తరఫున, ఆడదాన్ని అబల, ఆటబొమ్మ అనుకునే పురుషులలో పుణ్యపురుషులుగా ప్రగతి మార్గంలో పయనించే మీకు నా హృదయపూర్వక ధన్యవాదాలు ''

''ఓ స్టాప్ నీలూ !'' అ త ను ఆప్యాయంగా ఆమె తలను హృదయానికి హత్తుకున్నాడు

''అదీ కాదు డాడీ ! స్త్రీని వంటింటి కుందేలు అని, అదని, ఇదని, ఆమెను నీరసురాలిని చేసారు ఈనాడు మరొకరి సహకారం లేనిదే ఆమె ముందంజ వెయ్యలేదు'' అన్నది

''అది నిజమేనమ్మా నాకు చేతనయినంతగా సహకరిస్తాను ''

''చాలామంది మగవారు, చెప్పేది ఒకటి, చేసేది ఒకటి అందుకని మీరయినా. .'' ఆమె మాట పూర్తికాక ముందే వాకిట్లో ఓ ఆటో రిక్షా ఆగింది.

# య క్ష గా న ం

''డాక్టరుగారూ . . మా అక్క మా అక్క . ''

శివాజీరావు ఇంటిముందు ఎ మ ర్జ న్సీ ఎక్జామినేషన్ రూమ్ ఉంది. పనివాడు చూపించగా ఒక స్త్రీని తెచ్చి, టేబుల్‌పై పడుకో బెట్టారు.

శివాజీ కంగారుగా ఆమె పల్స్ చూచాడు ఆ వెనుకే నీలిమ కూడా వెళ్లింది

''మైగాడ్ స్వతంత్రి'' అన్నాడాయన

''స్వతంత్రే డాక్టరుగారూ ! మేమంతా ఆమె రక్త మాంసాలు కరిగించి, ఇంతవారం అయ్యాము. ఆమె ప్రాణం కూడా తీస్తేగాని '' అతను ఏడుస్తున్నాడు

నీలిమ అతడిని బయటికి తీసుకు వచ్చింది ''ఆమెకేం అయింది ?'' నీలిమ అడిగింది

## సూది - దారం

సూది వంటిది మేధరా  
సునిశితమ్మది చూడరా  
నూలు వంటిది జాలిరా  
చాల మంచిది చూడరా  
సూత్ర రహితము సూదిరా  
''శుద్ధ దండుగ'' చూడరా  
నూలు కలిగిన సూదిరా  
నూరు పుటలను కలుపురా  
జాలి కలిగిన మేధరా  
కోటి గుండెల కలుపురా  
శతకోటి గుండెల కలుపురా

—కె. వెంకట శివయ్య

''ఏం తీసుకుందో. విషం తీసుకుంది '' అతను ఏడ్చాడు అరగంట తరువాత శివాజీ బయటికి వచ్చాడు.

''ఇంకో గంట గడిస్తేగాని ఏం చెప్పలేం!'' అని పనివాడిని నర్సింగ్ హోమ్‌కు పంపి, ఏమేమో తీసుకురమ్మని ఆదేశించాడు శివాజీ

''ఎందుకు స్వతంత్రి మందు మింగింది ? ఆమె బలహీనురాలు, భయస్తురాలు కాదు'' అన్నాడు

''కాదు డాక్టరుగారూ ! అక్క చాలా ధైర్యస్తురాలు ఆమె ఆ మధ్య తాను పెళ్లి చేసుకుని సెటిల్ అవుతాననిచెప్పింది. ఏమయిందో మళ్లీ మానేసింది. అది ఆసరాగా తీసుకుని మావాళ్లు ఆమెను నానా హింసలు పెట్టారు మాటలతో చంపారు'' అన్నాడు

శివాజీరావు నిట్టూర్చాడు అతని ముఖంలో రంగులు మారటం నీలిమ గమనించింది

మేల్ నర్స్ రాగానే స్వతంత్రికి సరియైన వైద్యంచేసి, ఆమెను నర్సింగ్ హోమ్‌లో పడుకోబెట్టి వచ్చాడు శివాజీ మాన్సీకర్

''డాడీ ..''

''ఎస్ నీలూ ! ''

''ఈమె నీకు తెలుసా ? ''

''తెలుసు '' క్లుప్తంగా స్వతంత్రికి తనకు జరిగిన విషయాలు చెప్పాడు ఆమె ఎంత నిక్కచ్చి మనిషో కూడా చెప్పాడు.

''ఓ . అయిసీ . '' అన్నది నీలిమ

అతను ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు

## 24

విజయవాడలో ఓ చిన్న లాడ్జీలో చైనుల్ని పట్టుకున్నాడు ఆదిత్య అతను ఎంత వ్యాపారం చేస్తున్నా, ఎంతమంది అభినందించినా, ''వీడు దొంగతనం చేసాడు దొంగితనం'' అంటూ యెవరో అవహేళన చేసినట్టే అనిపిస్తుంది అందుకే చైనులును కలుసుకున్నాడు.

''నమస్తే . ''

''నమస్తే . నమస్తే .నువ్వు ఆదిత్యవు కదూ !''

''అవునండీ . '' అన్నాడు దిగులుగా మనసులో కసిగా ఉంది మొదటిసారి తనను

''యెవరుపోయారు !'' తను ఆదిత్యను ముద్దు పెట్టుకున్న సంగతి గుర్తు చేసుకుని

''నందనరావు ''

''అయ్యో ! పాపం ! ఆ ఇంట్లో అతను ఒక్కడేనయ్యా మనిషి అంటే ''

''అవునండీ అతనుండగా నాపై వచ్చిన నింద తప్పిస్తాడనుకున్నాను నన్ను విడిపించి అతను మరణించాడు'' అన్నాడు

''ఇప్పుడు నువ్వు ''

''పారిపోయి వచ్చాను ''

''మరి మనదేవుడు ''

''నాకు తెలియదు ''

చైనులు తీక్షణంగా చూచాడు. వెంటనే తలపంకించాడు

''ఆ పిల్ల యెలా ఉంది ?''

''బాగానే ఉండి ఉంటుంది'' అన్నాడు.

చైనులు భోజనం పెట్టించాడు ఆదిత్య చేతిలో డబ్బులేనట్టే నటించాడు ఆ రోజంతా అతడితోనే ఉన్నాడు

''ఇంకా యె వ రి న యి నా అనుమానిస్తున్నారా !''

''మిమ్మల్ని అనుమానించారు'' అన్నాడు

చైనులు విలాసంగా నవ్వాడు

''ఆ ము కు ం ద స ం గ తి నాకు తెలుసు. దానికి మాపై కేసుపెట్టే ధైర్యం లేదు. నువ్వేం దిగులు పడకు నేను చెప్పినట్టు వింటే నీకు మేలు జరుగుతుంది.''

''ఇంకా ఏం మేలు జరగాలి. దొంగిన్న ముద్రతో బ్రతుకలేను ... '' అన్నాడు విసుగ్గా

''దొరగా బ్రతుకుదాం పద . '' అన్నాడు

ఆ సాయంత్రమే ఇద్దరూ కలసి సామర్లకోట దగ్గరున్న పల్లెటూరుకు వెళ్లారు

అక్కడ చైనులు పొలం, ఇల్లు కొన్నాడు అతను పిల్లలు, అతను హాయిగా ఉన్నారు అతనున్న తీరుచూస్తే దొంగతనం చేసింది అతనే అనిపించింది తన అనుమానాలు బయట పడనియ్యలేదు. ఇంట్లో వారంతా ఖరీదయిన బట్టలు వేసుకుని ఉన్నారు. ధనవంతుల ఇల్లని ఇంట్లో వస్తువులు చాటి చెబుతున్నాయి

ఆరోజు భోజనాలు అయ్యేక చైనులు నిదురపోయాడు బయట ఆరాతీసాడు చైనులు ఈ మధ్యే వచ్చి అక్కడ పొలం ఇల్లు కొన్నాడని తెలిసింది అతను తల పంకించాడు

''ఏం ఉద్యోగం చేస్తావు!''

''ఏదయినా చేస్తాను!'' అన్నాడు

''మంచి ఉద్యోగం వేయిస్తాను. మా అమ్మాయిని పెళ్ళి చేసుకో అది డొనేషన్ కట్టి మెడిసన్ చదువుతుంది తెలుసా!''

కొంపలార్పి డొనేషన్ కడతావు, దొరతనం వెలిగిస్తావు— అనుకొన్నాడు

''మీఅమ్మాయి కిష్టమో కాదో ''

''నువ్వుఊఁ అను అది ఎగిరిగంతేస్తుంది ''. అన్నాడు

''ఊఁ '' అన్నాడు అదిత్య వెంటనే నవ్వేసాడు, ఏది నీ కూతురు అన్నట్టు చూసాడు.

''భలేవాడివయ్యా '' భుజం చరచి నవ్వాడు

''అవునండి ! ఆ ముకుందాదేవిని చిత్తు చేయాలి కూతుర్ని చిన్నబాబుకు ఇస్తుందేమో''

''వెర్రిబాగులవాడు '' చైనులు బ్రాందీ తీసాడు సోడా లేకుండా కొట్టేసాడు

''నీకు ఓ పెగ్గు ''

''వద్దండీ, జాబ్!''

''నో ప్రాబ్లమ్ నేనిక్కడే ఉన్నాను నీవు కోరింది కాదనను కూతుర్ని, కట్నం ఇంకేం కావాలి!'' మరో రెండు రౌండ్లు పడే సరికి గుర్రం ఎక్కాడు, మాటల దౌడు ప్రారంభమయింది

''మేము . మేము నీతో చెప్పొద్దు '' నోరు గట్టిగా మూసుకున్నాడు

''అల్లునికీ అల్లునికి చెప్పని రహస్యాలుంటాయా !''

''మామ ఏది మల్లను . అను నా బిడ్డకు పెళ్ళి అయ్యే యోగముందా ! అమ్మా కనకదుర్గా .'' ఏడ్పులంకించుకున్నాడు.

''ఏమయింది !

''నా కూతురు చిన్ని తప్పు చేసింది అది ఈ కాలంలో తప్పుకాదు. ప్రగతి అడ్వాన్స్ మెంటు ''ఒక్కొక్క పెగ్గు ప డు తు ం టే ఒక్కొక్క మాటే బయటకి వచ్చింది

''నా కూతురు. ప్రేమించిందయ్యా ఫస్ట్‌క్లాసు స్టూడెంటుకు ఇదేం బుద్ధి . చెప్పు. చెప్పు ''

''పాడుబుద్ధి '' అన్నాడు ఆదిత్య

''అవునా .మరి జాగ్రత్తగా వుండొద్దూ మూడో నెలే కాబట్టి ఏదో చేసాం భ్రూణ హత్య మహాపాపం ఆఁ .'' ఏడ్చాడు చైనులు

''అబ్బా ఏడ్వకు మామా ''

''ఇంక ఏడ్వను నా బిడ్డ . కు పెళ్ళి అవుతుంది '' అన్నాడు

''డాక్టరు చదివే అమ్మాయి, యెవరయినా చేసుకుంటారు.'' అన్నాడు ఆదిత్య

''చేసుకున్నవాడు మంచి వాడు కాదు . కావాలని లేదు నా యింట్లో ఉండాలి '' అతను మెల్లగా కళ్ళు మూసుకున్నాడు.

ఆదిత్య లేచి అతని విషయం భార్యతో చెప్పాడు ఆవిడ తిట్లతో వచ్చి అతడిని లేపి పడుకోపెట్టింది

''జీవితమంతా అబద్ధాలతో గడిపాడు ఏదో ఇప్పుడయినా నిమ్మళంగా ఉందామంటే తాగుడు నేర్చాడు '' అన్నది విసుగ్గా

ఆదిత్య ఆమెను గమనిస్తున్నాడు ఆమెను ఎప్పుడూ చూచినట్టులేదు

''నువ్వా ఆ కృష్ణపరమాత్మ దగ్గర పని చేసావా!''

''చేసాను'' అన్నాడు ముక్తసరిగా

ఆమె అన్నం పెట్టింది కానీ ఎక్కువ ఏం మాట్లాడలేదు భర్త హెచ్చరించి ఉంటాడు

ఆదిత్య బయట గదిలో నిదురపోయాడు మర్నాడు అయిదు గంటలకే మేలుకున్నాడు అతను పెరట్లోకి రాబోయి తన పేరు వినిపించటంతో ఆగిపోయాడు ఇద్దరు మగవాళ్ళు పందుంపుల్లలతో పళ్ళుతోముతున్నారు

''చైనులూ ! నువ్వు త్రాగుడుకు అలవాటు పడి, మంచి చెడులు ఆలోచించటం లేదు అసలు ఆదిత్య సి. ఐ డి అని నమ్మకం ''

''రాయుడు! నాటకాల వాడికి అందరూ నా ట కం ఆ డి న ట్టే క ని పి స్తా రు అయి పిటీయు ..''

''చాల్లే ! ఆ పిల్లముండ వీడిని ప్రేమించింది. ఇదేదో గూడుపుఠాని ఉంది వీడిని అరెస్ట్ చేసారని పేపర్లో చదవలేదా?''.

''ఆ సందనరావు విడిపించి గుటుక్కుమన్నాడట నేనేం అంత వెర్రివాడిని కాను''

''చిన్న పామును పెద్ద కర్రతో కొట్టమన్నారు ఆ పిల్లది మరకోసం అందరిని అడిగి పోతుందట సత్యవతి అన్న ఉత్తరం వ్రాసాడు నువ్వు నిజామాబాద్‌లో సెటిల్ అయ్యావని తెలిసి అక్కడికి మనుషుల్ని పంపిందట ''

చీకటి పలచబడి పక్షుల కిలకిలా రావం వినిపించింది తను అక్కడ వుంటే పసిగడతారని వెనక్కు వచ్చి మంచంలో వాలాడు

అతనికేం పాలుపోలేదు ఇప్పుడు వారి చేతికి చిక్కితే వదిలిపెట్టరు ఏం చేయాలో తోచలేదు

బయట అలికిడి విని కళ్ళుమూసుకున్నాడు

''ఆదిత్యా ! ఓ ఆదిత్యా '' చైనులు పిలిచాడు

''ఈ రోజు ఫ్యాక్టరీకి వెళ్దాం '' అన్నాడు అక్కడ దగ్గరలో చిన్న బెల్లం ఫ్యాక్టరీ ఉన్నది

''అలాగే '' అన్నాడు

అతను త్వరగా తయారయి వచ్చాడు నీలిమకు ఉత్తరం రాసి పడేసాడు చైనులు వెంట వెళ్ళాడు.

చిన్న గుమాస్తా ఉద్యోగం అది.

''నా కంటూ ఓ పని ఉంటుంది చాలు మామయ్యా'' అన్నాడు.

పనిలో చేరిపోయాడు ఆదిత్య అక్కడ ఫ్యాక్టరీలో అతనికి భాగం ఉందని తేలిపోయింది అక్కడ వారి ద్వారా చాలా విషయాలు తెలిసాయి

(ఇంకా వుంది)

కనపడుటలేదు

ఈ ఫోటోలో వున్న వ్యక్తి కనిపించటంలేదని తెలియ చేస్తున్నారు- కనిపించిన వారికి ....

కనిపిస్తూనే వున్నాడు కదా

# ఆంధ్ర విశ్వవిద్యాలయము రాయలసీమలో లేకుండ చేసినదెవరు

**శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు**

## 1

**ఆం**ధ్ర విశ్వవిద్యాలయము విషయములో ఉత్తర సర్కారులవారు కలసి రాయలసీమ కన్యాయము చేసినారనీ, రాయలసీమలో కొందరు నేరములు మోపుచు ఆంధ్రరాష్ట్రముకు కూడ తాము వ్యతిరేకించుట కిదియెక ముఖ్య కారణమనీ చెప్పుచున్నారు విశ్వవిద్యాలయము అనంతపురములోగాని ఆఖరుకు బెజవాడలోనైనా పెట్టకుండా రాయలసీమవారికి దూరమైన విశాఖపట్టణములో పెట్టుటయనీ, ఇందువల్లనే రాయలసీమవారు ఆంధ్ర విశ్వవిద్యాలయములో చేరక మద్రాసు విశ్వవిద్యాలయములో నుంటున్నామనీ చెప్పుచున్నారు దీనిని సరిచేయుటకే ఆంధ్రప్రముఖులు దస్కతులు చేసిన శ్రీబాగు ఒడంబడికలో ఆంధ్ర విశ్వవిద్యాలయము క్రింద వాల్తేరులోనూ అనంతపురములోనూ రెండు కేంద్రము లేర్పరచి ఆంధ్రుల నందరినీ ఆంధ్ర విశ్వవిద్యాలయము క్రిందికి తీసుకొని రావలెనని ఉద్దేశించబడినది శ్రీబాగు ఒడంబడికను చేసికొనిన కొలది మాసములకే కాంగ్రెసు గవర్నమెంటు పోయి, అడ్వైజర్ల గవర్నమెంటు వచ్చినది అందువల్ల దాని కవసరమైన శాసన సవరణను చేయుట కవకాశము కలుగలేదు అడ్వైజర్లకు పరమ మిత్రులు, రాయలసీమ వాస్తవ్యులు, 'సర్' బిరుదాంకితులునగు ఆంధ్ర విశ్వవిద్యాలయ వైసు ఛాన్సలరు డాక్టర్ సి రామలింగారెడ్డిగా రటువంటి శాసన సవరణను గవర్నరుగారిచేత వెంటనే చేయించి, రాయలసీమకు గల అన్యాయము తొలగించి, అనంతపురములో కేంద్రము నేర్పరిపించి, రాయలసీమను కూడ ఆంధ్ర విశ్వవిద్యాలయము క్రింద ఎందుకు చేర్చుకొనరో నాకు దురూహ్యము అటుల వెంటనే చేయవలెనని వారిని కోరుచున్నాను

పాత కథ కూడ చెప్పుట చాలా అవసరము దురూహలు దుర్వాదుకలు పోగొట్టుట చాలా ముఖ్యము బహుశః కట్టమంచి రామలింగారెడ్డిగారు నేను, మా యిద్దరికన్న ఈ విశ్వవిద్యాలయము యొక్క పుట్టుపూర్వోత్తరములు ఎక్కువ తెలిసినవారు లేరు ఒకటి మాత్రము ముందుగా చెప్పి తప్పీళ్లు తర్వాత మనవి చేస్తాను. దానిని విశాఖపట్టణములో పెట్టుటకు రామలింగారెడ్డిగారే ముఖ్య కారకులు. పట్టుదలతో ఆ విషయములో పనిచేసి మమ్మును ఓడించినవారు వారే అయితే రాయలసీమకూడ ఆంధ్ర విశ్వవిద్యాలయములో ఉండితీరవలెననియే వారి కోరిక కాని విశాఖపట్టణమునకు విశ్వవిద్యాలయము పోవు శాసనము మంజూరు కాగానే బళ్లారి మెంబరు రంగనాథ మొదలియారుగారున్నూ, చిత్తూరు మెంబరు మునిసామినాయుడుగారున్నూ వెంటనే సవరణను తెచ్చి, రాయలసీమను ఆంధ్ర విశ్వవిద్యాలయమునుంచి తొలగింపచేసినారు ఇందుకు కూడ నేను ప్రతిఘటించి ఓడిపోయినాను ఇక కొన్ని తప్పీళ్లు చెప్పెదను

## 2

## రాయలసీమలో లేకుండా చేసిం దెవరు ?

ఆంధ్రరాష్ట్రము,ఆంధ్ర విశ్వవిద్యాలయము రెండును ఆంధ్రులయొక్కయు, ఆంధ్ర భాష యొక్కయు వికాసమునకు కావలెనని ప్రథమము నుంచియు ఆంధ్రోద్యమ నాయకులు కోరుచుండిరి 1925 వ సంవత్సరములో కీర్తిశేషులైన పానుగల్లు రాజాగారు ప్రథమ మంత్రిగా నుండి, సర్ ఏ పి పాత్రోగారు విద్యామంత్రిగా నుండగ, మద్రాసు శాసనసభలో పాత్రోగారిచేత ఆంధ్ర విశ్వవిద్యాలయపు బిల్లు ప్రవేశ పెట్టబడినది ,యావదాంధ్రదేశమునకును సంబంధించియే బిల్లు తేబడినది యూనివర్సిటీలో మూడు కేంద్రములుండవలెనని తలచిరి ప్రథమమున వాల్తేరు, బెజవాడ, అనంతపురాలు మూడు కేంద్రములని రిపోర్టు వ్రాయబడినటులును, కొందఱు తమ పలుకుబడిని వినియోగించి బెజవాడను తీసివేయించి రాజమహేంద్రవరమును పెట్టించినటులను నేను వింటిని బిల్లులో వాల్తేరు, రాజమహేంద్రవరం, అనంతపురం అనియే మూడు కేంద్రములను పెట్టినారు కేంద్రములు కానిచోట్ల క్రొత్తగా మొదటి తరగతి కళాశాలలు స్థాపించుటకు వీలులేదు ఆ సమయములో నేను ఆంధ్ర స్వరాజ్యసంఘమున కధ్యక్షుడుగా నుండుట వలన శాసనసభలోని యునైటెడ్ నేషనలిస్టు (సంయుక్త జాతీయ వాద) పార్టీవారితో నాకు చాలా సంబంధ స్నేహములుండెను దీనికి నాయకులు కీర్తిశేషులైన చింతలపాటి నరసింహరాజుగారు, ఉపనాయకులు కట్టమంచి రామలింగారెడ్డిగారు, డాక్టరు సుబ్బరాయనుగారు కూడ ఈ పార్టీలోనే యుండిరి. అతిత్వరితముగ పెరుగుచు ఆంధ్రదేశములో ప్రథమనగర మగుటకు సిద్ధముగానున్న విజయవాడ (బెజవాడ)లో నెప్పటికిని, హానర్సు రిసర్చి లేకపోగా మొదటి తరగతి కళాశాలయైన పెట్టుటకు వీలులేక విద్యావిషయికములో ఎడారిగా ఉండవలసినదేనాయని మేము చాల కించపడి, ఆ బిల్లు శాసనమగు కాలములో సంయుక్త జాతీయవాదులలో చేరిన శ్రీ ఆమంచర్ల కృష్ణారావు పంతులుగారిచేత బెజవాడ నాలుగవ కేంద్రముగా నుండుటకు సవరణను పెట్టించితిమి శ్రీ అడుసుమల్లి గోపాలకృష్ణయ్యగారు కూడా నాతో కలిసి చాలా కృషి సలిపిరి. నేను జాతీయపార్టీలోను ఆయన జస్టిసు పార్టీలోను పనిచేసితిమి గుంటూరు నాలుగవ కేంద్రముగా నుండవలెనని జస్టిసుపార్టీలో చేరిన కీర్తిశేషులైన యతిరాజులు నాయుడుగారు సవరణను పెట్టిరి 'బెజవాడ' అను సవరణను జస్టిసుపార్టీవారును, 'గుంటూరు' అను సవరణను జాతీయ పార్టీవారును ఓడించిరి అసలు బిల్లులో మూడు కేంద్రములే మిగిలెను కేంద్రములు ప్యాసు అయినపిమ్మట ఆ మధ్యాహ్నపు సమావేశములో బెజవాడ యందు అభిమానముగల పానుగల్లు రాజావారు విశ్వవిద్యాలయపు కార్యస్థానమైన బెజవాడలో నుండవలెనని వవరణనుతెచ్చి, ప్యాసుచేయించిరి బెజవాడ విశ్వవిద్యాలయముకు కార్యస్థానమయ్యెను వాల్తేరు, రాజమహేంద్రవరం, అనంతపురములు విద్యాకేంద్రములుగ శాసనము మంజూరయ్యెను ఆ చర్చలో కట్టమంచి రామలింగారెడ్డిగారున్నూ డాక్టరు సుబ్బరాయన్‌గారున్నూ విశ్వవిద్యాలయము కార్యస్థానము అంతయు ఒకే కేంద్రముగ నుండవలెననియు, ఆ స్థలము వాల్తేరనియు సవరణలు తెచ్చి ఓడిపోయినటుల కన్పట్టుచున్నది సవరణలు తెచ్చినను లేక పోయినను అంతయు వాల్తేరులోమాత్ర ముండవలెనని వాదించిరనుట నిర్వివాదాంశము శ్రీ పానుగల్లురాజాగారును వారి పార్లమెంటరీ కార్యదర్శి ఏ రామస్వామి మొదల్యారుగారును కొలదికాలములో బెజవాడకు విచ్చేసినపుడు బహిరంగసభలో త్వరలో మరియొక సవరణను తెచ్చి బెజవాడను నాలుగవకేంద్రముగ చేయించెదమని వాగ్దానముచేసిరి నేనపుడు బెజవాడకు మ్యునిసిపలుచైరుమనుగ నుంటిని నేను పానుగల్లురాజాగారికి వ్యతిరేకమైన రాజకీయపార్టీగా నున్నను, ఆంధ్రదేశమునకు విజయవాడ స్వభావ సిద్ధమైన రాజధానియనియు, ఆంధ్రరాష్ట్రము వచ్చినపుడు దీనినే రాజధానిగ చేయుటకు తగిన స్థితిలో నుంచుటకు ఈ నగరమును వృద్ధిచేయవలెననియు వారు నాకు సలహానిచ్చిరి విద్యుచ్ఛక్తికి కావలసిన లక్షలను వారు వెంటనే మంజూరు చేసిరి. రహదారీ బంగాళాను మార్కెట్టుగా మార్చుటకు అనుమతిచ్చిరి. వారు విజయవాడ యొక్క, అభివృద్ధి యందు ప్రత్యేక పక్షపాతమును చూపుచువచ్చిరి

ఆ విశ్వవిద్యాలయ చట్టమును బట్టి శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ప్రథమ వైసు ఛాన్సలరుగా విజయవాడ వచ్చినపుడు, నేను మ్యునిసిపాలిటీతరపున ఆహ్వానమిచ్చితిని బహుశః ఏ రాధకృష్ణన్‌గారో అయినట్లుఘున ముందుగా సెనేటుభవనమును విజయవాడలో కట్టించి పిమ్మట నాలుగవకేంద్రముకై కృషిసల్పియుండెడి వారని నా నమ్మకము అది సామాన్య కార్యక్రమము కాని రామలింగారెడ్డిగారు ప్రత్యేక వ్యక్తి. బెజవాడకు కేంద్రము ముందుగా కావలెనని వ్రాయుచుండిరి కేంద్రములేని సెనేటుహౌసు నిష్ప్రయోజనమని వారి వాదము తమ సిండికేటుచేత బెజవాడకు నాలుగవకేంద్రము కావలెనని తీర్మానము చేయించిరి కాని, సెనేటు భవనమున కట్టించలేదు బెజవాడలో ఎట్టిపనిని చేయించలేదు.

1926 వ సంవత్సరాంతము వరకు ఇటుల జరిగెను ఆ సంవత్సరము నవంబరు నెలలో జరిగిన శాసనసభ ఎన్నికలలో 42 మంది కాంగ్రెసు వారెన్నుకొనబడుట 16 మంది జస్టిసువారు వచ్చుట 12 మంది ఇండిపెండెంటు వారు వచ్చుట, జరిగెను నేను కృష్ణాజిల్లా పక్షమున కాంగ్రెసు అభ్యుడుగ శాసనసభ కెన్నుకొనబడితిని మా కాంగ్రెసువారు మంత్రి పదవులను పుచ్చుకొనుటకు నిరాకరించినందున, ఎన్నికలలో ఓడిపోయిన జస్టిసువారికి మంత్రి పదవుల నివ్వక క్రొత్త పార్టీయైన ఇండిపెండెంటు పార్టీ పక్షమున డాక్టరు సుబ్బరాయన్, రంగనాథ్ మొదల్యార్, ఆరోగ్యస్వామిగార్లు మంత్రులుగ నియమింపబడిరి వీరిలో విద్యామంత్రి డాక్టరు సుబ్బరాయన్‌గారు కొన్ని నెలల వరకును ఈ పార్టీవారికిని మా కాంగ్రెసు పార్టీకిని మైత్రియుండెను ఆ కాలములోనే శ్రీ రామలింగారెడ్డిగారిని అడిగి వారి ప్రోత్సాహముతో, 1927 వ సంవత్సర ప్రారంభమున 'బెజవాడ'ను నాలుగవ కేంద్రముగా చేయు సవరణబిల్లును నేను తయారుచేసి శాసనసభ కార్యదర్శిగారి కిచ్చి, దానిని బలపర్చి మంజూరు చేయవలసినదని అప్పటికి నాకు మిత్రులైన డాక్టరు సుబ్బరాయన్‌గారిని రంగనాథ మొదల్యారు గారిని అడుగుటకు వెళ్లితిని డాక్టరు సుబ్బరాయన్‌గారు అదివరకు ఒక అరగంట క్రిందనే వైసుఛాన్సలరగు రామలింగారెడ్డిగారు తనతో సంభాషించి వెళ్లిరనియు, తాముభయులము ఈ శాసనమును తారుమారుచేసి కేంద్రముల నన్నిటిని కొట్టివైచి ఒకే కేంద్రమును విశ్వ విద్యాలయపు కార్యస్థానమును వాల్తేరులో పెట్టుటకు అంగీకరించితి మనియు, గావుని నా బిల్లును తా నంగీకరించననియు, గవర్నమెంటు పక్షమున పైవిధముగా కొలది కాలములో సవరణబిల్లును తేబోవుచున్నామనియు నాతో చెప్పిరి రంగనాథ మొదల్యారుగారు యావత్తూ విద్యామంత్రి చేతిలో నున్నదనియు తనకేమియు తెలియదనియు చెప్పిరి ఇందుమీద శ్రీ రామలింగారెడ్డిగారికి, వారు సుబ్బరాయన్ గారితో ఎందు కటుల చెప్పినారనిన్ని, నన్ను ముందుగా ప్రోత్సహించి అందుకు వ్యతిరేకముగా చెప్పుట న్యాయమా అనిన్ని ప్రశ్నించుచు ఉత్తరము వ్రాస్తిని తాము సుబ్బరాయన్‌గారి కటుల చెప్పినమాట వాస్తవమేననియు, ప్రథమము నుండియు తామున్నూ సుబ్బరాయను గారున్ను ఒకే కేంద్రముగా వాల్తేరులో నుండవలెనని అభిప్రాయము గలవారమనియు, చల్లని ప్రదేశము గనుక సంవత్సరమునకు పది నెలలుండి చదువుకొనుటకు వాల్తేరే ఎక్కువ అర్హమైనదనియు, వాల్తేరొకటే కేంద్రముగా నుండుటకు శాసనసభ్యులు సమ్మతించనిచో రెండవ పక్షముగా విజయవాడకు ఓటిచ్చెదమనియు, విజయవాడ విద్యా కేంద్రముకంటె ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ కార్యాలయముగ అర్హమైనదనియు, నాకు బదులు వ్రాసిరి ఆ ఉత్తరమును అపుడు బెజవాడ పక్షముగా పనిచేయుచున్న కమిటీ శెక్రటెరీ యగు శ్రీ దాసు త్రివిక్రమరావుగారి కిచ్చితిని. ఇప్పటికిని వారి రికార్డులో ఉండియుండవచ్చును. ఇంతటితో, శాసనసభలో పోరాడి, 42 నామినేటెడ్ సభ్యులు అనేకమంది ఆంధ్రేతర సభ్యులు వెనుక గల గవర్నమెంటు చేతిలో ఓడిపోవుట మంచిదికాదని తలచి, నన్ను శాసన సభలో అధ్యక్షులు పిలిచినపుడు నాబిల్లును ప్రవేశ పెట్టుట మానుకుంటిని

## 3

## తుదిరంగము

డాక్టరు సుబ్బరాయన్‌గారికి విద్యాశాఖ కార్యదర్శి డైరెక్టరు ఆఫ్ పబ్లికు ఇన్‌స్ట్రక్షను గార్లు సలహా యిచ్చియుండవచ్చును, మూడు కేంద్రములు కొట్టివేయవద్దని కనుక కొలది నెలలలో నాలుగవ కేంద్రమును పెట్టుటకు తామొప్పుకొనజాలమనిన్ని మూడు కేంద్రములే యుండవలెననిన్ని బెజవాడయొక్క విశ్వవిద్యాలయ కార్యస్థానమును రాజమహేంద్రవరమునకు మార్చి ననుసరే, లేదా రాజమహేంద్రవరములోని కేంద్రమును తీసి బెజవాడలో పెట్టినాసరే ఏదో ఒకదానిని ఆంధ్ర సెనేటు తీర్మానించి తమకు పంపితే తామా ప్రకారము శాసన సవరణను పెట్టెదమని సుబ్బరాయన్ ప్రభుత్వము రామలింగారెడ్డిగారికి వ్రాసిరి రామలింగారెడ్డిగారు రాజమహేంద్రవరముయొక్క కేంద్రమును బెజవాడకు మార్చుటకు సిండికేటులో తీర్మానించి పంపిరి ఇక సెనేటులో చర్చకు వచ్చును. ఇంతలో రాజమహేంద్రవరమువారు మేల్కొనిరి. రాయలసీమలో మద్దూరి అన్నపూర్ణయ్యగారు మొదలగువారు సంచారముచేసి, రాజమహేంద్రవరము అనంతరం రెండు కేంద్రములు ఒకే కాలములో అభివృద్ధి చెందుటకున్నూ కార్యస్థానము అనంతపురములో నుండుటకున్నూ సెనేటులో ఓటు చేయవలెనని ప్రబోధము గావించిరి. రాయలసీమవారు అనంతపురముకు విశ్వవిద్యాలయము తప్పక వచ్చునని నమ్మిరి. బెజవాడలో సెనేటుసభ సమావేశమైనపుడు మే మోడిపోతిమి నేనపుడు సెనేటులో సభ్యుడను కార్యస్థానము బెజవాడనుండి అనంతపురముకు పోవుటకున్నూ, రాజమహేంద్రవరము అనంతపురము రెండే కేంద్రములుగానుండి ఒకేకాలమున అభివృద్ధి చెందవలెననిన్ని అధిక సంఖ్యాకులచే తీర్మానింపబడెను. వాల్తేరులో వైద్యకళాశాల నిలచియుండును ఈ తీర్మానము గవర్నమెంటుకు పంపబడెను



# ఆంధ్ర విశ్వవిద్యాలయము

గవర్నమెంటువారు ఎట్టి సవరణబిల్లు పెట్టకమునుపే తూర్పుగోదావరి శాసనసభ్యులు పశ్చిమగోదావరినుండి దండు నారాయణరాజుగారు కార్యస్థానమును బెజవాడనుండి రాజమహేంద్రవరమునకు మార్చవలెనను సవరణ బిల్లును పెట్టిరి. అన్ని కేంద్రములు కొట్టివేసి, ఒకే కేంద్రములో కార్యస్థానముకూడ నుండవలెనను సవరణ బిల్లును కీర్తిశేషులయిన పి.సి. వెంకటపతిరాజుగారు పెట్టిరి. బెజవాడనుండి అనంతపురముకు కార్యస్థానము మార్చవలెనని బిల్లును కీర్తిశేషులయిన కేశవపిళ్లగారు పెట్టిరి. కృష్ణాజిల్లానుండి గొల్లపల్లి రాజాగారు, నేను ఒక బిల్లును నాలుగవకేంద్రముగా బెజవాడను చేసి మొదటితరగతి కళాశాలలను కేంద్రములు కాని చోట్లకూడ పెట్టుట కవకాశముండవలెనని గొల్లపల్లి రాజాగారును రాజమహేంద్రవరము నుండి కేంద్రమును బెజవాడకు మార్చవలెనని నేనును బిల్లులను పెట్టితిమి. రాజకీయ నేరములకు శిక్షలు పొందినవారికి సెనేటులో స్థానము లేదనిఅదివరకు చట్టంలోనున్నదానిని ఆఅనర్హతను తీసివేయవలెననికూడ పెట్టితిమి. మేమిద్దరము సంప్రదించియే పెట్టితిమి. కీడెంచి మేలెంచవలెననే యుద్దేశ్యముతో అన్నీ పోయినా ఆఖరుకు మొదటితరగతి కళాశాలయైన ఎప్పటికైన బెజవాడలోపెట్టు హక్కు కలుగుటకై ఆ బిల్లులో అన్నిచోట్లను మొదటి తరగతి కళాశాల లుండవచ్చునని వ్రాసితిమి. ఇవే ప్రధానమైనబిల్లులు.

ఈ బిల్లులన్నిటిని ఒకపెద్ద సెలెక్టుకమిటీకి వేసిరి. అందులో రామలింగారెడ్డిగారుండిరి. మంత్రి సుబ్బరాయన్‌గారుండిరి. చాలమందిని సాక్ష్యము విచారించిరి. పి. సి. వెంకటపతిరాజుగారు పెట్టినవిధముగా ఒకే కేంద్ర ముండవలెనని సెలక్టు కమిటీ అభిప్రాయ పడెను. కార్యస్థానముకూడ ఆ కేంద్రమునందే ఉండవలెను. బెడవాడ నుండి పోవునటుల రూఢి అయ్యేను. అంతట అందులో సభ్యులమైన పిల్లలమర్రి ఆంజనేయులుగారు నేను కృషి చేసి ఎక్కువమందిచేత అనంతపురములో కార్యస్థానము ఏకైక కేంద్రము ఉండునటున ఒప్పించితిమి. అదియే సెలక్టు కమిటీరిపోర్టు. అది శాసనసభకు అంగీకారముకు వచ్చినపుడు ప్రభుత్వపక్షమున 'అనంతపురం' అను మాటకు బదులుగా 'రాజమహేంద్రవరం' అను సవరణనుపెట్టిరి. ఇది పానుగల్లు రాజాగారికిష్టములేదు. ఆ సమయములో కృష్ణాజిల్లాలోని జమీందార్లు కృష్ణా గుంటూరుజిల్లా బోర్డులు బెజవాడ గుంటూరు మ్యునిసిపాలిటీలు కలిసి 20 లక్షల రూప్యములు విరాళము లిచ్చెదమనియు బెజవాడలోనే విశ్వవిద్యాలయమును కేంద్రమును ఉంచవలసినదనియు కోరుచు అప్పీలుచేసిరి. ఈ విషయమును ఆలోచించుటకు రామారాయణింగారు నేను పనిచేసి వాయిదా వేయించితిమి.

తర్వాత తిరిగీ ఈ విషయము శాసనసభకు వచ్చులోపల మరియొక సమావేశముకు మేమందరము వెళ్లినపుడు అన్ని పార్టీల ఎన్నిక నామినేటెట్ ఆంధ్ర సభ్యులను పోగుచేసి వారిలో ఎక్కువమంది అభిప్రాయప్రకారం ఈ విషయము పరిష్కరించుట న్యాయముగాని తమకున్న ఇతరబలములో గవర్నమెంటు తమ యిష్టము వచ్చినట్లు తీర్మానించుట న్యాయము కాదని డాక్టరు సుబ్బరాయన్‌గారితో చెప్పి ఒప్పించి, ఆంధ్ర సభ్యులను దొరికినవారి నందరిని సుబ్బరాయన్‌గారి గదిలోకి పోగుచేసితిని.

మా పక్షమున పానుగల్లు రాజాగారు నాయకులుగా నుండిరి. ఆయన ఆంధ్రమధ్యస్థమైన బెజవాడలో నుండవలెనను గట్టిగా చెప్పిరి. చాలమందికి అట్టి భావమే యున్నను, రామలింగారెడ్డిగా రొప్పుకొననిది తా నంగీకరించనని సుబ్బరాయన్‌గారు చెప్పిరి. రామలింగారెడ్డిగారు చల్లటి ప్రదేశమైన వాల్తేరులో నుండవలెనని పట్టుపట్టిరి. అయితే మదనపల్లిలో ఎందుకుండగూడదని నేను రామారాయణింగారు అడిగితిమి. విద్యా విషయిక వాతావరణము వాల్తేరులో గలదుగాని, మదనపల్లిలో లేదని రామలింగారెడ్డిగారు చెప్పిరి. ఆ విషయములో రాజీ కుదరక ఎక్కడివార మక్కడపోతిమి.

1929వ నంవత్సరమాఖరు భాగమున మరల శాసనసభ ఎదుటకు వచ్చులోపల పానుగల్లు రాజాగారు స్వర్గస్థులైరి. శాసనసభకు రాగా, ప్రభుత్వమువారు రాజమహేంద్రవరమును వదలివైచి 'వాల్తేరు' అను సవరణను పెట్టిన తక్కిన అన్ని సవరణలను ఓడిపోయెను. ఒకే కేంద్రముగా వాల్తేరులోనే విశ్వవిద్యాలయ ముండవలెనని మంజూరయ్యెను. అనంతపురం కూడా కేంద్రం కాదు. ఉన్న మొదటి తరగతి కళాశాల పోదు. కొత్తవి రావు. ఆ వెంటనే రాయలసీమ ఆంధ్ర విశ్వవిద్యాలయము నుండి తీసివేయవలసిన దను సవరణను లేటు. బి. మునిస్వామినాయుడు, ఆర్కాటు రంగనాథ మొదల్యారుగార్లు పెట్టిరి. మేము వ్యతిరేకించితిమి. ప్రభుత్వమువారు సవరణ నంగీకరించిరి ఆ సవరణ ప్యాసు అయ్యెను. అపుడు బెజవాడకు కొంత సహాయము చేయు నుద్దేశ్యముతో గొల్లపల్లి రాజాగారి బిల్లులోని మొదటి తరగతి కళాశాల లెక్కడనైన పెట్టవచ్చునను భాగమును అంగీకరించిరి, రాజకీయ నేరస్థుల అనర్హతలు కూడ తొలగింపబడెను. ఇది ఆఖరున ప్యాసు అయిన చట్టము. 

ఆంధ్రపత్రిక
1942 ఫిబ్రవరి 11
సంచిక నుంచి



"నాన్నగారూ! నేను వదినని పెళ్లి చేసుకోవాలనుకొంటున్నాను" అన్నాడు నారాయణ

పక్కింట్లో టపాకాయ పేలింది అది తన వళ్లో పేలినట్లు అదిరిపడ్డాడు జానకిరామయ్య కొడుక్కేసి అర్థం కానట్లు చూసాడు నారాయణ మరోసారి తన కోర్కెను మరింత దృఢంగా వెలిబుచ్చాడు

"ఏమన్నావురా! ఏమంటున్నావో తెలిసే అంటున్నావా!" అన్నాడు జానకిరామయ్య నమ్మలేనట్టుగ.

"ఆలోచించండి" అని నారాయణ అక్కడ నుంచి జారుకొన్నాడు.

జానకిరామయ్యకి కొడుకు నడుస్తున్న కొత్తబాట నడవరాని చీకటిదారిగ కనిపించింది అన్న మాటలు అనరాని పాపపుమాటలా ఉన్నాయి ఆ క్రితం రోజువరకు పట్టిన ఈశాన్య ఋతుపవనాల ముసురువల్లకంటేగూడా ఈ మాటలు జానకిరామయ్యలో ఎక్కువ వణుకు పుట్టించాయి నత్తగుల్ల భయం వేసినప్పుడు లోపల్లోపలికి ముడుచుకొన్నట్టు జానకిరామయ్య వరండానుంచి ఇంటి లోపలి తన గదివేపు కదిలాడు

తన గదివేపు వెళ్తూ కోడలు ఏం చేస్తోందో అని తొంగిచూసాడు పార్వతి భుజం మీద రెండేళ్ల కూతుర్ని వేసుకొని జోకొడ్తోంది అది ఆమె మనస్సును జోకొట్టుకోవటంలా అనిపించింది జానకిరామయ్యకి పార్వతి కళ్లెత్తి మావగార్ని చూసింది ఆ కళ్లలో అతనికి ఏ భావము కనిపించలేదు ముఖం ప్రశాంతంగా ఉంది నుదురు ఖాళీగా ఉంది పార్వతి కళ్లు దించుకొంది.

"బుజ్జి నిద్రపోయిందా అమ్మా!" అని అడిగేడు

"ఇప్పుడే" అంది పార్వతి ఆమె మనస్సు మాత్రం బుజ్జి పుట్టిన కొద్ది నెలలకే నిద్ర పోయింది

జానకిరామయ్య తన గదిలో మంచంమీద పడుక్కొన్నాడేగాని మనస్సు స్థిమిత పడలేదు. దీపావళి ఆగమనాన్ని సూచిస్తూ అవుతున్న శబ్దాలు పిన్నలకి పెద్దలకి ఆనందం కలిగిస్తుంటే జానకిరామయ్యకు మాత్రం ఆందోళన కలిగిస్తున్నాయి

అతని భార్య సీతమ్మ ఎంటింట్లో పని ముగించుకొని వచ్చేసరికి తొమ్మిది కొట్టింది. ఆమె రాగానే ఆమెతో మాట్లాడటానికి ఎదురు చూస్తున్న జానకిరామయ్య లేచి కూర్చున్నాడు

# న వ శ క ం

''ఏమన్నా కావల్నా ?'' అని అడిగింది సీతమ్మ నవారు మంచం వాల్చుకొంటూ.

''ఏమక్కర్లేదు. నిద్రపట్టలేదు అంతే.''

''రిటైరయ్యాక మీకు ఆలోచనెక్కువయ్యాయి. ప్రతీదానికి మీకు చింతే ! 'వృద్ధస్తావత్ చింతాసక్తః' అని ఊట్టనే అన్నాడా మహానుభావుడు ! ఇంతకు ఎందుకు పట్టలేదు మీకు నిద్ర ?'' అని అడిగింది పక్క పరుచుకొని దానిమీద కూర్చుంటూ సీతమ్మ.

ఆమె ధోరణిని పట్టించుకోకుండా, ''నారాయణ నీతో ఏమన్నా అన్నాడా ?'' అని ఎదురు ప్రశ్నించాడు జానకిరామయ్య.

''దేనిగురించి ?''

''పార్వతి పెళ్ళి గురించి.''

''మరో సంబంధం చూశాడుట ?''

''ఊఁ !'' జానకిరామయ్య నాన్చాడు.

''ఎవరో చెప్పాడా ?''

''పై సంబంధం కాదు.''

''మనవాళ్ళలో ఎవరైనానా ?''

''మనింటోవాడే !''

''మనింట్లోవాడా ?'' ఆమె ఆశ్చర్యంగా అడిగింది తనకు తెలియకుండా ఎవరై ఉంటారా అని.

''నారాయణే చేసుకొంటాడుట'' జానకిరామయ్య తేల్చి చెప్పాడు. సీతమ్మకి తల భూచక్రంలా తిరుగుతున్నట్టు అనిపించింది. తేరుకొని,

''అయ్యో ! అయ్యో ! అదేమిటండీ ! మీరు తప్పు విని ఉంటారండీ ! వదిన తల్లితో సమానం. అల్లాంటి పాపపు మాటలు వినబడే ఇల్లు నిర్వంశమైపోతుంది. పార్వతి ఈ ఇంటికి చిన్నకోడలుగ కొత్తగా అడుగు పెడ్తుందా ! ఎవరికి పుట్టిన బుద్ధిట. నారాయణకి పుట్టింది కాదు. ఎవరో కిట్టని బయటి వాళ్ళ దుర్బోధ ఇది'' అంది బాధపడ్తూ.

''అల్లాగే అనిపిస్తోంది నాకూను. వీడెవర్నో 'మా వదినని చేసుకో' అని అడిగి ఉంటాడు. వాడు 'మా అందరికీ కట్టబెట్టాలని చూడకపోతే నువ్వే చేసుకొని ఉద్ధరించరాదా' అని వీడిని ఎద్దేవా చేసి ఉంటాడు. వీడికి పౌరుషం ముంచుకువచ్చి ఉంటుంది.'' జానకిరామయ్య ఊహించాడు.

''ఇది మరీ బావుంది. ప్రపంచంమీద వావి వరస అనేవి లేకుండా పోతాయా ! దేముడూ దయ్యం లేవంటూ మాట్లాడే మొండి వెధవ లోకళ్ళు తయారయ్యారీమధ్య. వాళ్ళతో మనవాడి స్నేహాలు మాన్పించాలి'' అంది సీతమ్మ.

తన సంతానం ఏ విషయం గురించి అయినా తనకి భిన్నంగా ఆలోచించరని ఒకవేళ ఆలోచిస్తే అది పరాయివాళ్ళ దుష్ప్రభావమే అయి తీరాలని నమ్మే స్వభావం సీతమ్మది.

''ఈ విషయంలో పార్వతి అభిప్రాయం ఏమిటో !'' అని జానకిరామయ్య తన అనుమానాన్ని వ్యక్తపరిచాడు.

''ఏముంటుంది ! తన మరిదే తనను కావాలనుకొంటున్నాడని తెలిస్తే అవమానం భరించలేక ఏ నూతిలోనో దూకి ఛస్తుంది. మీరు నారాయణ నోట్లో గడ్డందుకు పెట్టలేదు ?'' అంది. ఆవేశంగా అన్నాక ఆగింది. ఆగాక ఆలోచించింది.

''ఇదంతా పార్వతికి పుట్టిన దుర్బుద్ధి కాదు కదా !'' అన్న ఆలోచన వచ్చింది. వచ్చిన ఆలోచన ఆమెకి భయం కలిగించింది.

''పార్వతి నో కంట కనిపెట్టి ఉండాలి'' అనుకొంది.

''చూడు ! రేపు అమ్మాయి అల్లుడూ వస్తారు. వాళ్ళున్న రెండ్రోజులు రాద్ధాంతాలు, అఘాయిత్యాలు వద్దు. వాళ్ళు వెళ్ళాక మార్గం ఆలోచిద్దాం'' అని సూచించాడు జానకిరామయ్య.

'రేపు తన చెల్లెలు అనసూయ, బావ సుబ్బారావు వస్తారు. వాళ్ళు తన అండన నిలబడ్తారు' అని నారాయణ ధైర్యం తెచ్చుకొని నిద్రకి ప్రయత్నం చేసాడు.

ఆ ఇంట్లో ఆ రాత్రి ఎవరు సరిగ్గా నిద్రపోలేదు. అయితే పార్వతి అది కేవలం నిద్ర పట్టని మరో రాత్రి మాత్రమే ! పొద్దున్న ఎప్పటిలాగా నారాయణ, ''వదినా ! కాఫీ !'' అనలేకపోయాడు, కాఫీ కలిపి పార్వతి గ్లాసుల్లో పోస్తున్నప్పుడు. ఆ క్రితంరోజు అతను తండ్రితో వ్యక్తపరిచిన అభిప్రాయంవల్ల పార్వతిని చూడగానే ఇబ్బంది పడ్డాడు. సీతమ్మ గమనిస్తూనే ఉంది. పార్వతి యంత్రంలా పనిచేసుకొంటూ పోవడంవల్ల నారాయణ పార్వతితో ఏమీ చెప్పి ఉండడని అర్థం చేసుకొంది.

పార్వతిని కాఫీ ఇమ్మని అడగలేక తనే గ్లాసందుకొనేందుకు నారాయణ వంగుతుంటే సీతమ్మ తనే కొడుక్కి కాఫీ అందించింది. కాఫీ గ్లాసు తీసుకొంటూ నారాయణ తల్లి కళ్ళల్లోకి చూసాడు.

రాత్రంతా కోపంతో కుతకుతలాడి అప్పుడే చల్లారుతున్న సీతమ్మ కళ్ళు, బాగా కాలిన చిచ్చుబుడ్డి, కుండలోంచి ఎర్రదనాన్ని చిమ్మేటట్టుగ ఎర్రగా తోచాయి నారాయణకి.

కొందరికి సంఘంలో కట్టుబాట్లు దాటశక్యంగాని పెద్ద అవరోధాలలాగాను, ఆచారాలు మార్చుకోడానికి వీల్లేని పరమ ధర్మాలలాగాను కనిపిస్తాయి. కట్టుబాట్లు అవి ఏ అవసరం కోసం ఏర్పడ్డాయో ఆ అవసరం తీరిపోగానే అర్థరహితమైపోతాయి. అటువంటి వాటిని సడలించటం లేక అతిక్రమించటంవల్ల సంఘానికేమీ ప్రమాదం ఉండదని వీరు గుర్తించరు. ఉన్నవి ఉన్నట్టుంటే (స్టాటస్‌కో) ఏ గొడవ ఉండదు కదా అని వీళ్ళు తమ మనస్సులోకి ఏ కొత్త ఆలోచన రానీరు. అంతకుముందు కనీసం ఓ పది మందైనా కొత్త మార్గాన నడిచిన నిదర్శనం (ప్రిసిడెన్సు) ఉంటే గాని కొత్త మార్గాన నడవటాన్ని వ్యతిరేకిస్తారు. ప్రిసిడెన్సుంటే కొంత నయం. కొత్త మార్గంలో నడిచే మొదటి కొద్ది మందిలో తాము ఒకరిగా ఉండటానికిష్టపడరు. సీతమ్మ ఆ కోవకి చెందిన మనిషి. నారాయణ తనేదారి తీయటానికి వెనుకాడదు.

తల్లి కోపంగా ఉందని గుర్తించి, పార్వతి మనసు తెలియకుండా ఆమెతో వాదన వృథా అని, కాఫీగ్లాసుతో నిష్క్రమించాడు. సాయంత్రం

జనవరి 1న హైదరాబాదులోని రవీంద్రభారతిలో 'సుప్రజా కళాక్షేత్రం' ప్రారంభోత్సవం సందర్భంగా వేదికపై ఉన్న జస్టిస్ సీతారామరెడ్డి, చలనచిత్ర నిర్మాత శ్రీ కె. రాఘవ, శ్రీ కె.వి. భాస్కరరావు, సంస్థ అధ్యక్షుడు శ్రీ డి. అంజయ్యనాయుడు, ప్రసంగిస్తున్న సంస్థ కార్యదర్శి శ్రీ చల్లా సుబ్రహ్మణ్యంగార్లని చిత్రంలో చూడవచ్చు.



వచ్చే అనసూయకోసం ఎదురు చూడటంతప్ప నారాయణ ఏమీ చెయ్యదలుచుకోలేదు. అనసూయ అతనికంటే ఒకటిన్నర సంవత్సరాలు చిన్నది. అతని మనస్సుని అర్థంచేసుకోగలదు. పార్వతిని రెండో పెళ్ళికి అనసూయే ఒప్పించింది

*　　*　　*

క్రితం సంవత్సరం అనసూయ కొడుకుని తీసుకొని వినాయకచవితి పండుగకి వచ్చింది. అప్పటికి ఆమె పెద్దన్న పోయి ఏడాదిమీద మూడు నెలలయింది. ఆమె వచ్చేవరకు ఆ ఇంట్లో ఎవరు పండుగ చేసుకోవాలని అనుకోలేదు తను రాకపోతే ఆ ఇంట్లో ఆవరించుకొన్న స్తబ్దత పోదని తెలిసే వచ్చింది.

"ఏమ్రా! మా సుపుత్రుడిచేత పూజ చేయించరా!" అని అడిగింది.

"దీనికి అన్నయ్య పోయిన బాధ కొంచెం కూడా ఉన్నట్టులేదే!" అనుకున్నాడు నారాయణ. తండ్రి నారాయణని మర్నాటి పూజకు కావలసిన ఏర్పాట్లు చూడమన్నాడు.

నారాయణ మూడేళ్ళ మేనల్లుడిని తీసుకొని బజారుకు వెళ్ళి వినాయకుడి బొమ్మా, గొడుగు పత్రి కొన్నాడు. తిరిగి వస్తూ దార్లో ఇంటి పురోహితుడిని కలిసివచ్చి పూజ చేయించమని కోరాడు.

"ఇంత ఆలస్యంగా చెప్పారేం బాబూ! ఇంకా నయం! నేను మరోచోట మాటివ్వలేదు" అన్నాడు పురోహితుడు.

"మా చెల్లెలు అనసూయ, వీడిని తీసుకొని వచ్చేవరకు మేం పూజచేసుకోవాలని అనుకోలేదు. ఇంకా అన్నయ్య జ్ఞాపకాలు పచ్చిగా ఉన్నాయి"

"కుమిలిపోతూ కూర్చుంటే జ్ఞాపకా లెప్పుడు పచ్చిగానే వుంటాయి మీ అమ్మగారు, నాన్నగారు, వదిన సంవత్సరంలో కొద్దిరోజులు, రోజులో కొద్దిక్షణాలు మీ అన్నయ్యని మర్చి పోవాలంటే, ప్రపంచ ధోరణిలో పడటం ఒక్కటే మార్గం. అందుకే పండుగలని ఓ ఏడాదిపాటు మానుకొన్నా తిరిగి చేసుకోవటం మొదలు పెట్టాలి. పోయిన వాళ్ళని తలుచుకొంటూ బతికున్నవాళ్ళ పట్ల మన కర్తవ్యాన్ని అశ్రద్ధ చెయ్యరాదు. మీ అన్నయ్య కూతురు, ఈ మేనల్లుడు ఉన్నారు కదా! వీళ్ళ భవిష్యత్తు కన్నీటితో తడవరాదు. నవ్వుల పువ్వుల బాటమీద నడవాలి."

నారాయణకి అప్పుడు తెలిసింది, చెల్లెలు వచ్చి ఎంత మంచిపని చేసిందో!

మర్నాడు పూజానంతరం పురోహితుడు వ్రతకథ చదువుతున్నాడు.

"మరియు విధవ పూజించెనేని మరే జన్మ యందు వైధవ్యము పొందదు ..."

బుజ్జిని వళ్ళో పెట్టుకొని పూజ చేయిస్తున్న నారాయణ వదిన కళ్ళల్లోకి చూసాడు. పార్వతికి ఆ క్షణంలో తనూ తన భర్త కలిసి పూజ చేసుకోటం గుర్తుకువచ్చింది ఆ తరువాత, బుజ్జి పుట్టాక ఇంట్లో చేసు కొంటున్న మొదటి వినాయకచవితి కదా ఇది అన్న ఆలోచన వచ్చింది. తండ్రి వడిలో కూర్చుని పూజ చేసుకొనే అదృష్టంలేదు దానికి. పినతండ్రి వడిలో కూచుంది తన పిల్ల తండ్రి లేనిది అన్నభావం కలుగగానే ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. పండుగనాడు ఏడవరాదని నిగ్రహించుకొంది

ఆమె కళ్ళల్లో నీళ్ళు చూడనే చూసాడు నారాయణ ఆమె కళ్ళల్లోకి కాంతి తిరిగి రావాలంటే ఏంచేస్తే బావుంటుందా అన్న ఆలోచనలో పడ్డాడు.

సాయంత్రం నాలుగ్గంటల వేళ అనసూయ నారాయణకి ఓ పళ్ళెంలో ఉండ్రాళ్ళు పెట్టి అల్లప్పచ్చడి వేసి ఇచ్చి తనూ తింటూ ఎదురుగా నారాయణ గదిలో కూర్చుంది.

"అనసూయా! వదిన విషయంలో ఏం చేస్తే బావుంటుంది?" అని అడిగాడు నారాయణ

అనసూయకి నారాయణ చదువు గురించా, ఆస్తి గురించా లేక ఉద్యోగం గురించా మాట్లాడు తున్నది, తెలియలేదు.

"ఏమైందిప్పుడు?" అని అడిగింది

"జీవితం మోడైపోయింది. ఇప్పుడు వదిన వయస్సు ఇరవైమూడు. నీకంటే ఏ ఆర్నెల్లో పెద్దది. అప్పుడే ఆమె బతుకుకి బుజ్జీ తప్ప మరో అర్థం లేకుండా పోయింది ఇది న్యాయమేనా?"

అనసూయకి నారాయణ బాధ అర్థమైంది. "వదిన మళ్ళీ పెళ్ళి చేసుకోవాలంటావు!" అంది.

"మరే నువ్వు వదినని ఒప్పించు నేను నా స్నేహితుల్లో మంచివాడు ఆదర్శవాది అయిన వాడిని ఒప్పిస్తాను" అని అర్థించాడు.

ఆ మర్నాడు పెరట్లో చాప మీద పూలు పోసుకొని పూలు గుచ్చుకొంటూ అనసూయ పార్వతితో కబుర్లు మొదలు పెట్టింది తల్లి లోపల పని చూసుకొంటోంది. బాబు, బుజ్జి ఆడుకొంటున్నారు అనసూయ పార్వతి ని కబుర్లలో పెట్టి మెల్లిగా సంభాషణ, పూల మీద నుంచి రెండో పెళ్ళి మీదకి తిప్పింది.

పార్వతికి అంతకుముందు తనకు రెండో పెళ్ళి సంబంధం అన్న ఆలోచన రాలేదు. ఎందు కంటే ఆమె పుట్టింటి వారు కూడా దాన్ని సూచన ప్రాయంగా అనలేదు. సంభవం అను అనుకోని దాని పట్ల ఆశ, ఆలోచన రాలేదు. ఈరోజు ఆ ప్రసక్తి వచ్చింది! దానికి ప్రతి చర్యగ పార్వతి ఆలోచనలో పడింది ఆమెకు మొదట వచ్చిన ఆలోచన తనకి రెండోపెళ్ళి అవసరమా, వాంఛితమా అని కాదు. ఆ ప్రశ్నలకి జవాబులు వయస్సులో ఉన్న ప్రతి విధవరాలికి అంతరాంతరాల్లో తెలుసు. అందుకనే ఆమెకి మొదట, తెలిసీ తెలియని, అర్థమయ్యీ కాని కలగబోయే ఇబ్బందుల గురించి బెంగ కలిగింది. తన చుట్టూ ఉండే జనం ఆడవారికి రెండోపెళ్ళి తప్పని, ఒప్పని అనేక సందర్భాలలో చెప్పుకొంటూ ఉండగా విన్న అభిప్రాయాల వలన కలిగిన గందర గోళ పరిస్థితి నుంచి భయం కలిగింది

"మొగుడితో కాపురంచేసి పిల్ల తల్లినైన నాకు రెండోపెళ్ళి అంటే వినేవాళ్ళు అన్నవాళ్ళ మూతి మీద వాత పెడ్తారు." అంది పార్వతి. అంతేగాని "నేను చేసుకోను" అనలేదు. అనసూయ అది గమనించింది పార్వతి తన నుంచి ధైర్యం పొందాలని చూస్తోంది. తను చెయ్యవలసినది, పార్వతి ఆమె నిర్ణయం తెలియ జెప్పేందుకు కావలసిన ధైర్యం ఇవ్వటం అని తెలుసుకొని,

"ఎందుకు పెడ్తారు వాత! ప్రపంచంలో వేలకొద్దీ మగవాళ్ళు రెండోపెళ్ళి చేసుకోవటం లేదా! ఈ సంఘమే వాళ్ళని చేసుకోమని ప్రోత్సహించడం లేదా! మనలో అంతమంది కాకపోయినా వీరేశలింగంగారి ధర్మమా అని ఈ రోజుల్లో వేలల్లో కాకపోయినా వందల్లో అయినా రెండోపెళ్ళి చేసుకొంటున్నారు కదా!"

"మీ అన్నయ్యగార్ని మర్చిపోవటం



సాధ్యమా ! కొన్ని సంవత్సరాలు కలసి కాపురం చేసిన జీవిత భాగస్వామిని మర్చిపోవటం నిజంగా సాధ్యమా ! మరొకరితో సర్దుకుపోతానేమోగాని అవసరానికి.''

''బావుంది వదినా ! మా ఆయనకి నేను రెండోభార్యను కానా ! ఆయన నాతో అవసరానికి సర్దుకుపోతున్నా రంటావా ! అల్లా అయితే నేను బ్రతకగలనా ! ఆయనకి నామీద ప్రేముంది అనురాగముంది. ఈ రోజున నేను ఆయనకి ఏకైక భార్యను మొదటి పెళ్లి గతం రెండో పెళ్ళి వర్తమానం గతం ఎంత గొప్పదైనా వర్తమానం అంత విలువైనది కాదు ''

''కాని బుజ్జిమాటో !''

'' బాబుకి నేను సవితితల్లిని కాదూ ! అల్లాగే నీ కొత్తభర్త బుజ్జికి సవతి తండ్రి అవుతాడు నేను బాబుని ప్రేమించినట్టే అతగాడు బుజ్జిని ప్రేమిస్తాడు బాబు నాకు చేరిక అయినట్టే బుజ్జి అతనికి చేరిక అవుతుంది''

''రెండూ ఒకటి కాదు''

''ఒకటే !''

''పోనీ అల్లాగే అనుకొన్నా అన్నీ సవ్యంగా ఉంటే కూడా ఆడపిల్లకి పెళ్ళి కావటం కష్టమౌతున్న ఈ రోజుల్లో, నన్ను విధవని సంతానవంతురాల్ని, కట్నంకానుకలు లేనిదాన్ని ఎవరు చేసుకొంటారు !'' అంది నిస్పృహ ధ్వనిస్తూ

''అల్లాంటి ఆదర్శపురుషుడు దొరికితేనే చేసుకొందువుగాని దొరకకపోతే మానేద్దువుగాని నువ్వెలాగూ మళ్ళీ పెళ్లిచేసుకొని తీరాలన్న ప్రయత్నంలో లేవుకదా ! నీకు పెద్దగా ఆశలేదు కనక నిరాశ ఉండదు ''

అనసూయ ఈ విషయం తల్లిదండ్రులతో ఎత్తినప్పుడు సీతమ్మ, ''అల్లాంటిది మనింట లేదు'' అంది మామూలు ధోరణిలో అంతేగాని పెద్దగా అభ్యంతరం చెప్పలేదు విధవా వివాహాలు కొత్తవిషయం కాదు కనుక చాలా ప్రిసిడెన్సు లున్నాయి కనుక

''ఆ పిల్లతెచ్చిన డబ్బు ఆమె పేరు మీద పెడ్తాను'' అన్నాడు జానకిరామయ్య

''నా స్నేహితుల్లో మంచివాడిని తెచ్చి చేస్తాను'' అన్నాడు నారాయణ ఉత్సాహంగా

* * *

పార్వతికి సంబంధాలు చూడటం మొదలు పెట్టాకగాని అది ఎంత కష్టమైన పనో నారాయణకి అర్థం కాలేదు. నెమ్మదిగా సిద్ధాంతరీత్యా ఆదర్శాలు వల్లెవేయటానికి, ఇతర్లు ముందుకు వస్తే మెచ్చుకోడానికీను, స్వంతంగా ఆచరించడానికి ధైర్యంగా ముందుకు రావటానికిగల తేడాలు తెలిసివచ్చాయి ఏడాది గిర్రున తిరిగినా నారాయణ ప్రయత్నాలు కలిసి రాలేదు పార్వతి మొదటినుంచి అది సంభవమని మనస్ఫూర్తిగా అనుకోకపోవడం వల్ల పెద్దగా

# నవశకం

నిరాశపొందలేదు కుంగిపోలేదు అందుకని సీతమ్మ తన కోడలికి మరో పెళ్లి చేసుకోవాలన్న కోరిక లేదని నిర్ధారణకి వచ్చింది

తన ప్రయత్నాలు వ్యర్థమౌతున్న కొద్దీ నారాయణకి పంతం పెరిగింది ఒక రోజున అనసూయ సుబ్బారావుని చేసుకొంటేలేని తప్పు తను పార్వతిని చేసుకొంటే ఏముంది అన్న ఆలోచన వచ్చింది అతను తన ఆలోచన స్నేహితుల్తో చెప్పినప్పుడు వాళ్లల్లో చాలామంది ఇబ్బందిగా ముఖాలు పెట్టారు ఒకరిద్దరు మెచ్చుకొన్నారు పార్వతికి భర్త పోయిన రెండున్నర సంవత్సరాలకి దీపావళికి మూడు రోజుల ముందు నారాయణ తండ్రికి తన అభిప్రాయం చెప్పాడు

* * *

నరకచతుర్దశి మర్నాడుదయం అనగా మధ్యాహ్నానికి అనసూయ, ఆమెభర్త సుబ్బారావు, నాలుగేళ్ల బాబు వచ్చారు

## ఎలక్ట్రానిక్ దిక్సూచి !

పశ్చిమ జర్మనీలో మత్తయకి అనే 19 సంవత్సరాల విద్యార్థి ఎలక్ట్రోనిక్ దిక్సూచిని తయారుచేశాడు జడత్వం లేకుండా, ఎటువంటి పొరపాట్లు దొర్ల కుండా పనిచేసే ఈ ఎలక్ట్రానిక్ దిక్సూచికి, యువ శాస్త్రవేత్తల కోసం నిర్వహింపబడే పోటీలలో ప్రథమ బహుమతి లభించింది ఇటీవల పశ్చిమ బెర్లిన్‌లో జరిగిన అంతర్జాతీయ రేడియో టెలివిజన్ ప్రదర్శనలో ఈ బహుమతిని బహూకరించారు విద్యార్థులలోని మేధశక్తిని ప్రోత్సహించి సద్వినియోగం అయ్యేలా చూడటానికి యేటేటా ఈ పోటీలను నిర్వహిస్తారు పలు యువ శాస్త్రవేత్తలు ఈ పోటీలద్వారా వెలుగులోకి వచ్చారు

''ఇంటికి పండుగ కళ వచ్చిందే నువ్వు వస్తే'' అంది కూతురితో సీతమ్మ

''మరి నేను వస్తేనో అండి ?'' అని సుబ్బారావు నవ్వుతూ అడిగాడు

''ఇంటికి అల్లుడు వస్తే సంతోషంతో పాటు ఏ గొంతెమ్మ కోర్కెలు కోర్తాడో అని మా భయం బావగారూ!'' అన్నాడు నారాయణ

''ఇంకా పాత అల్లుళ్లకి భయపడే వాళ్ళున్నారా ! నువ్వు రేపు పెళ్లాడె మీ మామ గారు కొద్ది రోజులు భయపడ్తారేమో ! ఇంతకు నీ పెళ్లెంతవరకు వచ్చింది ? మీ వాళ్లేమన్నా ప్రయత్నాలు చేస్తున్నారా ? నేను చెయ్యనా ? లేక నువ్వే చేసుకొంటున్నావా ? ప్రేమవివాహాలు చేసుకొన్న వాళ్లకి అత్తవారు మొండిచెయ్యి చూపిస్తారు జాగ్రత్త !'' అన్నాడు సుబ్బారావు

నారాయణ నవ్వి ఊరుకొన్నాడు జానకిరామయ్య ఇబ్బందిగా ముఖం పెట్టి మాట తప్పించాడు. అనసూయ దృష్టినుంచి తండ్రి అయిష్టత తప్పించుకోలేదు. నారాయణ ప్రేమలో పడ్డట్టున్నాడు, తల్లిదండ్రులు ఆమోదించినట్టు లేదు అనుకొంది. తరువాత నారాయణని ఒంటరిగా పట్టుకొని అడిగింది.

''నేను పార్వతిని పెళ్లి చేసుకొందామను కొంటున్నాను. ఆమె ఒప్పుకొంటే'' అన్నాడు నారాయణ వదిన అనకుండా మొదటిసారి పార్వతి అనటం అనసూయ గుర్తించింది

''అదెల్లారా ! మన సంస్కృతిలో వదిన పూజ్యురాలు కదా !'' అంది. అనసూయకి నారాయణ పార్వతిని చేసుకొంటాననడం ఎబ్బెట్టుగా అనిపించింది

''వదిన పూజ్యురాలే! కాదనను అక్క భర్త బావ పూజ్యుడు కాదా మరదలికి ?''

''కాకపోవడం ఏమిటి ?''

''మరి నువ్వు అక్క పోయిన ఏడాదిలోపలే బావగార్ని పెళ్లి చేసుకొన్నప్పుడు నీకు చేస్తున్న పని తప్పుగా అనిపించలేదా !''

''అనిపించలేదు అది లోకంమీద ఉన్నదే ! తల్లి అన్నదమ్ముడి కూతుర్ని మేనరికం పేరిట చేసుకొంటారుగాని అప్పచెల్లెలి కూతుర్ని పెళ్లి చేసుకోరుకదా ! అవటానికిద్దరు ఫస్ట్ కజిన్సే క్రాస్ కజిన్స్ మధ్య వివాహం ఒప్పిన మన సంఘం పేర లెక్, కజిన్స్ మధ్య ఒప్పదు.''

''మన హిందూమతం ఒప్పదు తురక మతం ఒప్పుతుంది నువ్వు చెప్తున్నది కండిషనింగ్‌కి సంబంధించింది వదిన మరో జన్మ వరకు వైధవ్యం అనుభవించాల్సిందేనా !''

అనసూయ జవాబు చెప్పలేదు నారాయణతో ఏకీభవించనులేదు. అక్కడ్నుంచి వెళ్లిపోయింది. నారాయణ ఉత్సాహం దమ్ముకొన్న మతాబులాగా రగులుకోక చల్లారిపోయింది

సాయంత్రం సుబ్బారావుతో నారాయణ వ్యాహాళికి వెళ్లినప్పుడు తన ఆలోచన అతన్తో చెప్పాడు నారాయణ

''మంచి పని చేస్తానంటున్నావు. నీకు నా సపోర్ట్ ఎప్పుడూ వుంటుంది'' అన్నాడు వాళ్ల పక్కనుంచి తారాజువ్వ ఆకాశంలోకి దూసుకుపోయింది నారాయణ ఉత్సాహంలాగా

''నన్ను ప్రోత్సహించిన అతి కొద్ది మందిలో మీరొకరు అందరు వ్యతిరేకించినవారే ! పార్వతి ఏమంటుందో! ఆమెని ఒప్పించే బాధ్యత మీదే!''

''తప్పకుండాను ! ఆ పనికి అనసూయను నియోగిస్తాను ''

''ముందు దాన్ని ఒప్పించాలి !''

''భర్త చెప్పినది భార్య, భార్య చెప్పినది భర్త ఒప్పుకొనే సమయాలు కొన్ని ఉంటాయి చెప్తాలే !'' అన్నాడు సుబ్బారావు చిరునవ్వుతో

ఆ రాత్రి అనసూయ తెల్ల చీర కట్టుకొని పూలపరిమళాలు పోగేసుకొని వచ్చింది. స్త్రీలకి పుట్టింట్లో కొత్త పెళ్లి కూతుళ్ల కళ వచ్చేస్తుంది అనుకున్నాడు సుబ్బారావు. గదిలోకి పెద్ద వెలుతురు రాగా తేరిపార చూడలేకపోయినట్టు కళ్లు మూసుకొని, "ఏమీ మెరుపు! ఏల నాకీ మైమరపు"

"చాల్లెండి బడాయిలు" అంది అనసూయ నవ్వుతూ.

"సుపుత్రుడేడి?"

"వదిన వాడిని బుజ్జితోపాటు తన దగ్గర పడుక్కోబెట్టుకొని అన్నగారికి సహాయపడింది."

"కాంతా! ఈ ఏకాంతం నావంతా!"

"ఈ తంతంతా మీకోసమే శృంగారవంతా!"

"అయితే లలామా! నా కౌగిలిలో కరిగిపో! కాలమా తరిగిపోకు" అనసూయ అతని కౌగిలిలో కరిగిపోయింది

"పాపం నారాయణ ఓ మంచిపని చెయ్యాలని ఉత్సాహపడ్తున్నాడోయ్! మనం కొంచెం సహాయం చెయ్యాలి" సుబ్బారావు నారాయణ విషయం ఎత్తాడు

"వదినా మరుదులు కాపురం ఎల్లా చేస్తారండి! అన్నయ్య స్మృతులు అడ్డురావా? నలుగురు నోట్లో గడిపెట్టరా?"

"మీ అక్కయ్య స్మృతులు మనకడ్డు వస్తున్నాయా! మనిద్దరం ఆమెను మర్చిపోయామా? లేదే! అల్లా అని మనిద్దరం సర్దుకుపోవడం లేదు. అదీ నిజమే! ఇదీ నిజమే! ఒకటి గతానికి సంబంధించింది మరొకటి వర్తమానానికి సంబంధించింది. ఇంక నలుగురు నోట్లో గడ్డిపెట్టడం విషయానికి వస్తే నలుగురి మాట ఎల్లా ఉన్నా ఇంట్లోవాళ్లు పెట్టే గడ్డి ఎక్కువై భరించలేకపోతున్నాడు."

"అమ్మ నాన్నగారు ఒప్పుకోరు నాకు తెలుసు"

"నిన్ను నాకిచ్చి పెళ్లి చెయ్యటానికి ముందరకి వచ్చిన వాళ్లే విషయంలో ఎందుకు సందేహిస్తున్నారో!"

"ఏమండీ! ఎన్నో సందర్భాలలో నారాయణ అన్నయ్యకి, వదినకి పాదాలు అంటి నమస్కారం చేసాడు పూర్వం. అటువంటి వదినతో నారాయణకి పెళ్లంటే ఏమిటోగా ఉంది నాకు."

"పాదాలంటి నమస్కారం చేసినవాళ్లతో కాపురం చెయ్యరాదని ఎక్కడలేదే! ప్రతి సినిమాలో భార్య భర్త పాదాలంటి నమస్కారం చేసే సీన్లుంటున్నాయికదా! సినిమాల్లో సగం నిజం ఉన్నా కొంతమంది భార్యలైన భర్తను దైవ సమానుడిగా భావిస్తూ, కూడా కాపురాలు చేస్తున్నారన్నమాటే! శృంగారం నడుపుతున్నారన్నమాటే! నువ్వు నా కాళ్లకి దండం ఎప్పుడూ పెట్టలేదనుకో! కాని వాళ్ల మాటేమిటి! కాళ్లకి దండం పెట్టారు కనక, 'మీకు నాకు దూరం' అనాలావాళ్లు, వాళ్ల భర్తల్తో? పూజ్యభావానికి కాపురం చెయ్యటానికి సంబంధం ఏమిటి? నారాయణ పార్వతి చెయ్యబోయేది కాపురం! రంకుకాదు."

"ఛీ! ఛీ! మరీ అల్లా మాట్లాడకండి."

"ఈ అభ్యంతరాలు చెప్పే వాళ్లందరికి ఆ రెండింటికి తేడా తెలియక అంటున్నారేమో అనిపించి అన్నాను."

"మా వదిన నారాయణని పెళ్లి చేసుకొంటే బుజ్జికి రేపు పెళ్లవుతుందా?"

"మహారాజులా! కాలం ఎప్పుడూ ఇలానే ఉండదు. పైగా మన సుపుత్రుడు ఉండనే ఉన్నాడు. అంతగావస్తే, మేనమావ పోలికవస్తే వాడూ ఓ ఆదర్శవాది అవుతాడు. నా భార్య వాడినంత సంకుచితంగా పెంచదు."

"చాల్లెండి పొగడ్తలు నన్నేం చెయ్యమంటారు?"

"మీ వదినకి నారాయణలో ఏమీ లోపం కనిపించకపోతే ఆమెను ఈ వివాహానికి ఒప్పించు"

"చిత్తం"

తెల్లారకుండా సీతమ్మ లేచి అందర్నీ నిద్ర లేపి తలకి నూనె పెట్టింది బుజ్జి చేత, బాబు చేత కాకరపువ్వొత్తులు కాల్పిస్తుంటే చీకట్లు విచ్చుకొన్నాయి

ఆరోజు వీలు చూసుకొని అనసూయ పార్వతికి నచ్చచెప్పింది.

"వదినా! అన్నయ్య పోయినప్పుడు నువ్వు చాలా బాధ పడ్డావు! ఇప్పటికీ పడుతున్నావు. అన్నయ్యను నువ్వు పూర్తిగా మర్చిపోలేవు అన్నయ్య లేని లోటు నీకు రకరకాల సమయాల్లో రకరకాలుగ తెలుస్తూనే ఉంటుంది అయితే ఏదో ఒక రకమైన వ్యాపకం పెట్టుకొంటే ఆ లోట్లను –గురించి ఆలోచిస్తూ మధనపడే సమయం తగ్గుతుంది కాని లోటు పూడదు లోటు చాలావరకు పూడాలంటే నువ్వు మళ్లీ పెళ్లి చేసుకోవడమే మార్గం."

"ఇదంతా మళ్లీ ఎందుకు చెప్తున్నావు అనసూయా! నేను సమ్మతించాను కదా! నన్ను చేసుకొనేందుకు ఎవరు ముందుకు రాలేదన్న విషయం నీకు తెలుసు కదా!" అంది పార్వతి.

"ఒకరు ముందుకు వచ్చారు. కాని నువ్వు ఒప్పుకోవేమోనని జడుస్తున్నాడు"

"ఎవరు అంత ధైర్యంగా ముందుకు రాలేని వ్యక్తి?" విధవను, అందులోను సంతానవతిని ధైర్యంగా వివాహం చేసుకోడానికి ముందుకు వస్తున్న వ్యక్తికి తనతో చెప్పడానికి అధైర్యమా! తనకి తెలిసిన వాళ్లే అయి ఉండాలి! అనుకొంది పార్వతి.

"చెప్తాను చెప్పేముందు నా మాటలు శ్రద్ధగావిని నిర్ణయం తీసుకో మనమంతా ప్రస్తుతంలో జీవిస్తాం గతం కలలా గుర్తుంటుంది నిన్నటికి ఈరోజు ముడిపడి ఉన్నా, చాలా దూరంగా అనిపిస్తుంది నిన్న గతించి పోయింది ఎంత ప్రయత్నం చేసినా అది తిరిగి రాదు. ఎంత కాదన్నా వర్తమానంలో బతకక తప్పదు అన్నయ్య బతికుండగా నేను నీకు ఆడబడుచుని, నారాయణ నీకు మరిది, మా అమ్మా నాన్నగార్లు నీకు అత్తమామలు మన మధ్య ఆ చుట్టరికాలు అన్నయ్యతో నీ వివాహం ద్వారా ఏర్పడ్డాయి అంతకు ముందు లేనివి. నిజానికి ఇవి అన్నయ్య పోవడంతో రద్దవాల్సినవి.



నువ్వు మా మరిదిని చేసుకొంటే మనిద్దరం తోటి కోడళ్ల మవుతాం."

"మీ మరిదా!" ఆశ్చర్యంగా అంది పార్వతి.

"కాదు నిజానికి ముందుకు వచ్చింది నీ మరిదే! నారాయణ వాడి ఒక్కడితోనే నీ సంబంధం మారుతుంది. మాతో చుట్టరికాలు పూర్వంలాగానే ఉంటాయి ఇదంతా నువ్వు ఒప్పుకొనే పక్షంలోనే!"

పార్వతి ఆ మాటలు విని బెదిరిపోయింది అనుకోని ఎదురుచూడని వార్త. తన భర్త స్థానంలో మరిది! నారాయణ మంచివాడే! ప్రయోజకుడే బుజ్జిని స్వంత కూతురిలాగా ఆదరించగలిగినవాడే! కాని తన మరిది!

"నా స్వంత మరిది నాకు భర్త!" అంది పార్వతి అసంభవమైన విషయంలా తోచి

"నువ్వు ఒప్పుకొంటే నారాయణ నీకు భర్త! పోయిన మా పెద్దన్నయ్య నీకు బావగారు నారాయణ నీ మరిది అనేది గతం అవుతుంది. వర్తమానంలో వాడు నీ భర్త అవుతాడు బుజ్జి గురించి కూడా ఆలోచించు దానికి తండ్రి లేని లోటు నువ్వు ఈ విధంగా తప్ప మరోలా తీర్చలేవు మా ఆయన నాకు ఒకప్పుడు బావగారు పూజ్యుడు తండ్రిలాంటి వాడు కాని అక్కయ్య పోయాక నాకు భర్త ఇప్పటికీ పూజ్యుడే ఆయనకి నన్ను ఇవ్వటం తప్పని మావాళ్లు ఆలోచించలేదు భార్య చెల్లెల్ని చేసుకోడమేమిటని ఆయన అనుకోలేదు నాకుకూడా ఆయన్ని చేసుకోడం అనుచితం అనిపించలేదు చుట్టాలు పక్కాలు తప్పనలేదు. అందరు ఆమోదించారు అక్క స్మృతుల నిద్దరం అనురాగంతో గుర్తు తెచ్చుకొని నెమరు వేసుకొంటాం చచ్చిపోయిన అక్కయ్యకు అన్యాయం చేస్తున్నామనే గిల్టీనెస్ లేకుండా అన్యోన్యంగా ఉంటున్నాం నువ్వు, నారాయణ ఎందుకు అల్లా ఉండలేరు? మీ కొత్త బాంధవ్యాన్ని సమాజం ఎందుకు ఎగతాళి చేస్తుంది? ఆలోచించుకో!"

పార్వతి ఆ రోజంతా ఆలోచించింది. ఆలోచించినకొద్దీ అనసూయ మాటల్లో అనుచితమైనది కనపడలేదు. పైవారి నెవర్నో చేసుకోడం, కొత్త ఇంట్లో తిరిగి ఎడ్జస్ట్ అవటంకంటే ఇది ఎన్నోవిధాల నయం వాంఛనీయం! బుజ్జి భవిష్యత్తు అంధకారంగా ఉండరాదని తను కోరుకుంటే తను ప్రయత్నించి దీపం వెలిగించాలి! తనకోసం అందరు పెద్ద మనసుతో ఆలోచిస్తుంటే తనేనా తనగురించి తపించనిది తన మంచికి తనుకూడా ప్రయత్నించాలి. విధికి వదిలేసి నిర్లిప్తంగా ఉండరాదు

అనసూయ చీకట్లు పడేవేళ దీపాలు వెలిగిస్తుంటే పార్వతి సాయం చేసింది

# నవశకం

సుబ్బారావు వింటుండగా, నారాయణతో ధైర్యంగా, "నా కిష్టమే!" అంది కృతనిశ్చయురాలై దీపాల వెలుగులో ఆమె కళ్లు మిలమిల లాడాయి.

దీపావళినాడు మధ్యాహ్నం భోజనాలయ్యాక సుబ్బారావు పిల్లల్తో వీధిలో బాంబు పేల్చాడు. అనసూయ ఇంట్లో పెద్దలవద్ద పేల్చింది పార్వతి కూడా అంగీకరించిందని తెలిసేసరికి సీతమ్మకి దడ పుట్టుకువచ్చింది ఇంట్లో పిల్లలు సమర్థిస్తున్నా వీధిలో తోటివాళ్లు చెవులు కొరుక్కుంటారన్న భయం పోలేదు.

జానకిరామయ్యను బయల్దేరదీసి రిక్షాలో సీతమ్మ రామాలయం చేరింది

ఇంటి పురోహితుడు దంపతులను చూసి, "రండి! పనిబడి వచ్చినట్టున్నారు" అంటూ ధ్వజస్తంభానికి పక్కగా ఉన్న అరుగుమీదకి తీసుకువెళ్లి కూర్చోబెట్టాడు సీతమ్మ తమకి వచ్చిన సమస్య చెప్పింది.

"అమ్మా! మీరు నానుంచి ఏమాశించి వచ్చారో తెలియదు నాకుతోచిన ధర్మం చెప్తాను మీకు నచ్చకపోవచ్చును"

## కడలి

రాజకీయ నాయకులతో
భుజం కలుపు మిత్రుడివా?
కడుపులోన బడబవహ్ని
మోమున నవ్వుల నురుగులు

అర్థంలేనట్టి ఘోష —
అన్యుల చడి వినవివ్వవు
నిరంతరం పొంగి పొంగి
స్వార్థపు తీరం దాటవు

విశ్వశ్రేయో రత్నా
లున్నాయని వినుటెగాని
లభించేది నీ లోపల
నత్తగుల్లలూ గవ్వలు!

చుట్టపు నదులనేగాని
ఇతర మేది చొరనివ్వవు
అధికారపు విన్యాసం
తరగలలో చూపెడతావ్!

దివ్యధునులు, మధుర నదులు
నిన్ను చెరినంతటనే
మాధుర్యం కోలుపోయి
అడవిగాచు వెన్నెలలగు!!

—లతిక

"అప్రియమైనా కర్తవ్యం చెప్పండి" అన్నాడు జానకిరామయ్య

"శుభం భూయాత్! ప్రతి సమాజం అవసరాల మేరకి న్యాయాలను, నీతుల్ని ఏర్పరచుకొంటుంది. ఇవికాలంతో క్రమేపి మారుతూ వస్తాయి. ఈనాటి మన ఆచారాలు ఆలోచనలు ముందుతరం వారి వాటికి చాలా దగ్గరగాను కొద్దిగా భిన్నంగాను ఉంటాయి మరీ ముందుతరంవారి ఆలోచన్లతో బాగా భేదిస్తాయి. ఆ ఆచారాలు మనకి అనుసరణీయంగా కూడా ఉంటాయి ఉదాహరణకి కుంతి సంతానం పొందిన విధానం, దేవరన్యాయం అనుసరించి వ్యాసుడు చేసిన కురువంశ సృష్టి మనకానాడు వెలపరం పుట్టించేవిగా ఉంటాయి ఆనాటి అవసరాలకి అవి ఏర్పడ్డాయి ఆ అవసరాలు పోయి కొత్త అవసరాలు క్రమేపి ఏర్పడగానే పాతవి అంతరించిపోయి కొత్తవి ఏర్పడ్డాయి బానిసలమీద ఆధారపడ్డ నాగరితలు విదేశాల్లో ఏర్పడితే విధవల శ్రమమీద మన నాగరికత విలసిల్లింది ఒక మనిషిని వేరొక మనిషి దోచడం సాగనీయక పోవటానికి మనరోజుల్లో ప్రయత్నాలు జరుగుతున్నాయి సమాజం వేగంగా కొత్తరూపులు దిద్దుకొంటోంది మీ నారాయణ నిర్ణయం ఈ కాలానికి చెందింది మనముందు కాలధర్మానికి వ్యతిరేకమైనా భారత కాల ధర్మానికి దగ్గరిది తప్పొప్పుల నిర్ణయం చెయ్యగల శక్తి నాకులేదు కాని ఈ కాలంలో జీవించవలసిన నవతరం వాళ్ల అవసరాలకి తగిన నిర్ణయాలు తీసుకొంటారు మనకవి ఆమోదయోగ్యం కాకపోయినా, మనం ఆటంకపరచరాదు"

"ఇటువంటి సాంప్రదాయాన్ని నెలకొల్పితే, ఒకే ఇంట్లో తిరిగే వదినా మరదుల మధ్య, బావా మరదళ్ళ మధ్య అనుచితమైన సంబంధాలు ఏర్పడవంటారా?" అని అడిగాడు జానకిరామయ్య

"అవకాశం ఒక్కటే మనిషిని చెడుమార్గం పట్టించదు. మనిషికి వ్యక్తిగతంగా కొంత చెడు ప్రకృతి కూడా ఉండాలి కోడల్ని కోరిన మావగార్లు, మరిదితో సంబంధం పెట్టుకొన్న వదినగార్లు పూర్వం లేదా ఇప్పుడు లేరా! వ్యభిచారం వివాహేతర సంబంధం అవటం వల్ల మొదటిది ఉన్నంతకాలం రెండోది ఉంటుంది మీ అబ్బాయికి, కోడలికి నేను వివాహం జరిపిస్తాను మీరు సరేనంటే" అన్నాడు పురోహితుడు

సీతమ్మ, జానకిరామయ్యలు సమాధాన పడ్డారు.

ఇంటి గోడలమీద బారులుగా దీపాలు వెలిగాయి. ఇంటి కోడలి కళ్లు కాంతులీనాయి నవశకానికి బాణసంచాలు స్వాగతం పలికాయి ★

# ఆనాడూ ఈ నాడూ కొందరి చర్మ సౌందర్యం ఒక్కటే!






పియర్స్—అసలైన గ్లిసరిన్ సబ్బు

మీ చర్మానికి ఆ మృదువైన సంరక్షణ ఇవ్వండి— పియర్స్‌తో. సబ్బు తయారు చెయ్యడంలో ఓ శతాబ్దపు అనుభవం స్ఫటికం లాంటి ఆ ప్రతి సబ్బు బిళ్ళలోనూ ఇమిడి వుంది. పియర్స్ ఎంతో సున్నితమైనది. మరెంతో శుద్ధమైనది— దానిలోంచి మీరు చూడగలంతగా!

**పియర్స్ మీ చర్మాన్ని యవ్వనంగా, సుకుమారంగా ఉంచుతుంది.**

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS-57 (R) 2317 T!

# వ్యక్తిగతం



పేరు : "డెవిల్స్ బాగ్" (సైతాను సంచీ అని అర్థమా?) తండ్రి పేరు : "హాలో", వయసు: 2 సంవత్సరాలు, జన్మ స్థలం : అ. సం. రా. లోని మేరీలాండ్ రాష్ట్రంలోఉన్న 'విండ్‌ఫీల్డ్స్ ఫారమ్' అనే చోటు, వెల : దాదాపు 35 కోట్ల రూపాయలు, $1\frac{1}{6}$ మైలుని $102\frac{1}{5}$ సెకండ్లలో పరిగెత్తగలిగింది, మగ గుర్రంగా ఒకసారి ఆడ గుర్రం వద్దకి పంపినందుకు డెవిల్స్‌బాగ్ యజమానులు ఒక కోటి రూపాయలు పుచ్చుకుంటారుట. జాతి : రేసు గుర్రం.



వర్ణ చిత్రకారుడు జోవాన్ మీరో 90 ఏళ్ల వయసులో స్పెయిన్ ప్రాంతపు మల్లోర్కా ద్వీపంలో మరణించారు. ఆయన ఆధునిక చిత్రకారులలో అగ్ర శ్రేణికి చెందినవారుగా పరిగణించబడు తున్నారు. "మీరో" అంటే స్పెయిన్ భాషలో 'చూశాను' అని అర్థంట. ఆయన [illegible] గారు...

ఒకప్పుడు అమెరికా అధ్యక్షుడు జాన్ ఎఫ్. కెన్నెడీ భార్యగా ఉండి, ఆ తరువాత గ్రీసు వాణిజ్య వేత్త ఒనాసిస్‌ని వివాహం చేసుకున్న జాక్వెలిన్ [illegible] చిన్నప్పుడు తీసిన చిత్రం...



పశ్చిమ జర్మనీ అధ్యక్షుడు కార్ల్ కార్‌స్టెన్స్ సతీమణి డాక్టర్ వెరోనికాకి హోమియోపతి మీదా, మూలికల మీదా బాగా నమ్మకం ఉందిట. వీటి అభివృద్ధికోసం ఆమె తమ భర్తతో కలిసి ఒక సంస్థని నెలకొల్పారు...

# వారఫలం

10-2-1984 శుక్రవారం మొదలు 16-2-1984 గురువారం వరకు

♈ మేషం: ఉద్యోగ వృత్తులందు అత్యంత శుభ ఫలాలను పొందనున్నారు. వ్యాపార విస్తరణ కార్యక్రమ మందు చాల మంది నిమగ్నులై అనుకూలత సాధించుకో గలుగుతారు. స్త్రీలకు:అనుకోకుండా దూర ప్రాంతాలకు పోనున్నారు. వృత్తిలో ప్రగతి ఆశింప వచ్చు.

♉ వృషభం: గ్రహ చారం మీకు అనుకూలం. వ్యవహారం సుముఖంగా పరిణమించగలదు. ఉత్తర ప్రత్యుత్తరాల మూలంగా వివిధ విషయాలు గ్రహింప గలరు. కొందరు ప్రయాణాల మూలంగా ధనలబ్ధిని పొంద గలరు. స్త్రీలకు: ఉద్యోగ యత్నాలు ఫలించటం వృత్తిలో గణనీయమైన అభివృద్ధి సంపాదించటం చెప్పదగిన అంశం.

♊ మిథునం: ఒకానొక గృహ సంబంధ వ్యవహారంలో మీకు అనుకూలత సంభవం. చాల కాలంగా యితరుల చేత చిక్కిన ధనం అందటం, అవసరాలు తీరిపోవటం, వృత్తియందు పెంపు చెప్ప వగిన వారం. స్త్రీలకు: నగలు చేయించుకొనటం, నూతన వస్త్రాలు సేకరించు కొనుటకు అవకాశం గలదు. ఉద్యోగ రీత్యా ఆశించిన అభివృద్ధి సంభవం.

♋ కర్కాటకం: ఉద్యోగ రీత్యా ఉన్నతాధికారులు దూర ప్రాంతాలకు ప్రయాణం చేయనున్నారు. స్థిరాస్తిని గూర్చిన ప్రశ్నలేవో చెలరేగ నున్నాయి. ఒక వేళ అలాంటివి, అశాంతికి దారితీయవచ్చు. స్త్రీలకు: సాహితీ రంగాన అనుభవం గల వారికి లాభదాయక మన వచ్చు.

♌ సింహం: గ్రహానుకూలత గలవారం, 'శని, గురు' గ్రహాల మూలాన మేలు చేకూరుట సిద్ధం. ధనలబ్ధికి అవకాశ మున్నది. చాల కాలంగా 'తనఖా' పడిన ద్రవ్యం చేతికి అందుతుంది. స్త్రీలకు: వ్యవహార రంగాన ప్రసిద్ధి ఏర్పడుటకు సన్నివేశాలు ఏర్పడుతాయి. శుభ ప్రస్తావనల రీత్యా ప్రయాణాలు కొందర విషయంలో చెప్పవచ్చు.

♍ కన్య: అధికారుల వలన జరుగ వలసిన పనులున్నా, రాజకీయంగా మేలు చేకూరవలెనన్నా, గృహ సంబంధంగా సర్వానుకూలత చేకూర వలెనన్నా ఈవారం ఉత్తమమే. నూతనాంశాలు గ్రహించటం, నూతన మిత్రులతో సంభాషించుటకు అనుకైన వారం. స్త్రీలకు: ఉద్యోగ రీత్యా ఆశించిన అవకాశాలు, సమకూడ గలవు. గ్రహించి శ్రమించండి.

♎ తుల: మీరు నిష్ఠాపరులు, అతిగా ఆచార వ్యవహారాలందు నిమగ్నులై యిబ్బందులు కొని తెచ్చికోకండి. వ్యవహార రీత్యా మీకు మేలు చేకూర గల వారం. స్త్రీలకు: ఉన్నత పదవు లందునున్న వారికి అత్యుత్తమ కాలం, ధన లబ్ధికి అవకాశం లేకపోలేదు, గ్రహించండి.

♏ వృశ్చికం: నూతనాంశాలు గ్రహిస్తారు. నూతన గృహ నిర్మాణ కార్యక్రమం చేపట్టుటకు అవకాశం ఉంటుంది. గృహ సంబంధంగా ఉపకరించే వస్తువులు కొనుగోలు చేయుటకు అవకాశం గల వారం. స్త్రీలకు: బంధు రీత్యా ఘర్షణకు అవకాశముండ వచ్చు. ఓర్మి ఎంతైనా అవసరం. ధనలబ్ధికి అవకాశ మున్నది.

♐ ధనుస్సు: నూతనాంశాలు గ్రహించటం, నూతన మిత్రులను కలిసికోవటం కూడా సంభవం. వ్యాపార రీత్యా కొందరు దూర ప్రాంతాలకు ప్రయాణం చేయటం కూడా సంభవమే. అలాంటిది లాభదాయకమని గ్రహించాలి. స్త్రీలకు: విందు వినోదాలకు, సభా కార్యక్రమ మందు పాల్గొనుటకు కొందరకు అవకాశ మున్నది.

♑ మకరం: ఆదాయ మున్నది. అవసరాలు తీరిపోతాయి. ఋణ దాతల వత్తిడి కూడా తప్పించుకో గలరు. నూతనాంశాలు గ్రహించుటకు అవకాశం సమకూడుతుంది. రాజకీయంగా చాల మందికి అనుకూల వారం. స్త్రీలకు: శుభకార్య ప్రస్తావనలు, వస్తు సేకరణకు అవకాశం ఉంటుంది.

♒ కుంభం: ఉత్తములతో స్నేహం ఏర్పడే అవకాశ మున్నది. ధన లబ్ధికి అవకాశం, వస్తు సేకరణకు అవకాశం లభ్యం. ముఖ్య బంధువులో, మిత్రులో యింటికి రా గలరు. గ్రామంలో పెద్దరికం కొందరకు ఏర్పడే అవకాశమున్నది. స్త్రీలకు: అవసరాలకు తగినంత ధనం అందుతుంది.

♓ మీనం: సులభంగా ఒకానొక విషయం నెరవేరగల వారం. దూర బంధువులు యింటికి రానున్నారు. అవకాశ వాదులను దరి జేర్చకండి. వాహనం కొరకు చేసిన యత్నం సానుకూలం కాగలదు. స్త్రీలకు: ఉద్యోగంలో ఆశించిన 'ప్రమోషన్' లభించ వచ్చు. అను కోని రీత్యా బదలీ కొందర విషయంలో చెప్పదగిన అంశం, గ్రహించండి.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి




ఒజెట్ సూపర్ డీలక్స్ పళ్ళకీ, చిగుళ్ళకీ పూర్తిగా పనికొచ్చే బ్రష్

# సినిమా విశేషాలు



-జి.వి.జి.

## శోభన్‌బాబు హీరోగా లక్ష్మీచిత్ర హరికృష్ణ నిర్మించే చిత్రం

బహుముఖ ప్రశంసలందుకున్న 'మాస' హిందీ చిత్రాన్ని లక్ష్మీచిత్ర హరికృష్ణ తెలుగులో నిర్మిస్తారు. శోభన్‌బాబు హీరో. "... నుంచి షూటింగ్ ఉంటుంది" అన్నారు డైరెక్టరు ఎ. కోదండరామిరెడ్డి.

## మోహన్‌బాబు హీరోగా జనార్ధన్ దర్శకత్వంలో శ్వేతచిత్ర ఇంటర్నేషనల్ వారి చిత్రం

"మోహన్‌బాబు సరసన రాధిక తొలిసారిగా నటిస్తోంది," అన్నారు జనార్దన్. ఆయన దర్శకత్వం నెరపే ఈ సంస్థ చిత్రం మొదటి షెడ్యూల్ జనవరి 1 నుంచి 15 వరకు జరిగింది. నారాయణరావు, రాజ్యలక్ష్మి, శుభలేఖ సుధాకర్, గొల్లపూడి మారుతీరావు, గిరిబాబు, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, పల్లె వేలు, నేవీ రవి, విచిత్రకుమార్, భాస్కరరెడ్డి, కిశోర్, అనూరాధ ప్రభృత నటవర్గం కొంపెల్ల విశ్వం మూలకథకు జనార్ధన్, సత్యమూర్తి సినిమా స్క్రిప్టు తయారుచేశారు. సత్యమూర్తి సంభాషణకర్త. కృష్ణ-చక్ర స్వరకల్పనలో గోపి, జ్యోతిర్మయి, గీతాలు రాశారు. ఎ.డి. ఓంప్రకాశ్ సహ నిర్మాత. డి.డి. ప్రసాద్ ఛాయ, బాలు శిల్పం, గౌతమ్‌రాజు కూర్పు, మల్లిబాబు సహకార దర్శకత్వంతో ఈ చిత్రాన్ని నిర్మిస్తున్న కె. శివశంకర్ "మలి షెడ్యూల్ ఫిబ్రవరి 1 నుంచి 15 వరకు జరుగుతుంది," అన్నారు.



'ఇకనైనా మారండి'లో మురళీమోహన్, జ్యోతి



రాధ, చిరంజీవి 'గూండా'లో

## నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

శంకర చిత్రాలయ "పాముల సరసయ్య", గీత ఆర్ట్ పిక్చర్స్ "అక్కా చెల్లెళ్ళ సవాల్," నర్మద ఆర్ట్ క్రియేషన్స్ "తొలి చూపు", శ్రీ విజయ సారథి ఆర్ట్ పిక్చర్స్ "కౌగిట్లో కృష్ణమ్మ", వర్మ ప్రొడక్షన్స్ 'అపూర్వ సహోదరులు", విజయభేరీ మూవీస్ "ఘరానా రౌడీ", శ్రీకాంత్ పిక్చర్స్ "హడల్", శివ చిత్ర మూవీస్ "ఇద్దరు మోసగాళ్ళు", లావణ్య ఆర్ట్స్ "మాయదారి మొగుడు", శ్రీ వెంకట దుర్గా ఇంటర్నేషన్ 'నగరంలో నాలుగిళ్ళు", జయలక్ష్మి ఆర్ట్ ప్రొడక్షన్స్ "రేచుక్క", రోజా మూవీ ఆర్ట్స్ "శ్రీహరి పెళ్ళి", గోపీ కృష్ణా కంబైన్స్ 'పంచపాండవులు", ఈతరం పిక్చర్స్ "దేశంలో దొంగలు పడ్డారు', శ్రీకర్ ప్రొడక్షన్స్ "ఇల్లాలు-ప్రియురాలు", దిగ్విజయ క్రియేషన్స్ "జయం మనదే", సత్య చిత్ర "వద్దంటే డబ్బు", శ్రీ అయ్యప్పస్వామి కళా మందిర్ "గంగ – గౌరి", విజయదుర్గ ఫిలిమ్స్ ఆర్ట్స్ "జ్యోతి-చిత్ర", హనుమాన్ ఆర్ట్ పిక్చర్స్ "కొత్త మలుపు", యూని పిక్చర్స్ "కొత్త పెళ్ళికూతురు", హేమబాల కంబైన్స్ "రాయిలాంటి ఆడది", శ్వేత చిత్ర ఇంటర్నేషనల్ "సమరం", విజయదుర్గ ఫిలిమ్స్ ఆర్ట్స్ "స్వతంత్రం కావాలి"

## శ్రీదేవి, కె ఆర్ విజయ, అంబికలతో "గౌరీదేవి మహిమలు"

'పౌరాణిక, భక్తిరస ప్రధాన చిత్రాలను రూపొందించడంలో సిద్ధహస్తుడనిపించుకున్న కె ఎస్ గోపాలకృష్ణన్ దర్శకత్వ ప్రతిభకు మరో తార్కాణం ఈ చిత్రం,'' అన్నారు కె కె మూవీస్ అధినేత కరాటం కృష్ణమూర్తి ఈయన నిర్మించే '' గౌరీదేవి మహిమలు '' చిత్రంలో శ్రీదేవి, కె ఆర్ విజయ, అంబిక, మనోరమ, ఎస్ వరలక్ష్మి, మేజర్ సుందరరాజన్, రాజేష్, తేంగాయ్ శ్రీనివాసన్, త్యాగరాజన్ పాత్రధారులు వీటూరి మాటలు, పాటలు రాశారు ఎం ఎస్ విశ్వనాథం సంగీత దర్శకుడు రవికాంత్ నగాయిచ్ ఛాయాగ్రాహకుడు చిరదా వెంకటేశ్వరరావు, పట్టినపు సూరిబాబు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు ''ఫిబ్రవరికి విడుదల చేయాలనుకుంటున్నాం,'' అన్నారు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ కపిల నాగేశ్వరరావు

## ప్రోగ్రెసివ్ ప్రొడక్షన్స్

''యాక్షన్, సస్పెన్స్ చిత్రం,'' అన్నారు ఆ సంస్థ అధినేత వి భాస్కరరెడ్డి ఈయన నిర్మించే చిత్రానికి ఫిబ్రవరి, మార్చి నెలల్లో షూటింగ్ పూర్తవుతుంది సమన్, సుమలత, రంగనాథ్, ప్రభాకరరెడ్డి, రాళ్ళపల్లి, అన్నపూర్ణ, జయమాలిని వగైరా తారాగణం కృష్ణ — చక్ర సంగీతం, తోట శిల్పం, కె గోపాలరెడ్డి కూర్పు, సలీం నృత్యాలు, పి శివారెడ్డి సహ దర్శకత్వంతో సి రామచంద్ర రావు తొలిసారిగా కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు



సాయిచంద్, రోహిణి 'ఎందుకీ ఆడబ్రతుకు'లో



'ప్రేమ ప్రేమ ప్రేమ'లో జ్యోతి

## "మహా నగరంలో మాయగాడు"

''బాక్సాఫీస్ లంశాలన్నీ సమపాళ్ళలో మేళవించిన చిత్రం,'' అన్నారు విజయబాపినీడు ఈయన కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వం వహించే శ్యాంప్రసాద్ ఆర్ట్స్ వారి ''మహా నగరంలో మాయగాడు'' చిత్రం షూటింగ్ జనవరి 1న మొదలైంది చిరంజీవి, విజయశాంతి, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, నూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య, సంగీత, నిర్మల, స్మిత వగైరా తారాగణం కాశీ విశ్వనాథ్ సంభాషణలు, రఘు ఛాయ, కళాధర్ శిల్పం, కె సత్యం కూర్పు, కోటేశ్వరరావు — సాయి సహకార దర్శకత్వంతో ఈ చిత్రాన్ని నిర్మించే మాగంటి రవీంద్రనాద చౌదరి ''ఫిబ్రవరి 6 నుంచి 16, మార్చి 5 నుంచి 15 వరకు మిగతా షెడ్యూల్స్ జరుగుతాయి,'' అని తెలియజేశారు

## జయసుధ చిత్రాలు

''రాణీ మాలినీదేవి, బొబ్బిలి బ్రహ్మన్న, పులిజూదం, దానవుడు, బంగారు కాపురం'' చిత్రాలలో పాల్గొంటున్న జయసుధ — బాలయ్య దర్శకత్వంలో అమృతా ఫిలిమ్స్ చిత్రం, దాసరి దర్శకత్వంలో రాధాకృష్ణా మూవీస్ చిత్రం, విజయబాపినీడు దర్శకత్వంలో శ్రీనివాస ఫిలిమ్స్ చిత్రం, ఎం ఎస్ రెడ్డి నిర్మించే ''ప్రళయం'', టి కృష్ణ దర్శకత్వం వహించే చిత్రం, కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో బాబా ఆర్ట్స్ చిత్రం, ప్రభాకరరెడ్డి ఆధ్వర్యంలో తయారయ్యే చిత్రం, రవి చిత్ర ఫిలిమ్స్ వారి కొత్త చిత్రంతోపాటు మరో నాలుగు కొత్త చిత్రాలలో నటించబోతున్నారు

జయమాలిని, చంద్రమోహన్ 'ఇంటి గుట్టు'లో





అరుణ 'శ్రీవారికి ప్రేమలేఖ'

## "దానవుడు"లో రచయితల ద్వయం

పోలీస్ స్టేషన్... ఇన్‌స్పెక్టర్ (అరుణ్ కుమార్) ఏదో రాసుకుంటున్నాడు. పక్కనున్న సెల్‌లో మోడీ మస్తాన్ (గొల్లపూడి మారుతీరావు), తన శిష్యుడు (కాశీ విశ్వనాథ్)కి కనుసైగ చేసి, ఒకసారి గొంతు సవరించుకుని, "ధర్మరాజులాంటి ఇనస్పెక్టరు ఏం రాస్తున్నారు?" అన్నాడు.

"మనల్ని వదిలేడానికి ఆర్డరు కాగితం రాస్తున్నారు," అన్నాడు శిష్యుడు.

"నీకెలా తెలుసు?"

"తాళీజ మహిమ." శిష్యుడు డోలు వాయించాడు.

ఇన్‌స్పెక్టరు చిరాగ్గా లేచి, "షట్టప్, రాస్కెల్స్! రోడ్డుమీద న్యూసెన్స్ చేస్తున్నారని లాకప్‌లో వేస్తే, ఇక్కడ కూడా న్యూసెన్స్ చేస్తున్నారా? మళ్లీ మీరు నోరెత్తారంటే, మక్కెలిరగ్గొడతాను తెలుసా?" అన్నాడు.

మోడీ మస్తాన్ తన ధోరణిలో తాను "మక్కెలిరగ్గొట్టం తర్వాత మనకి అయ్యగారేం పెడతారు?" అన్నాడు.

"మటన్ పులావ్ పెడతారు," అన్నాడు శిష్యుడు.

ఒక కానిస్టేబుల్ వాళ్ళ సెల్ దగ్గరికి వచ్చి, "మీరు చేస్తున్న న్యూసెన్స్‌కి మటన్ పులావ్ కావాల్రా? లాఠీతో వాయించేస్తాను తెలుసా?" అన్నాడు.

మోడీ మస్తాన్ "పోలీసుగారు ఎందుకు చిరచిరలాడిపోతున్నారు?" అన్నాడు.

"రెండు నెమిలీన్‌ని ఈదలేక చిరచిరలాడిపోతున్నారు," అన్నాడు శిష్యుడు.

"అయ్యగారి ఆనందం కోసం డోలు కొట్టు!"

శిష్యుడు డోలు వాయిస్తూండగా భీముడు (సురేష్), శాంతి (సంతోషిని) వచ్చారు. మస్తాన్ని, శిష్యుడ్ని అరెస్టు చేయడం అన్యాయమని శాంతి వాదించింది.

"జ్యోతి అమ్మలు ఇన్‌స్పెక్టర్‌గారితో ఏం మాట్లాడుతోంది?" అన్నాడు మస్తాన్.

"మనదేం తప్పులేదని బల్లగుద్ది వాదిస్తున్నాది," అన్నాడు శిష్యుడు.

"కమ్మమని లేచే ఇనస్పెక్టరుగారు కళ్ళార్పకుండా ఎందుకలా చూస్తున్నారు? ఛీ–వెధవా! గుండెకాయలో ప్రేముంటే... కంటిపాపలో అది చంటిపాపలాగ ఆడుకుంటాది. తెలుగు సినిమాలో చూడ్డంవల్ల తెలిసిందిరా."

మరో పోలీసు లాఠీని గాలిలో తిప్పుతూ, "నోరుముయ్యండ్రా నా కొడకల్లారా!" అన్నాడు.

మస్తాన్ నిర్లక్ష్యంగా "ఈ పోలీసుగారు ఎందుకిలా చిటపటలాడుతున్నారు?" అన్నాడు.

వెంటనే శిష్యుడు అందుకున్నాడు: "ఈ పెర్సనాలిటీని ఎవరూ ప్రేమించకపోవడంచేత."

"చిటపటలాడిపోయే పోలీసుగారి పేరు చెప్పి డోలుకొట్టు!"

డోలు శబ్దాన్ని భరించలేక ఆ పోలీసు వడివడిగా ఇన్‌స్పెక్టర్ దగ్గరికి వెళ్లి, "సార్, మీకు దండం పెడతాను, సార్! అళ్ళిద్దర్నీ వదిలెయ్యండి, సార్! అళ్ళిద్దర్ని ఇక్కడుంచితే, నా జాతకం తిరగేసి – జాతర చేసేస్తున్నారు. దయచేసి వదిలెయ్యండి, సార్!" అంటూ దాదాపు ప్రాధేయపడ్డాడు.

ఇన్‌స్పెక్టర్ నెత్తి బాదుకుని, దీర్ఘాలోచనలో మునిగిపోయాడు.

ఎ.పోతరాజు ఆధ్వర్యంలో ఎ. శ్రీనివాసరావు, ఎ. లక్ష్మణరావు నిర్మాతలుగా ఎ. రాజప్రసాద్ నిర్వహణలో తయారయ్యే సంతోష్ ఆర్ట్ మూవీస్ "దానవుడు" చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: కోడి రామకృష్ణ.



"డూప్ లేకుండా నటించకండీ అంటే వినరు కదా!"



'ప్రళయ సింహం'లో సుమన్, సుమలత

# సినిమా

## రాజనాల ఆర్ట్ థియేటర్స్‌వారి రెండు చిత్రాలు

"ముందుగా రెండు చిత్రాలను ప్లాన్ చేశాం. 'వెంకన్న దయ' చిత్రానికి ప్రముఖ పాత్రికేయుడు, రచయిత కృష్ణమోహన్ దర్శకుడు. 'కల్యాణ ఘడియలు' చిత్రానికి పి. సత్యనారాయణ దర్శకుడు. ఉపర్వంలో 80 శాతం కొత్తవారు, 20 శాతం పాతవారు ఉంటారు. జనవరి 15 నుండి ఫిబ్రవరి నెలాఖరు వరకు గూడూరు పరిసరాలలో షూటింగ్ జరుగుతుంది," అన్నారు ప్రముఖ కేరెక్టర్ ఆక్టర్ రాజనాల. ఆయన నిర్మాణ సారథ్యంలో ఆర్. బి. దేవి నిర్మాతగా ఈ రెండు చిత్రాలూ తయారవుతాయి. "వెంకన్న దయ" చిత్రానికి రాజనాల కథకుడు. సత్యం స్వరకల్పనలో విద్వాన్ కణ్వశ్రీ, ఆచార్య ఆత్రేయ, వేటూరి గీతాలు రాశారు. జి. కె. రాము ఛాయాగ్రాహకుడు. స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం కృష్ణమోహన్. "కల్యాణ ఘడియలు" చిత్రానికి లక్ష్మీకిరణ్ సంగీత దర్శకుడు. పి. సత్యనారాయణ దర్శకుడు.

'ఈ చదువులు మాకొద్దు'లో గీత





'వద్దంటే పెళ్లి'లో ఊర్వశి, భాగ్యరాజ్

## సినిమా

### ఎ ఎన్ ఆర్. హీరోగా కోడి రామకృష్ణ దర్శకత్వంలో చెరుకూరి ప్రకాశరావు చిత్రం

"మొదటి షెడ్యూల్ జనవరి 2 నుంచి 20 వరకు జరిగింది నాలుగు పాటలు, కొన్ని సన్నివేశాలు చిత్రీకరించాం రెండవ షెడ్యూల్ ఫిబ్రవరి 1 నుంచి 15 వరకు జరుగుతుంది," అన్నారు కోడి రామకృష్ణ ఈయన కథ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సిహెచ్ ప్రకాశరావు నిర్మించే మహిజా ఫిలిమ్స్‌వారి చిత్రంలో ఎ ఎన్ ఆర్, రాధ, గీత, జగ్గయ్య, గొల్లపూడి మారుతీరావు, నూతన్‌ప్రసాద్, కాంతారావు, పి ఎల్ నారాయణ, అంజలీదేవి, అత్తిలి లక్ష్మి ప్రధాన భూమికలు నిర్వహిస్తున్నారు ఆత్రేయ మాటలు, పాటలు రాశారు ఎస్ రాజేశ్వరరావు సంగీతం, శివకాంత్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, వేమూరి రవి కూర్పు, ఎ పి స్వామి నిర్వహణ, ఎస్ సురేష్‌కుమార్ సహ దర్శకత్వం — తెరవెనుక హంగులు

### డాక్యుమెంటరీల డైరెక్టర్‌గా బి ఎ సుబ్బారావు

శ్రీ ఎన్ టి రామారావును "పల్లెటూరి పిల్ల" చిత్రంలో కథానాయకుడ్ని చేసిన ప్రముఖ దర్శక నిర్మాత బి ఎ సుబ్బారావును రాష్ట్ర ప్రభుత్వం డాక్యుమెంటరీ డైరెక్టర్‌గా నియమించింది డిసెంబర్ 26న పదవిని స్వీకరించిన ఈయన సబ్సిడీ బియ్యం పథకం గురించి, ఏడాది పాలనలో తెలుగుదేశం ప్రభుత్వం సాధించిన విజయాలను గురించి రెండు డాక్యుమెంటరీ చిత్రాలు తయారు చేశారు

---

## "కోడలు దిద్దిన కాపురం"

''ఇంటి పెద్ద ఏ చీకూ చింతా లేకుండా హాయిగా ఉంటూ ఇంటి బాధ్యతనంతా పెద్ద కొడుకు మీద పెడ్తాడు అన్ని ఒరువుతో సతమతమవుతూన్న భర్తకు చేదోడు వాదోడై, పెద్దలు తమ తప్పులు తెలుసుకునేలా ఆ కుటుంబాన్ని సరిదిద్ది, ఆదర్శవంతురాలవుతుంది కోడలు 'ముక్కుపుడక' చిత్ర కథకుడు కశైమణి సమకూర్చిన మరో చక్కని కథ ఇది,'' అన్నారు ఎస్ వి ఎస్ క్రియేషన్స్ అధినేత

బాలకృష్ణ 'డిస్కో కింగ్'





'అమ్మాయిల సవాల్'లో సుహాసిని

సహదేవ వెంకటేశ్వరరావు. ఈయన నిర్మించిన పై చిత్రంలో మోహన్, నళిని, రాజసులోచన, మంజు ముఖ్య భూమికలు నిర్వహించారు. శ్రీ చందర్ మాటలు, వేటూరి పాటలు రాశారు. ఇళయరాజా సంగీత దర్శకుడు. వేమూరి రవి సంకలనకర్త, రామనారాయణ దర్శకుడు.

## "తాళి తిరగబడితే ?"

వరకట్న నిర్మూలనకు పరిష్కార మార్గం చూపే హనుమాన్ ఆర్ట్ పిక్చర్స్ వారి పై చిత్రంలో విజయకృష్ణ, వరలక్ష్మి అనే నవనాయకా నాయికలను నిర్మాత ముంగర లక్ష్మీనరసమ్మ పరిచయం చేస్తున్నారు. రాళ్ళపల్లి, మాడా, నర్రా, పి. ఆర్. వరలక్ష్మి, జయవిజయ, కృష్ణకిశోర్ ఇతర పాత్రలు

'రచయిత్రి' రాజి



ధరిస్తారు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వ బాధ్యతలు వహించే కేదారి సూరిబాబు గతంలో విశ్వశాంతి, ప్రతాప్ ఆర్ట్స్ సంస్థలలో దర్శకత్వ శాఖలో అనుభవం గడించారు రాజ్ — కోటి సంగీతం, పి లక్ష్మణ్ ఛాయ, రంగారావు శిల్పం, అంకిరెడ్డి కూర్పు నిర్వహిస్తారు గుంటూరు వద్ద జనవరి 26 నుంచి ఒకే షెడ్యూల్లో చిత్రీకరణ ముగిసే ఈ చిత్రాన్ని ఎ గోపీనాథ్ నిర్వహణలో సైదు భుజంగరావు సమర్పిస్తారు శ్రీరామనవమికి విడుదల చేయాలని నిర్మాత సంకల్పం

'పుణ్యంకొద్దీ పురుషుడు'లో రాధిక






# సినిమా

## శోభన్‌బాబు చిత్రాలు

''జగన్, పుణ్యంకొద్దీ పురుషుడు, బావా మరదళ్ళు'' చిత్రాలను పూర్తిచేసి,''దానవుడు'', రోజా ఎంటర్‌ప్రైజెస్, హిమ మూవీస్ చిత్రాల్లో నటిస్తున్న శోభన్‌బాబు – సురేష్ ప్రొడక్షన్స్, కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో బాబా ఆర్ట్స్‌వారి చిత్రం, దాసరి దర్శకత్వంలో లక్ష్మి చిత్రవారి చిత్రం, విజయబాపినీడు దర్శకత్వంలో శ్రీనివాస ఫిలిమ్స్ చిత్రం, దాసరి దర్శకత్వంలో యువ చిత్రవారి చిత్రంలో పాల్గొంటారు



'ఊహాసుందరి' నళిని

## "నిర్దోషి"

''అన్నా–చెల్లెలు, బావగారి మధ్య జరిగే ఉత్కంఠ కలిగించే సంఘటనలతో కూడిన ఆసక్తిదాయకమైన కుటుంబ గాథా చిత్రం,'' అన్నారు రాజాచంద్ర ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో మురళీమోహన్ సమర్పిస్తూ ప్రధాన పాత్ర నిర్వహించే జయభేరీ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ 'నిర్దోషి'' చిత్రం తొలి షెడ్యూల్ జనవరి 15 నుంచి నెలాఖరు వరకు జరిగింది చంద్రమోహన్, సుహాసిని, ప్రభాకరరెడ్డి, గొల్లపూడి, గిరిబాబు, సాక్షి రంగారావు, చిట్టిబాబు, అనూరాధ, శుభ, వై జి మహేంద్రన్ ఇతర పాత్రధారులు ''కన్నడంలో, నటి లక్ష్మి నిర్మించిన 'ఇబ్బని కరిగితు' అనే హిట్ చిత్రం ఆధారం,'' అన్నారు నిర్మాత మాగంటి వెంకటేశ్వరరావు శాయిసుధ కథకు కాశీ విశ్వనాథ్ సంభాషణలకర్త వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త కె ఎస్ హరి ఛాయాగ్రాహకుడు ''ఫిబ్రవరి 8 నుంచి 15, మార్చి 15 నుంచి 19– తతిమ్మా రెండు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది,'' అన్నారు నిర్మాణ సారథ్యం వహించే కిశోర్ ●




Bhaskar L  దర్శకత్వం ఎ. కోదండరామిరెడ్డి  నిర్మాత ఎం నరసింహారావు  లక్ష్మీ ఫిలింస్

---




ఈగల్

రెస్టారెంట్ & బార్

ప్రకాశంరోడ్, విజయవాడ.2. ఫోన్:63903

**EXCLUSIVE FAMILY SECTION IN GARDEN**

**ENJOY COCKTAILS & ICECREAMS**




A TOUCH OF CLASS TO A NEW EXPERIENCE

జొన్నలగడ్డ లలితాదేవి

సీరియల్



# మారేడు దళం

(గత సంచిక తరువాయి)

ట్రయిన్ ఆగింది అక్కడ అందరూ దిగుతుంటే తను అక్కడే నిలబడింది సింహళ.

గుమ్మంలో నిలబడిన సింహళను చూసి చెయ్యి వూపాడు నవీన్.

అతన్ని చూడగానే ఆశ్చర్యానందాలు వూపివేశాయి ఆమెని

"గుడ్ మార్నింగ్" అంది నవ్వుతూ.

"గుడ్ మార్నింగ్" అంటూ "ప్రయాణం సుఖంగా సాగిందా ?" అని అడిగాడు

"ఆ !" అంది

ఇద్దరూ ప్లాట్‌ఫారమ్ దాటి స్టేషను లోపలకి వచ్చాక "కాస్త కాఫీ త్రాగుదాం" అంటూ క్యాంటీన్‌కి తీసుకువెళ్ళాడు.

తన అభిమాన రచయితను ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూస్తోంది సింహళ.

తన వూహకన్నా అందంగా వున్న ఆమెనే రెప్పవేయక చూశాడు. హోటల్లో గది తీసుకున్నాడు. ఆమెని చూసి ఆప్యాయంగా "సింహళా ! వెళ్ళి స్నానం చేసిరా ! బాగా అలసిపోయావు ప్రయాణంలో !" అన్నాడు

సూట్‌కేస్‌లోంచి చీర, జాకెట్టు అన్నీ తీసుకుని స్నానానికి వెళ్ళింది. ఆమె స్నానంచేసి టాయ్‌లెట్ అయి వచ్చేలోగా అతను క్రిందకు వెళ్ళి తన ఇంటికి ఫోన్‌చేశాడు

"ఈ రోజు నేను భోజనానికి ఇంటికి రాను. నా కోసం ఎవరూ ఎదురుచూడద్దు" అన్నాడు ఫోనులో

అట్నించి 'అలాగే' అని సమాధానం ఇచ్చింది అతని భార్య అనూరాధ

నవీన్ పైకి వచ్చేసరికి స్నానంచేసి డ్రస్ చేసుకుని బొట్టు పెట్టుకుంటోంది సింహళ.

ఈలోగా టిఫిన్ పట్టుకు రమ్మని వస్తూ ఆర్డరిచ్చి వచ్చాడు కనుక ఆమె టాయ్‌లెట్ అయ్యేసరికి దోసె, ఇడ్లీ తీసుకువచ్చాడు సర్వరు.

"తీసుకో సింహళా !" అంటూ ఆపేక్షగా తనే ఆమె ముందుకు ప్లేటు జరిపాడు.

ఈ ఆతిథ్యానికి పరవశించిపోతోంది సింహళాదేవి.

ఇతను యింత మంచివాడు. అతని రచనలలాగే అతని రూపం కూడా. ఆ రెండిటినీ మించిన ఆప్యాయత, ఆదరణ. ఇంత గొప్ప వ్యక్తిని కలుసుకోవడం నిజంగా తన అదృష్టం. ఏనాడో చేసుకున్న బంగారుపూజ — అనుకుంది మురిసిపోతూ.

ఆమె టిఫిన్ తీసుకున్నాక కాఫీ తెప్పించాడు

"సింహళా ! కాసేపు పడుకుంటావా ?" అని అడిగాడు

"అబ్బే ! ఇలా ఎప్పుడుపడితే అప్పుడు నాకు నిద్ర రాదు" అంది సింహళ.

"అయితే ఇప్పుడేం చేస్తావు ?"

"మీకేమన్నా పని వుందా ?"

"వేరే పనేంలేదులే"

"అయితే రాసుకోవాలా ?"

"అదీ ఇప్పటికిప్పుడు అర్జంటు కాదు."

"అయితే కాసేపు కబుర్లు చెప్పుకుందాం."

"చెప్పు" అన్నాడు నవ్వుతూ.

"మీరు ఇప్పుడేం రాస్తున్నారు ?"

"కొత్త నవల ప్రారంభించాలి. రాస్తున్న నవలలు పూర్తిచేశాను"

"అలాగా ! మరి కొత్త నవలను నాకు అంకితం ఇయ్యరా ?"

"నవలేంఖర్మ ! నన్ను నేనే అంకితం చేసుకుంటున్నాను నీకు."

ఆ మాటలు వినేసరికి సింహళ బుగ్గలు ఎఱ్ఱని మందారాలయ్యాయి.

**జరిగిన కథ — 2 :** నవలా రచయిత నవీన్‌ను అభిమానిస్తుంటుంది సింహళాదేవి స్వప్నతో హోటల్ కెళ్ళిన అమలేశ్వర్ వినోద్‌బాబు రాకతో బిల్లు బాధనుంచి బయటపడతాడు. సింహళ మనస్సు నవీన్ చుట్టూ, నవీన్ ఆలోచనలు సింహళ చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటాయి. నవీన్ సింహళని మద్రాసుకు ఆహ్వానిస్తాడు. హరి తల్లి అంత్యక్రియలకు సమత తను కొంత ధన సహాయం చేయడమే గాకుండా తన స్నేహితులు దగ్గర కూడా ఇప్పిస్తుంది. సింహళ నవీన్‌ను కలుసుకోను మద్రాసు వెళుతుంది.

ఈ మనిషి మాటలు తేనెకన్నా మధురం ! ఇలా రూపం— విద్య—తెలివి— అనురాగం — అన్నీ ఒకచోట వుండటం నిజంగా భగవత్ప్రసాదం. ఇలాంటి వ్యక్తుల్ని అపురూపంగా సృష్టిస్తాడు దేవుడు. అలాంటి అపురూపమైన వ్యక్తితో తనకి స్నేహం కలగడం తను ఏ జన్మలోనో చేసుకున్న సుకృతం అనుకుంది మెరిసే కళ్ళతో అతనికేసి చూస్తూ.

"ఏమిటి దేవిగారు అలా చూస్తున్నారు?"

"ఏంలేదు— మీ కళ్ళల్లో— —మాటల్లో ఏదో తెలియని మాగ్నెటిజం వుంది" అంది సింహళ.

ఆ మాటకి అతను నవ్వి వూరుకున్నాడు

"ఈ రోజు సాయంత్రం మనం అలా వెడదాం, భోజనం అయ్యాక బాగా రెస్టు తీసుకో" అన్నాడు.

అలాగేనన్నట్లు తల వూపింది

అపూట అక్కడ భోజనం చేసి హాయిగా తనూ ఓ కునుకుతీసి లేచాడు నవీన్.

ఆ సరికి సింహళ కూడా నిద్ర లేచింది మళ్ళీ టిఫెన్ చేసి కాఫీలు త్రాగి చక్కగా టాయ్‌లెట్ అయి అతనివెనకే బీచ్‌కి వచ్చింది సింహళ

అక్కడ అందరూ సింహళకేసి ఆదేపనిగా చూస్తుంటే అసలే ఆమె సౌందర్యానికి ముగ్ధుడైన నవీన్ మరింత గర్వంగా ఫీలయ్యాడు

"నువ్విక్కడ ఎన్నాళ్ళుంటావు ?"

"మీరు ఎన్నాళ్ళు వుండమంటే అన్నాళ్ళు"

"ఆ మాట అంటే అసలిక్కడే శాశ్వతంగా వుండిపొమ్మంటాను" అన్నాడు నవీన్.

ఆ మాటకి ఎదురుగా వున్న జలరాశిలాటే పొంగిపోయింది ఆమె హృదయం

"అది ఎలా సాధ్యపడుతుంది ?"

"ఎలా ఏముంది సింహళా ! నువ్వు నా దగ్గర వుండిపోవడమే."

"మీదగ్గరా ?"

"అవును – నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నీ అంగీకారమైతే మనం వివాహం చేసుకుందాం."

ఆ మాటకి ఊపిరాడనట్లు అయిపోయింది సింహళ.

ఇతను ! ఇతను మాట్లాడే మాటలన్నీ నిజమే అయితే తనంతటి అదృష్టవంతురాలు ఇండియా మొత్తంమీద వుండదు

నవీన్ వంటి మహారచయిత భార్యగా తనకెంత ప్రఖ్యాతి ! ఎంత పలుకుబడి ! సంఘంలో తన కెంతటి గౌరవాభిమానాలు ! మహారచయిత భార్యగా తనకి ఎన్ని సన్మానాలు ! ఎంత ఘనకీర్తి ! అంతటి బంగారు పూజ చేసి పుట్టిందా తను ?

ఆమె హృదయం మేఘాల్లో తేలిపోతోంది. కళ్ళముందు జరగబోయే ఘనసన్మానాలన్నీ మధురంగా వూరిస్తున్నాయి

ఊహాలే ఇంత ఆనందంగా వుంటే ఇంక నిజంగా జరిగితే ఎంత మధురంగా వుంటుందో !

ఆమె స్వప్నాన్ని చెదరగొడుతూ నవీన్ కంఠం వినిపించింది

''ఏం సింహళా ! మాట్లాడవు ?''

''ఏం మాట్లాడను ? దేవుడు ప్రత్యక్షమై వరాలిస్తానంటే'' అంది మెల్లగా.

''దేవుడు నేను, దేవివి నువ్వు'' అన్నాడు ఆమె చెయ్యి అందుకుని గట్టిగా నొక్కుతూ

ఆ స్పర్శకు పులకించిపోయింది సింహళ.

తనంత అదృష్టవంతురాలు మరెక్కడా పుట్టదు—పెరగదు అనుకుంటూ అతని చేయి అందుకుని ఇవతలకు వచ్చింది.

అప్పటికే తదియ చంద్రుడు పైకి వచ్చాడు. జగత్తంతా చీకటి తెరలు ఆవరించుకుని వుంది

ఆ తెరలను తొలగించుకుంటూ అలవోకగా చూస్తున్నాడు చుక్కలరేడు

ఆ రాత్రికి కూడా అక్కడే వుందామని ఆరాటపడింది అతని మనసు.

కాని వచ్చిన మొదటి రోజే తను చొరవ తీసుకుంటే తనమీద ఆమెకి అంత సదభిప్రాయం వుండదని జంకాడు.

''సింహళా ! నేను వెళ్ళి రేపు ఉదయం వస్తాను'' అని అన్నాడు. అలాగే నన్నట్టు తల ఆడించింది.

''తలుపు లోపల గెడియ సరిగ్గా వేసుకుని పడుకో ! ఏం భయం లేదుగా'' అన్నాడు.

''భయం లేదులెండి ! ఒక్కత్తినీ అక్కడి నుంచి ఇక్కడికి రాలేదా !''

''వెరీ గుడ్ ! ఆడపిల్లలు అలా ధైర్యంగా వుండాలి. అలా డేరింగ్‌గా వుండే వాళ్ళంటే నాకు చాలా ఇష్టం'' అన్నాడు నవీన్.

''డేరింగ్ అన్నది ఏ ఆడపిల్లైనా ఏదో ఒక సమయంలో ప్రదర్శించకుండా వుండదు'' అంది నవ్వుతూ.

''నిజమేలే ! అవన్నీ అంతర్గత శక్తులు ఆడవారికి.'' అంటూ మరోసారి మందహాసం చేసి వెళ్ళిపోయాడు.

అతను ఇంటికి వెళ్ళేసరికి అమూరాధ నిద్ర పోతోంది.



# మారేడు దళం

కాలింగ్ బెల్ మోత విని నిద్ర కళ్లతో వచ్చి తలుపు తీసి మళ్లీ పడుకుంది.

ఆ టైములో అతను వచ్చాడంటే ఎక్కడో భోజనం చేసే వచ్చాడని ఆమెకి అనుభవైక వేద్యం. అంచేత అడగదు. అడిగినా అతను జవాబివ్వడు. అది కూడా ఆమెకి తెలిసిన విషయమే.

పాప ఆమె మంచం మీద ఆదమరచి నిద్ర పోతోంది.

నవీన్ ఒకసారి వాచీ చూసుకున్నాడు. పదిం బావయింది.

నైన్త్ క్లాసు చదువుతోంది నవీన్ కూతురు భరణి. ఒక్కత్తే పిల్ల కనుక అనూరాధకు మరీ గారాబం కూతురంటే, ఆ గారం కొద్దీ పిల్ల బాగుండాలన్న కోరికతో ఎప్పుడూ ఏదో ఒకటి తిండి పెడుతూ వుంటుంది. బాగా తింటే పిల్ల బాగా పుష్టిగా వుండి నిగనిగలాడుతుందని ఆమె భావం.

నవీన్ కూడా ఒక్క పిల్లని కొడుకుని కూడా ఆమెలో చూసుకుంటూ వుంటాడు. అవీఇవీ తెచ్చిపెడుతుంటాడు. మగపిల్లల్లేని కొరత కనుక మగపిల్లాడి డ్రస్సు కూడా భరణికి తొడుగుతారు. దేనికీ అభ్యంతరం చెప్పదు భరణి.

''ఈ సంవత్సరం టెన్త్‌కి వచ్చింది పాప! బాగా చదివించాలి, ఏ డాక్టర్నో చేయాలి— ఆ తర్వాత రాజకీయ రంగంలో కూడా ప్రవేశ పెట్టాలి — ముందు ముందు ప్రధాని కాగల రాజకీయ నాయకురాల్ని చేయాలి'' ఇది నవీన్ అభిప్రాయం.

భర్త ఈమాట అన్నప్పుడల్లా అనూరాధకు పట్టపగ్గాలుండవు. తన కూతురు అప్పుడే ఇందిరాగాంధి అంతటి వ్యక్తి అయిపోయినట్టుగా మురిసిపోతూ వుంటుంది.

తెల్లవార్లూ నవీన్‌కి నిద్ర పట్టలేదు— సింహాళకి అంతకంటే నిద్ర పట్టలేదు. ఆమెకి పట్టిన కలత నిద్రలో నవీన్ కనిపించి ఆమెని అలరించాడు. నవీన్‌కి కాస్త కునుకుపట్టేసరికి సింహాళ ప్రత్యక్షమై అతన్ని అల్లరి పెట్టింది.

ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా! ఎప్పుడు వెళ్ళి ఆమెని చూద్దామా అని తహతహలాడి పోయింది అతని ప్రాణం.

అతను ఎప్పుడెప్పుడు వస్తాడా అని తెల్లవారే సరికి తయారై ఎదురుచూస్తోంది సింహాళ.

''హల్లో సింహాళా! గుడ్ మార్నింగ్!''

''గుడ్ మార్నింగ్.''

''రాత్రి బాగా నిద్రపట్టిందా?''

''ఎలా పడుతుంది?'' కొంటెగా అడిగింది.

''ఎందుకని?''

''ఎందుకనో మీ మనసు నడగండి.''

''అడగక్కర్లేదు. నీ కళ్ళల్లో ప్రతిఫలి స్తోంది చూడు అది చాలు నీకు నిద్రపట్టలేదని తెలియడానికి!''

ఆ మాటకి సిగ్గుతో తలవంచుకుంది సింహాళ.

''అందుకే సింహాళా! నేను తెల్లవారేసరికి నీ ముందు ప్రత్యక్షమయింది'' అన్నాడు, అను రాగం మేళవించి.

బాయ్‌ని పిలిచి టిఫిన్ తెప్పించాడు — కాఫీ తెప్పించాడు. కాసేపు ఆమెతో కబుర్లు చెప్పాడు.

జూ, కన్నెమరా లైబ్రరీ ఆ రోజు చూపించాడు.

ఆ మర్నాడు మహాబలిపురం తీసుకువెళ్ళాడు.

చిన్నక్లాసు చదువుకునే రోజులనించీ ఆమెకి మహాబలిపురం వెడదామని కోరికగా వుండేది.

అక్కడ రాతి రథాలను తలచుకుంటేనే ఆమెకి ఒళ్ళు గగుర్పొడిచింది. ఏవో ఏవో ఎంతో గొప్పగా వూహించుకుంది.

కానీ తన వూహల్లో విహరించినట్లు అంత గొప్పగా ఆమెకి కనిపించలేదు.

''చాలావరకు సముద్రం పాలయ్యాయి సింహాళా! చివరకు మిగిలినవి ఇవి.'' అంటూ చూపించినప్పుడు చాలా బాధపడింది.

తను మరీ అతిగా వూహించుకుంది. అందుకే ఇంత చిన్నబోయింది తన మనసు.

ఏదైనా అంతే! యదార్థాలకు — వూహలకు చాలా తేడా వుంటుంది. వూహల్లో అద్భుతంగా వూహించుకున్న వ్యక్తులు నిత్యజీవితంలో ఎదురు పడినప్పుడు అతిసామాన్యంగా కనిపిస్తే తమ వూహల కనుగుణ్యంగా లేకపోయేసరికి నిరాశ పడిపోతారు చాలామంది. ఒక వ్యక్తిని అయినా అంతే — ఒక ప్రదేశమైనా అంతే — ఒకరి స్వభావం అయినా అంతే — అతిగా ఆలోచించుకో కూడదు.

అంతకుమునుపు తను పడిన తపన పాలపొంగులా జారిపోయేసరికి హోటల్ రూంకి నీరసంగా వచ్చింది.

అక్కడ మద్రాసులో ఆరు రోజులు వుంది సింహాళ. ఆరు రోజులూ అతను రోజూ ఎక్కడికో అక్కడికి తీసుకువెళ్ళి చూపిస్తూనే వున్నాడు.

''ఇంక నేను వెడతాను'' అంది సింహాళ ఇంటి దగ్గర తల్లితండ్రులు ఏమంటారో అన్న భయంకొద్దీ.

''వెళ్ళు! కాని మరిచిపోకు నన్ను'' అన్నాడు నవీన్.

''మరిచిపోవడమా! ఆ మాట ఇప్పుడంటే అన్నారు. మరెప్పుడూ అనకండి'' అంది సింహాళ ఓరగా చూస్తూ.

ఆమెకి కోపం వచ్చిందని గ్రహించి ''సారీ! వెళ్ళగానే లెటరు రాస్తావా?'' అని అడిగాడు ఆమె చేయి అందుకుని ముద్దు పెట్టుకుంటూ.

''ఆ! తప్పకుండా రాస్తాను. మీరు జవాబివ్వాలి'' అంటూ అతని చేయి తన నోటి దగ్గర పెట్టుకుని చటుక్కున ముద్దు పెట్టుకు వదిలింది. అతను పులకించిపోయాడు.

ఆమెని రైలు ఎక్కించి భారమైన హృదయంతో ఇంటికి వెళ్ళిపోయాడు నవీన్.

## 5

''ఏమిటి బావా! చాలా కోపంగావున్నావు?'' అంటూ దగ్గరకు వచ్చింది సమత.

''ఏం లేదులే!'' అన్నాడు చిరాకుపడుతూ.

ఇంక ఇతను చెప్పడని గ్రహించి గబగబా లోపలకు వెళ్ళింది. కప్పునిండా కాఫీ పోసుకుని తీసుకువచ్చింది.

''ఈ కాఫీ తాగు. కాస్త కోపం తగ్గుతుంది.''

ఆ క్షణంలో కాఫీ అవసరమేననిపించింది అమలేశ్వర్‌కి. ఆ కాఫీ తాగాక అతని చిరాకు పరాకులు మాయమై ఆస్థానే కాస్త శాంతం చోటు చేసుకుంది.

''సమతా! తీరుబడిగా వున్నావా?'' అని అడిగాడు.

''ఆ! తీరుబడిగానే వున్నాను.''

''అయితే నేను ఒక చిక్కు సమస్య చెబుతాను. దానికి పరిష్కారమార్గం ఆలోచించి చెబుతావా?''

''నా బుర్రకు తోచినంత వరకూ ఆలోచించి చెబుతాను.''

ఇటీవల హైదరాబాదులోని గన్‌రాక్ వాటర్ సప్లై ఇన్‌స్టలేషన్ శతవార్షికోత్సవ సందర్భంగా మిమిక్రీ కళాకారుడు శ్రీ చిల్లర సుధాకర్‌ని మేజర్ భట్టాచార్య సత్కరిస్తున్న దృశ్యం.



"ఓ కే ! అయితే విను" అంటూ ఒకసారి లోపలకి తొంగి చూసి "మీ నాన్న ఉన్నారా ?" అని అడిగాడు

"లేరులే !" అంది నవ్వు ఆపుకుంటూ

"అయితే సరే !" అంటూ కుర్చీలో సరిగ్గా సర్దుకుని కూర్చున్నాడు

బావగారు చెప్పబోయే చిక్కు సమస్య ఏమిటో వినడానికి తన రెండు చెవులనూ రెండు వేల చెవులు చేసుకుని వినసాగింది సమత

"హరి నీకు గుర్తున్నాడుగా !" అని అడిగాడు ఉపోద్ఘాతంగా

"ఆ ! అతనెందుకు గుర్తుండడు ? మొన్ననేగా మనింట్లో అరగంట బాతాఖాని కొట్టి వెళ్ళాడు" అంది నవ్వుతూ

"ఆ హరిగాడు ఒక వలలో చిక్కి గిలగిల్లాడుతున్నాడు"

"ఏం వల ? ప్రేమ వలా ?" రపీమని అడిగింది సమత

"ప్రేమవలలో పడితే నువ్వు, నేను సాయం పట్టక్కర్లేదు ఆ తిప్పలేవో అతనే పడతాడు కాని అతను పడింది మటుకు ఒక కబంధుడి హస్తంలో"

"నువ్వు రైటరయితే బాగుంటుంది బావా! ప్రతీదీ సస్పెన్స్‌లోపెట్టి చంపుకుతినే పద్ధతి చూస్తుంటే నువ్వు భవిష్యత్తులోనైనా మహా రచయిత అయిపోతావేమోనని అనుమానంగా ఆ తర్వాత బెంగగాకూడా వుంది"

"అవేవో తర్వాత చూద్దాంలేగాని ముందు కథ విను మధ్యలో నువ్వు ఇలా అడ్డుకుంటూ వుంటే నాకు మంట"

"సరే మండిపోవద్దులే చెప్పు"

"అతని తల్లి చనిపోయింది గదా ! ఆవిడ అప్పుడో రూపాయి, అప్పుడో పది చొప్పున జాలయ్య దగ్గర దాచిందట అది వెయ్యి రూపాయలు అయిందట

ఆ విషయం వివరంగా రాసి ఆవిడ పెట్టె అడుగున ఒక కాగితంలో దాచిందట వాళ్ళమ్మ కర్మకాండలయ్యాక వీడు ఆ పెట్టెతీసి ఆ బట్టలు ఎవరికన్నా ఇచ్చేద్దాం అనుకుంటూ ఒక్కొక్కటీ ఇవతల పెడుతుంటే ఆ కాగితం కనిపించింది

అది తీసుకువెళ్ళి జాలయ్యని అడిగితే, "తిండికి రికానాలేని మీ అమ్మ డబ్బు దాచిందా ! అది నమ్మే విషయమేనా !

ఏవో కాగితంమీద నాలుగు అంకెలు వేస్తే సరిపోయిందా ! అయినా ఈమధ్య ఇది ఒక ఫ్యాషను అయిపోయింది కాస్త నాలుగు డబ్బులు కలవాడిని ఇలాగే ఏదో దొంగవేషాలు వేసి లాగుతున్నారు" అని ఛడామడా తిట్టి పంపించాడట."

ఆ మాట అంటున్నప్పుడు అమలేశ్వర్ ముఖం ఎఱ్ఱగా నిప్పులా మండిపోవడం స్పష్టంగా గమనించింది సమత.

"అయ్యో ! అయితే వెయ్యి రూపాయలు జాలయ్య కాజేసినట్టేనా ?" బాధగా అడిగింది.

"కాజేసినట్టేనా అని మెల్లగా అడుగుతున్నావా ?" అన్నాడు అమలేశ్వర్.

"మరి ఇప్పుడేం చేయడం ?"

"అదేగా చెప్పింది నేను ముందు నీతో అన్నమాటే అది అసలు జటిలసమస్యని పరిష్కరించగలవా అని !" విసుగ్గా ముఖం పెట్టాడు అమలేశ్వర్

"బాగుంది ఇటువంటి విషయాల్లో నేను మాత్రం ఏం సలహా ఇవ్వగలను ! ఏదన్నా పోలీసు సహాయం అయితే" అంటూ నసిగింది.

ఛ్రరున లేచాడు, అమలేశ్వర్.

"ఈ బోడి సలహా నాకు తట్టకేనా ! ఇంత సేపు కంఠశోషపడి నీకు చెప్పింది" అని అడిగాడు విసుగ్గా.

"బాగుంది. నాకు తోచింది అది అదే చెప్పాను. నేను వెళ్ళి వాడి మీద తగూపడలేను గదా !" బిక్కముఖం వేసింది సమత

ఆమె ముఖం చూసేసరికి అతని కోపం చల్లారిపోయింది

"మనం తిండిలేక మాడిచచ్చే పేదవారం కావచ్చు కాని అన్యాయాన్ని సహించము. అందులో ప్రాణమిత్రునికింత మోసం జరిగితే చూస్తూ వూరుకుంటామా !" ఆవేశంగా అడిగాడు

"వూరుకోక మనమేంచేస్తాం ? మనవల్లేమవుతుంది ?"

"అదుగో ఆ పిరికితనం అంటే నాకు నసాళం అంటుకుంటుంది బి ఏ చదివావు చిన్నయసూరి ఏంచెప్పాడో గుర్తులేదూ"

"చెప్పాడులే ! అవి అన్నీ ఇప్పుడీ మనుషుల్ని దోచుకునే రోజుల్లో సాధ్యపడతాయా ని" మెల్లగా అడిగింది సమత.

" రోజులు ఏమైనా నీతి ఒకటే ! నీకు చెప్పలేకచస్తున్నాను—రేపు యూనివర్శిటీ వాళ్ళు నీకు పట్టా ఎలా ఇస్తారో బొత్తిగా అర్థం కావటంలేదు."

ఆ మాటకి కోపం తెచ్చుకోలేదు సరిగదా చిన్నగా నవ్వింది సమత

"సరే ! ఆ సంగతి తర్వాత కనుక్కొందువు గాని ముందు నువ్వు ఏం చేయదలుచుకున్నావో చెబుతావా ?"

"ఏంలేదు వాడిమీదికి మనం అందరం ఒకసారి దాడిచేస్తే ఎలా వుంటుంది ?"

"ఏం బాగుండదు. అతనే మనందరినీ మూకుమ్మడిగా కటకటాల మధ్యకి తోయిస్తాడు" అంది సమత నోరు చప్పరించేసి

"మరి ఏం చేయాలంటావు ?"

"ఏం చేయాలన్నా మనం ముందు ఒకసారి హరిని కలుసుకుని ఇంకా వివరాలు సేకరించి అప్పుడు అతనితో సంప్రతించితే మంచిదని నా ఉద్దేశం !"

"సంప్రదింపులు ఎవరితో"

"అదే జాలయ్యతో"

"అబ్బే ! అదేం లాభంలేదు. కృష్ణ రాయబారం ఏం ఉపయోగించిందో ఇదీ అంతే!"

"ముందు హరిని ఒకసారి ఇక్కడికి రమ్మను" అంటూ లోపల పనిమీద వెళ్ళిపోయింది సమత.

ఆలస్యం అమృతం విషం అన్నట్లు అప్పటికప్పుడే బయలుదేరాడు అమలేశ్వర్



## ఇవేమన పద్యాలు




వేషధారి నెపుడు విశ్వసింపగరాదు
వేషమెంతో దోష విధమెటుంగ
రట్టుచేసెగాక రావణవేషంబు
విశ్వదాభిరామ వినుర వేమ.

## మారేడు దళం

అది గమనించి తనలో తనే నవ్వుకుంది సమత.

''ఎంతైనా శివకేశవులు మరి'' అనుకుంది తనలో తనే నవ్వుకుని

హరి ఇంటికి అమలేశ్వర్ వెళ్ళేసరికి అతను ఇంట్లోనే వున్నాడు వీధి వసారాలో మడత మంచం వేసుకుని తలకింద రెండు చేతులూ పెట్టుకుని దీర్ఘాలోచనలో మునిగిపోయినట్టు కనిపించాడు

''హరీ !'' అంటూ పిలిచాడు అమలేశ్వర్

ఉలిక్కిపడి తిరిగి చూశాడు హరి ఎదురుగా అమలేశ్వర్

''నువ్వా ! రా !'' అన్నాడు లేచి కూర్చుని

ఆ మడతమంచంమీదే ఒక ప్రక్కగా కూర్చున్నాడు అమలేశ్వర్

''ఏరా కాఫీ అన్నా తాగావా ?'' అంటూ పలకరించాడు తనే

ఆ ఆప్యాయతకు చెమ్మగిల్లినాయి హరి కళ్ళు

నిజంగా తను తిన్నాడో -- చచ్చాడో, బతికాడో, అంటూ కాస్త యోగక్షేమాలు విచారించేది అమలేశ్వర్ ఒక్కడే

''కాఫీ త్రాగానులే !'' అంటూ జీవంలేని నవ్వు నవ్వాడు హరి

''ఏమంటున్నాడు జాలయ్య ?'' అని అడిగాడు హరి

''వాడింక అనేదేముంది ? ఏం చేసు కుంటావో చేసుకో ! నీ దిక్కున్న చోట చెప్పుకో! నీకు పైస ఇవ్వక్కర్లేదు అంటూ తెగేసి ఆనాడే చెప్పాడు ఇంకా వాడిమీద ఆశపెట్టు కోవడం దేనికి !'' అన్నాడు హరి

''ఈ కరువు రోజుల్లో వెయ్యి రూపాయ లంటే మాటలు కాదురా హరి నిజంగా దాచి వుండకపోతే తారీఖులతోసహా మీ అమ్మ కాగితంలో ఎందుకు రాస్తుంది ?''

''మరే ! ఆవిడ దాచింది అంత వరకూ నిజమే, కాని ఆ దాచేది బ్యాంక్‌లో దాస్తే మన కింత తిప్పలుండేవి కావు వాడెవరినో నమ్మి వాడి ముఖాన పోసింది '' బాధగా అన్నాడు హరి .

''మరే ! బ్యాంకిలో వేస్తే నీకు తెలిసి పోతుందనుకుంది చివరికి మొత్తం కృష్ణార్పణం అవుతుందనుకోలేదు సరేగాని నిన్ను సమత ఆ కాగితాలేవో తీసుకుని రమ్మంది ''

ఆ మాటకి విచిత్రంగా చూశాడు హరి

''అయితే సమతకి చెప్పావా ?''

''ఆ ! మనకేమన్నా బుర్ర పనిచేయని సమస్యలుంటే ఆమెగారికే చెప్పేది సమత ఆడపిల్ల అయినా చాలా ధైర్యశాలి ఒక్కొక్క సారి ఆవిడ బుర్ర అమోఘంన్నరగా పని చేస్తుంది '' అంటూ నవ్వాడు అమలేశ్వర్

''అదృష్టవంతుడివిరా అమలేశ్వరా అలాంటి నూర్జహాను మరదలు వుండటం అంటే మాటలు కాదోయ్ !'' అన్నాడు హరి

హరి మాటలకు తనలో తనే నవ్వుకున్నాడు గర్వంగా

''సరే ! సమత ఆర్డరు వేశాక తప్పు తుందా ? పద ఆ సందు చివర **టీ** స్టాలులో కాస్త ఒన్‌బైటు టీకొట్టి వెడదాం'' అంటూ లేచి చొక్కా వేసుకుని– చెప్పులు తొడుక్కుని తలుపు తాళంవేసి బయలుదేరాడు హరి అనుస రించాడు మిత్రుడు

**(ఇంకా ఉంది)**

### ఒక సోదరి - అమలాపురం

సర్వ వ్యసనాలు ఉండి, రెండు కాళ్ళూ లేని కొడుకు వుండి — భర్త పెట్టే హింసలు భరిస్తూ — ఎలా బ్రతకడం ? బుద్ధిమంతుడైన చిన్నకొడుకున్నాడు. కాని వాడిని తండ్రి బోధలు పాడుచేసి తల్లిని తిట్టిపోసేలా చేస్తున్నాయి నాకు బ్రతకాలని లేదు అక్కయ్యా, మీరు ఎదురుగా వుంటే మీతో చెప్పుకోవాలని వుంది

★ నీకు ఓదార్పు అవసరం సోదరీ, కాని ఆపాటి నీ బాధను అర్థం చేసుకునే ఆత్మీయులు నీ దగ్గరగా లేరా ? ఆశ్చర్యంగా వుంది ఇలాంటి 'గృహదహనాలకి' నీలాంటివాళ్ల చావుకాదు పరిష్కారం ధైర్యంచేసి — ఎదిరించి — బ్రతికే దారికి ఏర్పాటుకై పోరాడాలి. ఇష్టంలేని ఆలిని కాల్చుకుతినే హక్కు ఆస్తిపాస్తులున్నా — భర్తకి లేదన్న సంగతి తెలియచెప్పాలి; "ఫ్రీ లీగల్ ఎయిడ్" యిచ్చేవారే మీ ప్రాంతాల కరువయ్యారా ?. పెద్దమనుషులతో సంప్రదించి — ధైర్యంగా — మంచిచెడులు తేల్చుకోండి. మీ తల్లీతండ్రీ ఏమయ్యారు ? దీనిలో వారికి బాధ్యత లేదా ?.

### పి. హెచ్. ఆర్. — లోచెర్ల

ఆడవాళ్లు స్వార్థపరులంటారు నిజమేనా ?

★ నిజమే — ఎటొచ్చీ వారి స్వార్థం — వారికోసం కాదు — బిడ్డా పాపా కోసం, కట్టుకున్న వాడి కోసం.

మీరు జవాబులిస్తున్నప్పుడు ఆడవారిని సమర్థిస్తారెందుకు ?

★ ఆడదాన్ని కనుక !

### పి. ఐ. కె. — ఆర్మూరు

ఈ దేశంలో ప్రతి వ్యక్తి అడుక్కుతింటూ వుంటే ఇక మన దేశం ముందంజ వేసేదెప్పుడు?

★ ఏం — అంతా యిలా వుంటేనేకద — కొందరు ముందంజ వేస్తూ పోతూన్నారు ! కొందరికి పుణ్యం దక్కుతూంది !

### కె. కె. వి. — మదనపల్లె

మన మగవాళ్లు యింటికి దీపం ఇల్లాలు— ఆడదే అంటారు — కాని ఆడది దేశానికి దీపం అంటే ఎందుకు అసహ్యించుకుంటారు ?

★ ఇల్లు చిన్నది—దీన్ని ఎవరేనా వెల్గిస్తారు.

దేశం పెద్దది దాన్ని మగవాళ్లే వెల్గించాలని — వుండడం సహజం కదా !!

### ఎ. ఎస్. డి. ఎ. — మద్రాసు

మీరు ఆడవాళ్లనే ఎక్కువ సపోర్టు చేస్తారు దానికి కారణం ఏమిటి ? మీరూ ఆ జాతికి చెందినవారనా ?

★ ఆడవారి సమస్యలో వున్నది — నిజమైన బాధ. అందుకని.




### కె. వి. ఆర్. — కాగజ్‌నగరు

అక్కయ్యా, రామరాజ్యంలోకి రావణుడు వస్తే ?

★ ఒక్క తల కాదు — పది తలలకి పిచ్చెత్తిపోతుంది !

### బి. పి; పి. ఎస్. — కాళ్లపాలెం

దేవుడున్నాడంటున్నవాళ్లు — ఉన్నట్టు నిరూపించలేకపోతున్నారు. లేడంటున్నవాళ్లు నిరూపించలేకుండా వున్నారు.

★ ఉన్నాడా ? లేడా ? అన్నది కాదు ప్రశ్న ఆసక్తి కల్గిస్తున్నాడా ? లేదా ? అన్నదే — ప్రశ్న . జవాబు కూడా

### డి. ఎస్. ఆర్. — విజయనగరం

మీరన్నా మీ జవాబులన్నా నాకు యిష్టం కాని మిమ్మల్ని చూడాలని వుంది.

★ దానికేం భాగ్యం— ముందు ఆంజనేయ దండకం లాంటివి కంఠస్తం చేయండి! తరవాత నేను ప్రత్యక్షం అయినా— దడుసుకోరు.

### ఎమ్. జి. — దుబాయి

అక్కయ్యా, మనిషి బ్రతకడంలో అర్థం ఏమిటి ? ఎందుకు బ్రతుకుతాడు ?

★ పొట్టకోసం అంత దూరం పోయాక కూడా 'మనిషి ఎందుకు బ్రతుకుతాడో, అర్థం కాలేదా ?' ఆశ్చర్యంగా వుంది.

### ఎస్. ఆర్. — అనంతపురం

హిప్నటిజం మీద మీ అభిప్రాయం ఏమిటి?

★ అది సైన్సో, ఏమిటో నాకు నిజంగా తెలియదు అంచేత నాకు రాసిన కంటే — దాన్ని గురించి తెలిపిన వారికి రాయండి—తెగ ప్రకటనలు వస్తున్నాయి కద, పోస్టు ద్వారా కూడా నేర్పిస్తామంటూ !

### కె. ఎస్. ఎన్. — రాయపూరు

నేటి యువతీ యువకుల ప్రేమ వివాహాలపై పెద్దలు ఎటువంటి ఆటంకాలు పెట్టకుండా ఒప్పుకున్నా మధ్యన సంఘ సభ్యులు అడ్డుగోడలు పెడతారెందుకు ?

★ ఆ అడ్డుగోడలు మనం గుర్తించవలసిన అవసరం ఏమిటి ? ఒక మంచిపని అలజడి లేకుండా జరిగిపోతూవుంటే — తీరి కూర్చున్న వారికి — వినోదం లోపిస్తుంది కద !

### ఎమ్. ఎ. — న్యూఢిల్లీ

స్త్రీకి మానభంగం జరగడంకి కారణం ఆమె దురదృష్టం అంటారా ?

★ ఎలా అంటాను ? దురదృష్టవంతులందరూ బలాత్కారానికి గురి అవుతారంటే ఒప్పుకుంటారా ?— ఆడదానిపట్ల చులకన స్వభావం, తగిన అదను — మూర్ఖపు కామం ఆడదాన్ని మానభంగం చేయడానికి— సహకరిస్తాయి.

నిజం నిలకడమీద తెలుస్తుంది అంటారు? ఎన్నాళ్లకి ?

★ అదే అర్థం కాదు !!

కులమత బేధాలు దేవుళ్లకి కూడా వున్నాయా ?

★ ఉంటే— దేవుడనం కదా ?



# ఆకలి దప్పులు

– కప్పగంతుల మల్లికార్జునరావు

పాసెంజర్ ట్రయిన్ ఆ స్టేషన్‌కు చేరేసరికి చీకటి పడింది. ఆకాశం మేఘావృతమై వుంది. సన్నగా తుంపర్లు పడుతున్నాయి.

పట్టాభిరావ్ పెట్టెలో నుంచి దిగబోతున్న వాడల్లా ఆగి గుమ్మం వద్దే నిలబడి ఆశగా ప్లాట్‌ఫామ్ అంతా కలయ చూచేడు.

సిగ్నల్ వూపుతున్న ఏయస్సెమ్, గేటు నుంచి వెళ్లే పాసెంజర్స్ వద్ద టిక్కెట్లు వసూలు చేస్తూ, మధ్యలో గంట కొడ్తున్న పోర్టరు కనిపించారు.

వాళ్లే. తను పదిరోజుల క్రితం అక్కడికి వచ్చినప్పుడు డ్యూటీలో వున్నవారే. మానవత్వానికి విలువ నివ్వని మరమనుష్యులు !

''ఒరేయ్ వెధవ వర్షం పట్టుకొనేలాగుంది మళ్ళీ త్వరగా పోదాం పదండి.''

పట్టాభిరావ్ కాక ఆ స్టేషన్లో దిగిన పాసెంజర్స్ తక్కువ. వారు, ఆ మాత్రం తుంపర్లకే మొక్కమొలుస్తామన్నట్లు, రైలు దిగీ దిగంగానే పరుగులు తీస్తున్నారు.

''మనిషి స్వభావమే అంత. ఎండ ఎక్కువైనప్పుడు వర్షాన్నీ, వర్షం ఎక్కువయినప్పుడు ఎండనీ గౌరవిస్తాడు. అయినా పదిరోజుల్లో వాతావరణంలో మాత్రం ఎంత మార్పు ?''అనుకొంటూ రైలు దిగాడతను

రైలు కూతవేసి కదిలి వెళ్లింది. పోర్టర్‌కి టిక్కెట్ యిచ్చి పట్టాభిరావ్, రెండవతరగతి విశ్రాంతి గృహమని పిలవబడే చిన్న రేకుల షెడ్డులోకి వచ్చాడు.

అల్లంత దూరంలో రెండు సిమెంటు బెంచీలు ... వొక చెక్క బెంచీ . ఆ బెంచీ మీదెవరూ...

పట్టాభిరావ్‌కి ఆ బెంచీ మీద వొక్కసారి కూర్చొని వెళ్లాలనిపించింది.

''ఏడకెళ్లాలేంబాబూ? యిప్పుడు,అప్పుగ్గాని డొంగ్గాని బండేం లేదు. ఎక్స్‌ప్రెస్‌లున్నా యీ టేసనులో ఆగవు. వరసం వచ్చేనాగుంది. యీడకి వూరు మూడు మైళ్లుంది. అదైనా సిన్నవూరు. వోటళ్లు అవీ వుండవు.''

పోర్టరు మాటల్ని వింటూ బెంచీ వద్దకి నడిచాడు పట్టాభిరావ్ ఆ బెంచీ చుట్టూ వేరుశనగకాయల తొక్కలు. బీడీ, చుట్ట ముక్కలు .. ఆరీ ఆరని వుమ్మి మరకలు నానా బీభత్సంగా వుంది

అయినా ఆ బెంచీ. పట్టాభిరావ్ ఆ బెంచీ మీద కూర్చున్నాడు ఎవరో తనని ఆత్మీయంగా, ఆప్యాయంగా పలకరించిన భావన. .

ఎడారిలో మంచినీటి సరస్సులా, స్వార్థం, రాక్షసత్వం నిండిన ప్రపంచంలో, మానవత్వం ప్రేమలను అయాచితంగా పొందిన చోటు వొకనాడు, వాటికి పతావిష్కరణ జరిగిన చోటు ఆ భావనలో ఎంత తృప్తి ! హాయి !

పోర్టరు వైపు గర్వంగా చూచాడతను

''మీరెవరో యీ వూరికి కొత్తనాగున్నారని యీయాయిసయాలు మాటేసన్‌మాట్టారుగోరు సెప్పిరమ్మంటే సెప్పేను. యీ టేసనులో ఏం దొరకవు వరసంవస్తే ఆబల్లేగాదు . యీ సెడ్డంతా జల్లుగొడ్తుంది. అందుకని సీకటి బాగా పడకముందే, వరసం పెరక్కముందే.. ''

''పోర్టరు తన బాధ్యత తీరిపోయిందన్నట్లు వెళ్ళిపోతున్నాడు.

''ఇదుగో –'' పోర్టరు ఆగేడు

''నేనీ స్టేషనుకి కొత్తేంకాదులే కానీ ఆ వూరు నాకు కొత్త –''

''అక్కడ ఎవరింటికెళ్లాలి ?''

''సూరి యింటికి వూళ్లో ఆమె యిల్లు ఎక్కడో కాస్త గుర్తులు చెప్పగలవా ?''

''ఓహో ! దానింటికా ? ఊళ్ళోకెళ్లి ఏ మగాడినడిగినా సెప్తాడు – దానిల్లెక్కడో–''

పోర్టరు అతనడిగిన వివరాలు చెప్పకుండానే వెళ్ళిపోయాడు

వొక్క వుదుటున లేచి వెళ్లి అతడి చొక్కా పట్టుకొని ఆపి ఆ చెంపా యీచెంపా వాయించాలనిపించిందతనికి పదిరోజులక్రితం వచ్చినప్పుడూ అలాగే అనిపించింది. కానీ ఆ రోజు తన్నే శక్తి లేదు. యీ రోజు వుంది అయినా నిగ్రహించుకొన్నాడు.

''ఈ రోజు దైవతాభావనను మనసులో







# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

**ఎలాగో చూడండి:**



మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది



ఫలితం ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు

గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి

GK&E B82 86 TL

# దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!

ింపుకొని, మానవతామూర్తిని అన్వేషించు కొంటూ వచ్చాను నేను. కనుక వుద్రేక పడ కూడదు. రాక్షసత్వాన్నిసైతం క్షమించగలగాలి'' అని అనుకున్నాడతను. వెళ్తున్న పోర్టరును చూచి జాలిగా నవ్వుకొంటూ బల్లమీదినుంచి లేచాడు. స్టేషను బయటికొచ్చాడు

వర్షంజల్లు అతనికి హాయిగా వుంది!

* * *

కలసి రాని కాలంవస్తే చిన్న పురికొస ముక్క కాలసర్పమై కాటువేస్తుందంటారు. పది రోజుల్క్రితం పట్టాభి విషయంలో అలాగే జరిగింది

భగవంతుడిపట్ల విశ్వాసంతప్ప పట్టాభికి అన్నీ వున్నాయి. చదువు, అందం, ఆరోగ్యం, ఆస్తి, వుద్యోగం, మంచిమనసు కొత్తగా ఏర్పాటు చేసుకొన్న సంసారం .. అన్నీ వున్నాయి

అయితే ఆ రోజు తల్లి ఆరోగ్యం బాగా లేదని తెలిసిన అతనికి సర్వం శూన్యమన్న భావన కలిగిందెందుకో. అన్నీ వుండి ఏమీ లేనివాడి నయ్యానే అని విచారించాడు. అన్నం సహించ లేదు. నిద్రపట్టలేదు జ్వరం వచ్చినట్లయింది. తెల్లారేసరికి మనసు, శరీరం రెండూ వ్యాకులంతో నీరసం చెందేయి

భార్యతోసహా వూరికి వెళ్ళాలనుకున్నాడు వీలుకాలేదు తల్లిని చూడటానికి ఎంతో ఆత్రంతో వొంటరిగా బయలుదేరేడు

అసలే ఆ సంవత్సరం ఎండలు విపరీతంగా వున్నాయి అందులోనూ రోహిణికార్తె అది. వడ గాల్పులు రైలుస్టేషనుకు చేరేసరికి మానసికంగానూ, శరీరకంగానూ మరింత నీరసించిపోయాడు.

టిక్కెట్టు సరిగానే తీసుకొన్నాడు. కానీ వొక బండి ఎక్కాల్సింది మరో బండి ఎక్కేడు ఆ పొరపాటును తెల్సుకొనేసరికే అతను రాంగ్ రూట్‌లో చాలా దూరం వచ్చేసేడు

'ఛీ ఛీ నేనింతగా అప్‌సెట్ అయ్యానేం? మనసు కంట్రోల్‌లో లేకపోతే బుద్ధి, దానితో పాటు శరీరం కంట్రోల్‌లో వుండవు' అనుకుని అతను మనసును కంట్రోల్‌లోకి తెచ్చుకొన్నాడు తోటి ప్యాసెంజర్స్‌ను విచారించి, రాబోయే స్టేషనులో దిగితే తిరిగి వెళ్లటానికి బండి వుంటుందని తెలుసుకొన్నాడు.

రైలు దిగబోతుంటే శరీరం తూలింది, నీరసంవల్ల. అప్పుడు ఆకలిదప్పులు గుర్తు కొచ్చాయి అతనికి

''పిన్నీ, ఆస్పత్రిలో చేరగానే ఉత్తరం రాయి''

పట్టాభిరావ్ వెనక్కితిరిగి చూచాడు. వొక యువతి ఎవరో నడివయసు ఆమెని బండి ఎక్కించి చెప్తున్నది.

# ఆకలి దప్పులు

మిట్టమధ్యాహ్నం. సూర్యుడు నిప్పుల్ని చెరుగుతున్నాడు

బండి కూతవేసి కదిలిపోయింది ఏయస్సెమ్ వెనుక పట్టాభిరావ్ అతని గదిలోకి నడిచేడు. వెళ్లటానికి బండిని గురించి వాకబు చేసేడు. ఆ బండి నాలుగు గంటలు లేటు.

అతను ఆ కబురు వింటూనే కృంగి పోయాడు. ఆకలిదప్పులు అతనిమీదికి దండ యాత్ర చేసేయి

స్టేషన్ మాస్టర్‌కి అతని ధోరణి, వేషం అనుమానాస్పదంగా కన్పించినట్లుంది పరీక్షగా చూస్తున్నాడు. పట్టాభిరావ్ తనని తాను పరిచయం చేసుకొన్నాడు జరిగిన పొరపాటు చెప్పేడు టిక్కెట్ యిచ్చాడు

''సర్. నా పొరపాటును క్షమించమని అడగను. కానీ దాన్ని సరిదిద్దుకొనే ముందుగా నాకో సాయం చేయండి నాకు ఆకలి వేస్తున్నది అంతకన్నా దప్పిక వేస్తున్నది ముందు వో గ్లాసు మంచినీళ్లు యిప్పిస్తారా?'' గదిలో వో మూల వున్న కుండను చూస్తూ అడిగేడు.

''వెంకన్నా యిటు రావోయ్ తొందరగా డియమ్ గారొచ్చారు. కాదు కాదు రైల్వే మినిస్టరులాగే వున్నారు చల్లటి మంచినీళ్లు, ఆ తర్వాత డీలక్సు భోజనం, విశ్రాంతికి ఏ సి రూమ్, యింకా ''

ఏయస్సెమ్ విజృంభించాడు. వ్యంగ్యాలు, వెటకారాలు . నవ్వులు .

పట్టాభిరావ్‌కి కోపం వచ్చింది కానీ తను నేరస్థుడు. పొరపాటునే చేసినా నేరం నేరం కాకపోదు కదా? ముందు ఆ దోషాన్ని పోగొట్టు కోవాలి. పెనాల్టీ చెల్లించాలి.

జేబులో చెయ్యి పెట్టేడు తేలుకుట్టినట్లు వులిక్కిపడ్డాడు

దెబ్బమీద దెబ్బ! ఎవరో జేబుకొట్టేసేడు

అయితే టిక్కెట్టు కొన్నాక మిగిలిన డబ్బును టిక్కెట్టుతోపాటు షర్టు జేబులో వేసినట్టు గుర్తొచ్చింది అతనికి ఆ డబ్బు తీసి బల్లమీద పోసేడు. అవసరమైతే చేతిగడియారం, వుంగరం

''చాల్లేవయ్యా వేషాలు. మాకేం ముష్టి యిస్తున్నావా? పెనాల్టీతో యీ డబ్బేం చాలు తుంది? వెళ్లు వెళ్లు... నేను మంచివాడిని కనుక వదిలేస్తున్నా యింకొకరైతే ఆ చేతి గడియారం, వేలికున్న ఆ వుంగరం, బట్టలు విప్పతీసి లాక్కొని పంపించేవారు మా దగ్గర వేషాలెయ్యకు. నీలా వేషాలేసేవాళ్లు మా కెంత మందో? వెంకన్నా. అవసరమైతే పిలుపు యింటికెళ్తున్నా'' ఏయస్సెమ్ వెళ్లిపోయాడు

వెంకన్న టేబిల్‌మీద వున్న చిల్లర డబ్బులు జేబులో వేసుకొన్నాడు. ''ఏం బాబూ! మంచి నీళ్లు కావాలా? నేనో గళ్లాసు యిత్తలెండి కానీ యిదొట్టి ఎదవ టేసను టేసనే ఏంది? వూరే ఎదవది యీడకి వూరు మూడు మైళ్ళ దూరం. వూళ్లోనే నీటిచుక్క పుట్టదు యీడ ''

పోర్టరు మాటలు విన్పించలేదు పట్టాభిరావ్‌కు. ఆకలి అంతకన్నా మించి దప్పిక .. నీరసం కళ్లు తిరుగుతున్నాయి

పోర్టరు యిచ్చిన గ్లాసు అందుకొని ఆబగా మంచినీళ్లు తాగేడు కడుపులో గలబరించి నట్లయింది వాంతి చేసేసుకున్నాడు

''ఛీఛీ వున్నేనికిపోతే పాపం ఎదురయిం దంట ఏదో నోరు తెర్సి అడిగేవుకదాని నీళ్లిస్తే యీడనే వోంతి సేసుకొంటావా? నీ అమ్మ మొగుడెవరిప్పుడు శుబ్బరం సేత్తడు? ఛీఛీ... ఎల్లెల్లు . మళ్లీ యిటుకేసి రాకు '' పోర్టరు చిరాకుపడ్డాడు

పట్టాభిరావ్ అన్నీ వుండీ ఆ క్షణంలో అసహాయుడు

మెల్లగా లేచాడు ఎలా ఆ బల్లవద్దకు చేరుకొన్నాడో?

దానిమీద కూలబడిపోయాడు

మగతగా కళ్లు మూతలు పడిపోతుండగా వో రూపం అతని కళ్లముందు తళుక్కుమని మెరిసింది

* * *

''బాబుగోరూ ''

అతను నీరసంగా కళ్లు తెర్చేడు మళ్లీ వళ్లంతా చెమటలు పడుకొన్న బల్ల వేడిగా వుంది

''వడదెబ్బ తగిలినట్లుంది బాబుగోరూ యీ అన్నంముద్దలు రెండు తిని మంచినీళ్లు తాగండి తగ్గిపోతుంది''

ఆమెవైపు చూచాడతను రైలు దిగుతుం డగా కన్పించిన అమ్మాయి

పెద్ద అందగత్తేంకాదు కాని యవ్వనంలో వుంది

''సూడబోతే మీరు గొప్పోరులాగున్నారు మీలాంటోళ్లు తినే అన్నం కాకపోవచ్చు కానీ. ''

## లోకం పోకడ

గోవు మెతగ్గా ఉన్నంతకాలం
గడ్డి పెట్టి
పాలు – వీలైతే రక్తం
పితుక్కుంటారు.

కొమ్ము విసిరినా
కాలు కదిపినా
భయంతో ప్రణమిల్లుతారు

— డా॥ ఆర్వీయస్. సుందరం

అసహాయ స్థితిలోవున్న తనలో గొప్పతనాన్ని చూచిందీమె. వాళ్లు దొంగను, మోసగాడిని చూచారు! ఎంత దృష్టిభేదం?

"అదేం కాదమ్మా. కానీ పాపం నువ్వు తెచ్చుకున్న అన్నం కాస్తా నాకు పెడ్తే నీకెలా?"

"బలేవారే యిదా మీ బయం? నాకేం పర్వాలేదు తీసి తొందరగా తినండి"

అతను ఎంత వద్దన్నా ఆమె వినలేదు చివరికి అతడిని తన చేతులో లేపింది అన్నాన్ని తినిపించింది ఆ తర్వాత నీళ్లు త్రాగించింది

"పొద్దుటినుంచి మీరేం తినలేదు వడదెబ్బ కొట్టింది పొరగడుపున నీళ్లు తాగితే ఏమవుతుంది?"

ఆమె అన్నట్లు అది అతను ఎప్పుడూ చేయని భోజనం అలాంటి తిండి కొందరు మనుష్యులు తింటారనికూడా అతనికి తెలియదు

కానీ అతనికా క్షణంలో అది అమృత సమానం

తనని బ్రతికించిన ఆ దేవత ఋణం తానెలా తీర్చుకొనగలడు? ఆమె పెట్టిన అమృతతుల్యమైన ఆహారానికి ఎలా వెల గట్టగలడు?

అతను పెళ్లి వుంగరాన్ని వేలినుంచి తీయబోయాడు.

ఆమె అతని భావనను గ్రహించినట్లు అతని చేయి పట్టుకొంది

"బాబూ అన్నం అమ్ముకొనే వృత్తి కాదు నాది చావుబ్రతుకుల్లో వున్న మనిషికి యింత అన్నం, నీరు యిచ్చి ఆదుకోటంకూడా పెద్ద గొప్పా? మీ కలవరింతలనిబట్టి మీ కథ కొంత తెల్సుకొన్నాను ఆ భగవంతుడు మీ అమ్మగారిని చల్లగా కాపాడేవుంటాడు చింతలేకుండా వెళ్లండి యిదిగో టిక్కెట్టు— మీరు వెళ్లాల్సిన వూరికే తీసుకొన్నా నా పేరు సూరి. ఎవరి నడిగినా చెప్తారు ఎప్పుడైనా మళ్లీ వస్తే"

టిక్కెట్టు అతని చేతిలో వుంచి ఆమె వెళ్లిపోయింది

ఇది కలా? నిజమా? సాక్షాత్తు అన్నపూర్ణ తనకు ప్రత్యక్షమవలేదు కదా? యిలాంటివాళ్లు యింకా ప్రపంచంలో వున్నారా?

యిల్లు చేరుకొన్నాడు ఆమె చెప్పినట్లే తల్లి కులాసాగా వుంది

తండ్రి, పట్టాభిరామ్ చెప్పిందంతా విని ఆనందంతో నవ్వేడు

"ఒరేయ్ పట్టాభీ అన్నీ మన మంచికే జరుగుతాయంటారు పెద్దలు నీకు జరిగిన యీ చేదు అనుభవంలో ఎంత అమృతం వుందో చూడు! భగవంతుడిని విశ్వసించని నీ నోటి నుంచి 'దేవత' లాంటి పదాలొస్తున్నాయి కారణం ఆలోచించు మంచి పనులకు భగవంతుడు ప్రతీక భగవంతుడు వున్నాడో లేడో! కాని వున్నాడన్న విశ్వాసం వల్ల స్వార్థపరుడైన మనిషి మంచిపనులు కొన్నన్నా చేస్తాడు ఆమెను దేవతంటున్నావ్ బాగుంది. కానీ అలా అని ఆ పేదరాలి నుంచి సాయం పొంది వూరుకోటం మంచిది కాదుకదా?"

"ఏం చెయ్యను నాన్నగారూ? వుంగరం యివ్వబోతే..."

"గుప్పెడు వుప్పు యిచ్చి కడివెడు తేనె తీసుకొనే వారి లాంటి మనిషి కాదురా ఆమె! అలాంటి మనుష్యులకు వారి అవసరం కనిపెట్టి మనం సాయం చేయాలి"

తండ్రి సూచన పట్టాభిరామ్‌కి నచ్చింది ఆమెను తిరిగి ఒకసారి చూడాలన్న కోరిక కలిగింది.

ఆరోజు తళుక్కునమెరిసి మాయమైపోయింది కానీ యీరోజు అలా కాదు, కాకూడదు

ఆలోచనలో వుండి నడుస్తున్న పట్టాభి వర్షం ఉధృతం కావటాన్ని గమనించలేదు అతను వూరు చేరేసరికి బాగా తడిసిపోయాడు

"యిదిగో బాబూ, సూరి అనే ఆమె ఇల్లెక్కడ?" ఊర్లోకి ప్రవేశించగానే కన్పించిన వో పదహారేళ్ల కుర్రాడిని అడిగాడు.

ఆ కుర్రాడు పట్టాభి వైపు వో క్షణం చూచాడు

"సూరేకారం ముండ యిల్లా? అదుగో అదే-" అంటూ ఆ కుర్రాడు వేలుపెట్టి వో యిల్లు చూపి పరుగెత్తుకొంటూ ఎటో వెళ్లాడు

వర్షం తగ్గుమొహం పట్టింది ఒక్కొక్క బొట్టు పడ్తోంది. పట్టాభిరామ్ ఆ యింటి వద్ద కెళ్లాడు రెండు గదుల చిన్న పెంకుటిల్లు అది ముందు చిన్న పంచ లాంటిది వుంది

అతను తలుపు తట్టబోయి ఆగేడు.

తనని ఆమె గుర్తుపడ్తుందా? గుర్తుపడ్తే ఏంచేస్తుంది? యిలా వర్షం కురుస్తున్న రాత్రి వచ్చినందుకు తప్పుగా భావించదు గదా? అది తన పొరపాటు కాదు బండి లేటుకావటం వల్ల జరిగిన పొరపాటు

"సూరీ, యీ రాత్రంతా హాయిగా యిక్కడే వుండిపోదామని వుందే. కానీ యింటి దగ్గర మా ఆవిడకు అసలే అనుమానంగా వుంది యిక వెళ్లొస్తానే"

లోపలి నుంచి వచ్చిన ఆ మాటలని విన్న పట్టాభి చేతులు ఆగేయి

"ప్రెసిడెంట్‌గారూ, మా పిన్నమ్మ వుత్తరం రాసింది అర్జంటుగా డబ్బు కావాలిట వో వందరూపాయలివ్వరూ?"

సూరి గొంతే. దీనంగా అడుగుతోంది

"ఏమిటేవ్? కళ్లు నెత్తిమీదికొచ్చాయా ఏమిటి? నా దగ్గర డబ్బు అడిగేదాకా వచ్చావ్? నే నెవరనుకొన్నావే? యీ వూరికి మకుటంలేని రాజునే నీలాంటి దాని దగ్గరికి నాలాంటి వాడు రావటమే నీకు గొప్ప అదృష్టం డబ్బిచ్చి సుఖాన్ని కొనుక్కోడల్చుకోవాలనుకొంటే నేను నీ దగ్గరికి రావాలా ఏమిటీ! బస్తీలో లక్షమంది వున్నారు అందరిలాగే నేనూ డబ్బిస్తే నా గొప్పతనం ఏమిటి? యింకెప్పుడూ అలాంటి తప్పుడు ఆలోచనలు చేయకు యీ వూళ్లో నీకు మంచినీళ్లు పుట్టకుండా చేసెయ్యగలను!"

"అదికాదు ప్రెసిడెంట్‌గారూ ...

"ఛస్ యింకేం చెప్పకు నాకు డబ్బుకన్నా విలువ ముఖ్యమే నీకు డబ్బిస్తే నా విలువ తరిగిపోతుంది నేను నీ దగ్గరికి రావటం మానేస్తే నీ విలువ పడిపోతుంది కనుక మన యిద్దరి విలువలు నిలవ్వాలంటే నువ్వలాంటి పిచ్చికోరికలు కోరకూడదు తెల్సిందా?"

హఠాత్తుగా తలుపు తెర్చుకొంది యాభైఏళ్ల వో బట్టతల వ్యక్తి హుందాగా బయటి కొచ్చాడు పట్టాభిరామ్‌ని చూచాడు

"బయట వూళ్లనుంచి కూడా పాసెంజర్స్‌ను సంపాదిస్తున్నట్లున్నావు గదే సూరీ? యింకా



ఎందుకు ఆ బీద అరుపులు? యీ కొత్త మనిషి విషయం చూడు'' అంటూ బట్టతల వ్యక్తి వెళ్లిపోయాడు.

''లోపలికి రండి ''

దేవత ఆహ్వానిస్తోంది అడుగు ముందుకు పడదేం ? స్వర్గం నుంచి నరకానికి, వెలుగులో నుంచి చీకట్లోకి, ఉన్నత శిఖరం నుంచి అగాధం లోకి ..

తను దేవతగా భావించిన వ్యక్తి నిజరూపం యిదా ? యీ రూపాన్ని చూడటానికా తానొచ్చింది? కానీ

డబ్బుకోసం శరీరాన్ని అమ్ముకొనే మనిషి, తనారోజు వుంగరం యివ్వబోతే ఎందుకు వద్దన్నది ? ఏ ప్రత్యుపకారాన్ని ఆశించి తనకి టిక్కెట్టు కూడా కొనిచ్చి పంపింది ?

మళ్లీ తను యిలా వస్తే వ్యక్తితో సహ గుంజాదామనా ?

''అలా వాకిట్లో నిలబడితే బాగుండదండీ మీరెవరో క్రొత్తవారిలా వున్నారీవూరికి? తలుపేసి లోపలికి రండి.''

పట్టాభి ఆలోచించే అడుగు ముందు కేసేడు !

ఆమె ! ఆమే ! కానీ ఆమె తనని గుర్తు పట్టినట్లు లేదే ?

''ఏమిటలా చూస్తారు ? కొత్తలావుంది కదూ ? ఏ వూరు ?''

''నా వివరాలు ముఖ్యమా ?''

ఆమె నవ్వింది ''కాదు. శరీరాన్నిఅమ్ముకొనే దాన్ని డబ్బే ముఖ్యం జేబులో వందరూపాయి లున్నాయా ?''

వంద ! ఆమె వెల ఎందరూపాయలు! ఏమి డీవేల్యుయేషన్ ?

ఆమె అవసరం వందరూపాయలు ఆ డబ్బిచ్చి తను ఋణ విముక్తుడు కావచ్చు కానీ

''అంత డబ్బా? వొక్కర్రాత్రికి? బస్తీలోనే అంత రేటుండదే?'' అతను కావాలనే విల్లంబుల్లా ఆ మాటల్ని వదిలేడు

''అయితే అక్కడికే వెళ్లకపోయావ్ ? యిక్కడికెందుకొచ్చావ్ ? లోకువగా దొరుకు తాననా ? ఛీ .మనుష్యులందరూ వొక్కటే ఆశ పోతులు.'' కోపంగా అందామె ఆ కోపం వెనుక మన్న ఆవేదనను గుర్తించాడతను

''అందర్నీ వొకే గాటిన కట్టేయకండి పురుషుల్లో కూడా స్వార్థరహితులు వుండకపోరు— స్త్రీలలో మీలాగా !''

ఆమె చివ్వున తల ఎత్తి అతని వైపు చూచింది

''నన్ను మీరు నిజంగా గుర్తించలేదా ?'' అంటూ తనెవరో చెప్పుకొన్నాడతను.

''ఓ ! మీరా ! గుర్తు పట్టలేక పోయాను

# ఆకలి దప్పులు

ఆ రోజు వడదెబ్బ గొట్టి వాడిపోయివున్నారు. యీ రోజు వర్షంలో తడిసి వచ్చిగా వున్నారు అసలు మళ్లీ ఎందుకొచ్చారు మా వూరు? ఇందుకేనా ?''

ఎందుకు ? ఎందుకో ఆమెకిప్పుడు ఎలా చెప్పటం ?

ఆమె అతనివైపు వో క్షణం అలాగే చూచింది నవ్వింది

''ఆకలి దప్పికలతో వచ్చినట్లున్నారు మళ్లీ ! అవునా ?'' అతను కావాలనే జవాబివ్వలేదు

''అయితే ఆ రోజు ఆకలిదప్పికలువేరు యీ రోజు ఆకలిదప్పికలు వేరు అన్నం తిని బలిసిన మనిషికి వచ్చే ఆకలిదప్పికయిది నీటిని తీర్చటానికి అడిగిన డబ్బు యిచ్చితీరాల్సిందే దీనం వుంచనా ? ఆర్పేయనా ?''

''మనిషన్నవాడు తన వెలుగునేకాక

## అంధుల బృందావనం

అంధులకోసం పశ్చిమజర్మనీ రాజధాని బాన్ నగరంలో ఒక బృందావనాన్ని తయారుచేశారు ఈ తోటలో రకరకాల పూలమొక్కలు, నీటిఫౌంటెన్లు ఉన్నాయి. ఈ మొక్కల పేర్లు అంధులకు తెలియ టానికి బ్రెయిలీ లిపిలో వ్రాసి ఉంచారు అంధులు ఈ పూవుల పరిమాళాలను పీల్చి, చేతితో తడిమి ఆ మొక్కల పేర్లను తెలుసుకుంటారు ఈ తోటను 'సెంట్ అండ్ టచ్ గార్డెన్' అని పిలుస్తారు ఈ తోట మధ్యలో ఏనుగు కాంస్య విగ్రహం ఉన్నది దీనిని ఒక అంధుడు బహూకరిం చాడు. బాన్ నగరంలోని అంధుల సమాజం, నగర అధికారులు కలిసి దీనిని రూపొందించారు

యితరుల వెలుగునికూడా కాంక్షించాలి నీ యింట్లో వెలుగు అసలే మసక మసకగా వుంది ఆ గుడ్డి వెలుగును కొండెక్కించమంటానా ? నాకు వెలుగంటేనే యిష్టం''.

''ఓహో ! చీకటి పనుల్నికూడా యీ మధ్య చాలామంది వెలుగులోనే చేస్తున్నారటలే పోనీ తలుపు గడియన్నా వేసేరా ? పొరుగూరి మగకుక్కలంటే యీవూరి మగకుక్కలకి అసలే కోపం వాసన పసిగడ్తే కొన్ని అరుస్తాయి మరికొన్ని కరుస్తాయి ''

''కుక్కల విషయం తర్వాత ముందు మనుష్యుల విషయం మాట్లాడుకొందాం ఆ రోజు నా ఆకలిదప్పికలను తీర్చినందుకు బంగారు వుంగరం యివ్వబోతే వద్దన్నారు టిక్కెట్టు కొనిచ్చి పంపేరు కానీ యీ రోజున ఆకలి దప్పికలను తీర్చటానికి నిక్కచ్చిగా డబ్బు అడుగు తున్నారు ఎందుకు ?''

''ఎందుకంటే — అది మానవధర్మం యిది నా వృత్తి ధర్మం ''

ఓ ! ఎంత సహజంగా చెప్పిందా మాటల్ని? గుండె గర్భంలోనుంచి వచ్చిన సత్యాలుకావూ ఆ మాటలు ?

''కాగా ఆ ఆకలి ప్రతి జీవికీ సహజం ఆ ఆకలితో మనిషిని ఎవర్నీ చావకుండా చూడటం మానవధర్మం ఆకలితో మనుష్యులు చచ్చే ఏ దేశం బాగుపడుతుంది ? యిక యీ ఆకలి ? యీ ఆకలికూడా ఋతుధర్మంగా పశువులు, పక్షులు, క్రిమికీటకాలక్కూడా వుంటుంది సంతానోత్పత్తికి మాత్రమే వుపయోగించుకోవా ల్సిన ఆకలి యిది మనిషికి మదమెక్కి,అదుపులో వుంచుకోవాల్సిన ఆ ఆకలిని పెంచుకొంటున్నాడు నాలాంటి ఆడవాళ్లు పొట్ట ఆకలితో చావకుండా వుంచటంకోసం ఛీ ఛీ వెధవ మనుష్యులు వెధవలోకం ''

చదువు సంస్కారాలు లేని వో పల్లెటూరి యువతి! ఊరుమ్మడి పతిత! యిలా మాట్లాడ గలగటం సంభవమా ? ఏమి పరిశీలన ? ఎంత ధార్మికదృష్టి? ఎన్నెన్ని చేదు అనుభవాల సారమో ఆ మాటలు ?

ఆమె వృత్తి ఏదవుతేనేం ? తనచుట్టూ వున్న రాక్షసగణంచేత ఆమె ఎంత హీనంగా చూడబడ్తేనేం ? ఆమె నిజంగా వున్నతురాలు

''కానీ, జీవితాన్ని, ఆ కళ్లను యింత చక్కగా అంచనా గట్టగలిగిన మీరు మీ విలువను సరిగా అంచనా వేసుకోలేరేమో ?''

ఆమె దిగులుగా నవ్వింది

''నిజమేనండీ నా అంచనా తప్పే నా విలువ వందరూపాయలు వుంటుందనుకోటం పొరపాటే నేనేం సినిమాల్లో నగ్గిస్తానా ? పెద్ద పెద్ద పట్టణాల్లో వుండే విలాస వతినా ? పల్లెటూరి ముండను యీవూరి మగవారి సొత్తును మగవారందరికీ ఉచితంగా సంతో షాన్ని పంచిపెట్టే మరబొమ్మను ఆకలిదప్పుల్ని తీర్చే ధర్మశాలను ''

''అహ అదికాదండీ నా వుద్దేశ్యం ''

''ఒక్క నేనేనేమిటి లెండి? ఆడవాళ్లంతా ఏదోవిధంగా మగవాళ్ల చేతుల్లో మరబొమ్మలే తమ విలువను తము అంచనా వేసుకొనే శక్తి ఆడదానికెక్కడవుంది? స్త్రీ విలువను అంచనా వేసేది—వెలగట్టేదీ మగవాళ్లేకదా? యీ వూరి ప్రెసిడెంట్‌గారు నాకో వెలగట్టేరు యీ వూరి వాళ్లందరూ వెలగట్టేరు. . మీరూ కట్టండి ఆనాడు మీ ఆకలి నెరిగి నేను తీర్చాను యీ నాడు మీ ఆకలిని మీరే తీర్చుకోండి.''

ఆమె మంచంమీద వెల్లికిలా పడుకొని కళ్లు మూసుకొంది.

పట్టాభిరామ్‌కు ఆమెపూర్తిగా ఆవిష్కృత మయింది

## ధర్మ పథం

బులుసు వెంకటరమణయ్య



# ధర్మపరీక్ష

"ధర్మో రక్షతి రక్షితః" అనే మాట అందరూ వినే ఉంటారు మనం ధర్మాన్ననుసరించి ప్రవర్తిస్తే ఆ ధర్మమే మనల్ని కాపాడుతుందని దీని అభిప్రాయం. మన ప్రాచీనులు ఆయా వర్గాల వారికి కొన్ని కొన్ని ధర్మాలు నిర్ణయించారు.

పూర్వకాలంలో ప్రజా ప్రభుత్వం లేదు ప్రభువులే ప్రజలను పాలించేవారు అప్పటి ప్రభువులు స్వార్ధపరులు కారు. ప్రజా క్షేమమే తమ క్షేమంగా భావించేవారు. ఆ పాలకులు 'రాజులు, క్షత్రియులు,' అనబడే వారు ప్రజలను రంజింపజేసేవారు రాజులు. ఎట్టి దెబ్బలకు లోనుగాకుండా ప్రజలను రక్షించేవారే క్షత్రియులు వారు తమ పేర్లకు తగినట్లుగానే ఉండేవారు స్వార్థాన్ని చూసుకునేవారు కారు

సూర్యవంశపురాజు దిలీపునికి చాలా కాలం వరకూ సంతానం లేదు — సంతాన ప్రాప్తికి తగిన ఉపాయం తెలుసుకొనుటకు ఆ రాజు తమ గురువైన వసిష్ఠుని వద్దకు — ఆయన ఆశ్రమానికి వెళ్లాడు కామధేనువు పుత్రిక నందినీధేనువు తన ఆశ్రమంలో ఉన్నదని, ఆ గోవును అనుసరించి తిరుగుతూ, దాని సేవచేస్తే సంతానం కలుగుతుందనీ ఆ మహర్షి చెప్పాడు దిలీపుడు, కొన్నాళ్ళ ఆశ్రమంలోనే ఉండి ఆ ధేనువు సేవలో నిమగ్నుడయేవాడు అది ఉదయం మేతకు అడవికిపోయి, సాయంత్రం ఆశ్రమానికి తిరిగి వచ్చేవరకూ దానివెంట నీడవలెనే ఉండి, ధనుర్బాణాలను ధరించి, అడవి మృగాల వల్ల దానికి అపాయం కలగకుండా కాపాడేవాడు

ఒకనాడా గోవు గంగా ప్రవాహానికి దగ్గరగా ఉన్న గుహప్రక్క లేత పచ్చికను మేస్తూ ఉండగా, దానిమీద ఒక సింహం పడి చంపడానికి చూచింది. దిలీపుడు వింట భాణాన్ని సంధించినా, కొట్టడానికి చెయ్యి కదలలేదు అప్పుడా సింహం "నేను సామాన్య మృగాన్ని కాను శివుని సేవకుడైన కుంభోదరుణ్ణి ఇక్కడి ఏనుగులు, ఈ ప్రక్కనున్న దేవదారు వృక్షాన్ని తమ చెక్కిళ్లతో రాచి, పట్ట ఊడగొట్టకుండా చూడడానికి ఆ దేవుడు నన్ను సింహంగా మార్చాడు ఈ చెట్టు పార్వతీదేవికి మిక్కిలి ప్రియమైనది కొడుకుతో సమానమైనది అందువల్లనే భద్రంగా కాపాడుతున్నాను. ఇక్కడికి వచ్చిన జంతువులే నాకు ఆహారం దాన్ని చంపి తినివేస్తాను నీవు దీనిని రక్షించదలిస్తే నీవే నాకు ఆహారం కావలసి వుంటుంది" అని మనుష్యుల వలె మాట్లాడి చెప్పింది. "అలాగైతే నన్ను తిని ఈ గోవును విడిచిపెట్టు" అని రాజన్నాడు "ఇది వసిష్ఠులవారి హోమధేనువు దీనిని రక్షించే బాధ్యత నాది" అని కూడా చెప్పాడు "ఓయీ! నీవు రాజావు చిన్నవాడవు ప్రజలను పాలించేవాడవు ఒక్క గోవు కోసం ప్రాణాలు విడుస్తావా? మహర్షికి ఇలాంటి గోవులను ఎన్నిటినైనా ఇవ్వగలవు" అని హితబోధ చేసింది కాని దిలీపుడు దాని మాట వినలేదు "తాను రక్షించవలసి వున్న ప్రాణిని రక్షించలేని రాజునకు రాజ్యమెందుకు? అపకీర్తితో కూడిన ప్రాణాలెందుకు? నా ప్రాణాలిచ్చి, ఈ గోవును రక్షించి తీరుతా" నని చావునకు సిద్ధపడ్డాడు కాని, సింహం వెంటనే మాయమయింది మహాప్రభావం గల నందినీధేనువు కల్పించిన మాయయేకాని, అది మరొకటి కాదు దిలీపుని రాజధర్మాన్ని పరీక్షించడానికే ఆ గోమతల్లి దీనిని కల్పించినది అతని ధర్మనిరతికి, తనయెడగల భక్తికీ చాలా సంతోషించినది ఆ నందినీధేనువు అనుగ్రహంవల్లనే అపుత్రకుడైన దిలీపునికి పుత్రప్రాప్తి కలిగింది

స్వధర్మాన్ని నిర్వహించేవారిని ఎట్టి ఆటంకాలూ తప్పుదారిని పట్టించలేవు వారి సంకల్పం నెరవేరడానికి ధర్మనిర్వహణే తోడ్పడుతుంది ★

---

ఆమె దేవతే దెయ్యమనుకొని భ్రమపడ్డాడు తానో క్షణం అయితే ఆమె మంచితనమే ఆమెకు ఈ లోకంలో శాపం అవుతోంది

"క్షమించండి మీకు విలువ కట్టగల శక్తి నాకు లేదు మంచితనానికి, మానవత్వానికి విలువెంత? దైవత్వానికి వెలగట్టటం సాధ్యమా? నాన్నగారు నేను చెప్పింది విని, మీ అవసరం కనిపెట్టి సాయంచేసి రమ్మని పంపేరు యీ క్షణంలో మీకు డబ్బు అవసరమని నాకు తెల్సు దయచేసి ఎంత కావాలో మీరు తీసుకోండి నేను వెళ్తున్నాను తలుపు తెర్చే వుంచుకొన్నాను" అతను కొన్ని నోట్లను ఆమె మంచంమీద వుంచి వెనక్కి తిరిగేడు

"అంటే అంటే నన్ను బిచ్చగత్తెను కూడా చేస్తారా? ఇన్నాళ్ళ శరీరాన్ని అమ్ముకోవాల్సిన దుర్గతికే విచారించేదాన్ని వద్దండీ ఆగండి" ఆమె చివాలున లేచివచ్చి అతని చేతిని పట్టుకొని ఆపింది అతని చేతిలో నోట్లు వుంచింది.

ఆకాశమంత మనిషి ఆమె! చిన్నపిడికిలిలో ఆమెను యిముడ్చాలనుకోటం పొరపాటేనేమో! కానీ?

"పొద్దుపోయింది భోజనం చేసి వెళ్ళండి సిద్ధంగానే వుంది"

అతని బుర్రలో వో ఆలోచన తళుక్కుమంది

"అలాగే నాకూ ఆకలిగానే వుంది కానీ ఒక్క షరతుకు ఒప్పుకొంటే రెండోసారి మీ ఆతిథ్యాన్ని స్వీకరిస్తాను"

"ఏమిటి?"

"యీ రొంపినుంచి మిమ్మల్ని బయటికి తీయటానికి నాకు అనుమతి నివ్వాలి మంచితనానికి, మానవత్వానికి విలువవున్న చోట మీరు వుండాలి స్త్రీకి వెలగట్టాల్సిన విధానం యిది కాదని మీరే నిరూపించాలి"

ఆమె అతని కోరికను కాదనలేదు అవునన లేదు

అదో విధంగా నవ్వింది

"ముందు భోజనం చెయ్యండి" అంటూ చెయ్యి పట్టుకొని అతడిని వంట గదిలోకి తీసుకెళ్ళిందామె ★




## ఎస్.ఎల్. – యలమంచిలి

నాకు 25 సం॥లు వివాహం కాలేదు 4 నెలల క్రితం వివాహం అయిన ఒకనితో సంబంధం ఏర్పడింది రెండునెలలై వైట్ డిస్చార్జి అవుతున్నది మర్మాయవముమీద విపరీతమైన దురదగా ఉంది డిస్చార్జి చెడువాసనగా ఉంది

★ ఆ డిస్చార్జిని, లేడీ డాక్టర్లు లేబొరేటరీకి పంపి పరీక్ష చేయిస్తారు రక్తపరీక్షకూడా చాలా అవసరం, ఫలితాల ననుసరించి చికిత్స చేయవలసి ఉంటుంది మీకు ఉన్న రోగం బహుశా గొనోరియా అయి ఉంటుంది

## వి. ఎ. – ప్రొద్దుటూరు

నాకు 32 సం॥లు నలుగురు పిల్లలు ఆపరేషన్ చేయించుకొన్నాను తరువాత కుడివైపుకి తిరిగి పడుకొంటే పొత్తికడుపులో నెప్పి ప్రారంభం అవుతుంది 4 సం॥ లయినా నెప్పి తగ్గలేదు మళ్ళీ ఆపరేషన్ చెయ్యాలంటున్నారు

★ వైద్యులు పరీక్షానంతరం ఆపరేషన్ చేయవలసి ఉంటుందన్నప్పుడు ఇక అంతకన్నా మార్గం లేదు కడుపులో హీమటోమా, అంటే నెత్తురు గడ్డకట్టటం గాని, ఆపరేషన్ చేసిన చోట కొన్ని పొరలు అతుక్కొని పోవటం గాని ఈ నెప్పికి కారణం అయి ఉండవచ్చును

## బి. ఎస్. ఆర్. – ఖమ్మం

రేచీకటి ఉన్న వాళ్ళు నిరంతరం కళ్ళజోడు ఉపయోగించవలెనా ? అలా వాడితే కొన్నాళ్ళకి జోడు సహాయం లేకుండా చూడగలరా ? కళ్ళజోడు లేకుండా దృష్టి లోపం సరిచేయటానికి వీలులేదా ?

★ మీరు వ్రాసిరిది రేచీకటేనా అని అనుమానం రేచీకటి అంటే వెలుతురు తక్కువగా ఉన్నప్పుడు చూపు సరిగా లేకపోవటం, ఇది ఎక్కువగా విటమిన్ 'ఎ' లోపం వల్ల వస్తుంది అరుదుగా "రెటినైటిస్ పిగ్మెంటోసా" వల్ల ఇలా వచ్చే అవకాశం ఉంటుంది ఈ విషయాన్ని నేత్ర వైద్యులు పరీక్షించి తీర్మానించవలసి ఉంటుంది కాంటాక్టు లెన్సుల వాడకం ద్వారా దృష్టిలోపాన్ని సరిచేసుకోవచ్చును




## టి. వి. పి. – ఆత్రేయపురం

నా వయస్సు 27 సం॥లు వివాహమై 6 సం॥లు అయింది సంతానం లేదు సెమెన్ అనాలిసిస్ చేయించాను స్పెర్మ్ కౌంట్‌నిల్ అని వచ్చింది జీవితంపై విరక్తి కలుగుతున్నది కృత్రిమ గర్భోత్పత్తికి మార్గాలున్నాయా ఎక్కడ చేస్తారు

★ ఆర్టిఫిషియల్ ఇన్సెమినేషన్ అనే పద్ధతివల్ల కృత్రిమంగా పిల్లలు పుట్టే అవకాశం ఉంటుంది మీరు నిపుణులైన లేడీ డాక్టర్లను కలిసి సంప్రదించండి మెడికల్ కాలేజీలతో చేరిన ఆస్పత్రులలో ఈ పద్ధతి సాధ్యమే !

## వి. ఎస్. – మధిర

నా వయస్సు 14 సం॥లు నాకు 1 సం॥ వయస్సు ఉన్నప్పుడు పోలియో జబ్బు వచ్చింది ఎన్ని ఆస్పత్రులు తిరిగినా ఎంత డబ్బు ఖర్చు చేసినా నయం కాలేదు నా కాళ్ళు వంకర తిరిగి పోయినాయి బాగా నెప్పిగా ఉంది ?

★ మీరు ఆర్థోపీడిక్ వైద్యులకీ, ఫిజియో తేరపిస్టులకీ చూపించండి కాళ్ళు వంకర తిరిగినప్పుడు ప్రత్యేక బూట్లు వాడీగాని, శస్త్రచికిత్సవల్లగాని నయంచేసే అవకాశం ఉంది

## కె. యు. – విశాఖపట్నం

నాకు 26 సం॥లు కావస్తున్నది పుట్టుకతోనే కుడికన్ను మెల్ల దీనివల్ల చాలా పరిహాసాల పాలవుతున్నాను బాగవుతుందా ఎక్కడ చేస్తారు

★ మీరు నిపుణులైన నేత్ర వైద్యులకి చూపించి కళ్ళజోడువాడటంవల్లగాని, ఎక్సర్‌సైజు వల్లగాని, ఆపరేషన్‌వల్లగాని ఈ లోపాన్ని సరిచేసుకోవచ్చును విశాఖపట్నం, హైద్రాబాదు, మద్రాసువంటిచోట్ల ఈ విధంగా నయం చేయటానికి వీలు ఉంటుంది

## యం. జె. – విజయవాడ

నా వయస్సు 28 సం॥లు వివాహం అయి 8 సం॥లు అయింది పెద్ద పాపకి 6 సం॥లు పెద్దపాప పుట్టినప్పటి నుండి తరచు వైట్ డిస్చార్జి అవుతున్నది ఒక్కోసారి తెలుపుగాను, ఒక్కోసారి నీరుగాను అవుతున్నది ఆ భాగంలో దురద, బాగా రుద్దితే మంటగాను ఉంటున్నది

★ మీరు లేడీ డాక్టర్ల దగ్గర చూపించుకొని ఆ వైట్ డిశ్చార్జిని మైక్రోస్కోప్‌లో పరీక్షింపచేసుకోవాలి ట్రైకోమోనాస్ వెజైనాలిస్ అనే క్రిమివల్ల వైట్ డిశ్చార్జి ఉంటే 'ఫ్లజైల్' మొదలయిన మందులను స్త్రీ, పురుషు లిరువురూ తీసుకోవలసి ఉంటుంది వైద్యుల సలహా మేరకు ఈ మందులు వాడాలి. ★

# అనాథ బాలుని అదృష్టం

యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలోని హాలీవుడ్ ప్రాంతంలోని వో రైలుపట్టాల వారగా నడుస్తున్న 18 ఏళ్ళ అనాథ బాలుడు ఎరిక్ డివైల్ట్‌కు వో సంచీడు వజ్రాలూ, వైఢూర్యాలూ, వగలూ దొరికాయట వాటి కిమ్మత్తు (మన లెక్కలో) ఒక కోటి రూపాయలట అతడా సొమ్మును పోలీసుస్టేషనుకు వప్పగించి రశీదు పొందాడట ఆనక ఆ సంచినాథుడెవరూరాక, ఫ్లారిడా చట్ట ప్రకారం ఆ సొమ్ము ప్రభుత్వమతనికే వప్పగించేసిందట ఆహా ఆ 18 ఏళ్ళ ఎరిక్‌డీవైల్డ్ గారు మనని పెంచుకుంటే బాగుణ్ణు—అతడనాథ కానక్కర్లేదప్పుడు

## పెన్షన్ పొందిన పోలీసు కుక్క !

ఇటలీకి చెందిన పోలీసు శాఖలో డాక్స్ అనే పోలీసు కుక్క తన సర్వీసులో 500 మంది నేరస్తులను పట్టుకుని అపారమైన సేవ చేసి 1961లో రిటైరయి పోయిందట ఆ కుక్కతో పాటు దానిని తరిఫీదిచ్చి, దానితోనే వున్న సార్జంట్ మేజర్ గియోవని మయియోన్ కూడా రిటైరయి, తనతోపాటు ఆ కుక్కకి కూడా పెన్షన్ వగైరాలివ్వమంటే అధికారులు బృంద గానంగా నవ్వేశారట దాంతో ఆ మయియోను కోపం వచ్చి కోర్టుకు వెళ్ళాడట అక్కణ్ణుంచి ఒక్కో పెద్ద కోర్టుకూ వెళుతూ 18 సంవత్సరాలు నడిచిన ఆ కేసుతో ది రోమ్ కోర్ట్ ఆఫ్ అప్పీల్స్ వరకూ వెళ్ళి [మన సుప్రీం కోర్టు లాంటిది] కేసు గెలిచాడట






## టెలివిజనులో వేలం పాట !

ఇటలీలోని కొన్ని వేలంపాట నిలయాలలోని వేలం వస్తువులు పాటపాడే వారు తమ యిళ్ళలోంచే చూడ వీలుగా టెలివిజనులో చూపుతారట తమ యిళ్ళలోని టెలివిజనులో చూసి, ఫోనులో వీరు పాట పాడచ్చుట అయితే యీ వ్యాపారం కొంచెం మోతాదు మించేసరి కక్కడి ప్రభుత్వానికి అనుమానం పుట్టి పరిశోధించేసరికి యీ వేలం నిలయాలలో నిలబెట్టిన వస్తువులలో చాలా భాగం దొంగ వస్తువులట చోరవిద్యా నిపుణులైన వారి ప్రాపుతో యీ నిలయాలు నడుస్తున్నాయట - ఏ దేశమైనా, ఏ రాష్ట్రమైనా మనిషి మనిషే కదా !

## మద్యం బుడ్ల మాయ గర్భిణి !

ఇరాన్‌దేశం నుంచి బొంబాయికి వచ్చిన ఓడలో దిగిన 35 ఏళ్ళ ద్రౌపది గణపత్ అనే ఆమె పూర్ణ గర్భిణిట కస్టమ్స్ పరిశోధన గదిలో ఆమెను గమ్మున చెక్‌చేసి గమ్మునెళ్ళండమ్మా అని పంపేశారట అమ్మో, అబ్బో అనుకుంటూ ఆమె టాక్సీకోసం చూస్తూండగా ఆమెనో కస్టమ్స్ అధికారిచూసి, యీవిడ నిండు చూలాలులాలేదే, చూపులూ అలా లేవే అనను మానించి, మళ్ళీ సెల్‌కు పిలిపించి ఆడ అధికారిణులతో ఆవిడను చెక్‌చేయిస్తే అతి ఖరీదయిన విదేశీ మధ్యపానపు సీసాలో ఎనిమిది ప్రసవించిందటామె ఆ బుడ్లు ఆమె తన పొట్టకు పొదివి కట్టుకుందట

## బొమ్మ పిస్తోలుతో బస్సు దోపిడి !

ప్రొద్దటూరు పొద్దు పొడిచేలోగా చేరుకోవాలని పరుగులు తీస్తున్న ఎ.పి.యస్ ఆర్ టి సి. వారి బస్సును గుంటూరు జిల్లా పట్లూరిపాలెం అనే గ్రామం వద్ద ఆ బస్సులోని వో ప్యాసింజరు హాల్టాన్ అని పొలికేక వేసి జేబులోంచి పిస్టలు తీసి డ్రయివరకు గురిపెట్టాడట వెంటనే ప్రయాణికులలో చేరి ప్రయాణీకులుగా వస్తున్న ఆరుగురు వో మురాదారులు తమ నిజస్వరూపాలు చూపిస్తూ చకచక నగా, నట్రా, వాచీ గట్రాలు 54 వేల కిమ్మత్తు వసూలు చేసి అంతర్ధానమైపోయారట. ఇంతకీ డ్రయివరును భయపెట్టిన పిస్టలు దీపావళి పిస్టలు టైపుట.

## ఆడసిపాయిల అగచాట్లు !

ఇజ్రేల్ ఆరమ్డ్ ఫోర్సెస్‌కు చెందిన స్త్రీల విభాగంలోని ఆడ సిపాయిలు తమ మానంతోటి మగసిపాయిల నుంచి కాపాడుకోడం చాలా కష్టంగా వుందనీ, వారి చూపుల ఆకలికి వొళ్ళంతా ఛిమచిమలాడిపోతూన్నదనీ అధికారులకు ఫిర్యాదు చేస్తే వారుకూడా ఆ జాతి చూపే చూసి, అవునని తల తాటించి ఆ ఆడవారికి ఆత్మరక్షణార్థం భాష్పవాయువు కలిగిన చిన్న ఫ్లాస్కు సైజు సిలెండరులు యిచ్చి, మీమీద కెవడైనా వస్తే యిది వాడిమీదకి స్ప్రే చేసి, మీ మానం కాపాడుకోండి అన్నారట




## లేడిపిల్లకు కుక్కకాటు !

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖామాత్యులు అత్యంత గౌరవనీయులైన పి ఆనందగజపతి రాజులుంగారు ముద్దుగా పెంచుకుంటున్న లేడి పిల్లను అదే శ్రద్ధతో పెంచుకుంటున్నా కుక్క కరిచే సరికాయనే హుటా హుటి హైద్రాబాదు నీలోఫెర్ ఆసుపత్రికి తీసుకువెళ్ళి వైద్యం చేయమంటే ఆ వైద్యులు నిలువుగుడ్లువేసి తాము జంతు వైద్యవేత్తలు కామని మనవి చేశారట దానికి రాజుగారు ఉగ్రులై ఆసుపత్రి గజగజలాడేలా రంకెలు వేసి పేషెంట్ల గుండె లాగేలా హడావుడి చేశారట ఇంతలో ఆ లేడి చచ్చిపోయిందట— చదువరీ లేడి అంటే లేడీ కాదు. జింక జింకే సుమీ !. ★

25

సీరియల్:

# గోరంతదీపం

—వింధ్యవాసిని

(గత సంచిక తరువాయి)

పరశురాం తన మనసులో మాట ఎవరిదగ్గిరా బయట పెట్టలేదు. ఈ మధ్యలో హరి తమ ఇంటికి ఎప్పుడొచ్చినా, కరుణతో సమానంగా అరుణా కూర్చుని స్నేహంగా మాట్లాడటం గమనించాడు. అందుకని ముందుగా అరుణనేమీ అడగనవసరంలేదు. హరితో 'సరే' అనిపించుకున్నాకనే చెప్పేయవచ్చు ఒకేసారి అనుకున్నాడు.

ఏ పని చేయాలన్నా, ఏ నిర్ణయం తీసుకోవాలన్నా ముందుగా విశ్వానికి చెప్పటం, అతడి సలహా తీసుకోవటం తనకి అలవాటు ఆ అలవాటు ప్రకారమే, ఆవేళ మధ్యాహ్నం విశ్వానికి ఫోన్ చేశాడు. ఆ వేళ సాయంత్రం హరిప్రసాద్‌తో మాట్లాడెయ్యాలి ఏమయినాసరే అనిపించి అందుకే మధ్యాహ్నం విశ్వం బిజీగా ఉంటాడని రమ్మని పిలవకుండా, ఫోన్ చేసి మాట్లాడేడు

"హరిప్రసాద్ గురించి నీ అభిప్రాయం ఏమిటి ?" అనడిగాడు, విషయాన్ని ఎలా మొదలు పెట్టాలో అర్థంకాక.

"ఏమిట్రా ఇవాళ కొత్తగా అడుగుతున్నావ్ ? అతను ఇన్నేళ్లయి మన్దగ్గిర పని చేస్తున్నాడు కష్టపడి పనిచేస్తాడు. తెలివయిన వాడు. మంచి రచయిత కూడా ఇంకేమి చెప్పాలి ."

"అవన్నీకాదు విశ్వం. అతనికి అరుణ నిచ్చి చేస్తే ఎలా వుంటుంది ?"

"బ్రహ్మాండంగా వుంటుంది." అన్నాడు విశ్వమూర్తి నిదానంగా ఏదో ఆలోచిస్తూ. హరి, రమణల మధ్య ఏర్పడిన స్నేహం అతని దృష్టిని తప్పించుకోలేదు ఇద్దరూ ఏది చేసినా బాగా ఆలోచించి చేసేవారు, హద్దులు మీరకుండా ప్రవర్తించేవారు కావటం వల్ల, ఆయనేమీ జోక్యం కలిగించుకోలేదు ఆ విషయంలో వాళ్లలో ఎవరో ఒకరు తామే ఆ ప్రసక్తి తెచ్చి, పెళ్లికి పర్మిషన్ అడుగుతారని వేచి చూస్తున్నాడు కానీ వాళ్లిద్దరూ ఏమీ బయట పడకుండానే, తానేమని చెప్పటం పరశురాంతో ! అందుకే, తటస్థంగా, "అతన్నే అడిగెయ్" అని సలహా ఇచ్చాడు

విశ్వం మాటలతో కొంత ఉత్సాహం కలిగింది పరశురాంకి.

"సాయంత్రం ఒకసారి అతన్ని నా దగ్గరికి పంపించు" అని చెప్పాడు.

నాలుగింటికి వొచ్చాడు హరిప్రసాద్ ఎప్పటిలా ముందుగదిలో టైప్ చేస్తూ ఉంది శ్యామల. 'హలో' అనగానే, "హలో, మీరా నమస్తే సార్" అంది చిరునవ్వుతో

"నన్ను సార్ అనొద్దని, మీకెన్నిసార్లు చెప్పాను శ్యామలగారూ! ఊరికే ఆట పట్టిస్తారు గదూ ?" అడిగాడు తెచ్చిపెట్టుకున్న కోపంతో

"అదేమిటండి, మీ పొజిషన్‌లో ఉన్న వారెవరయినా కోరి మరీ మర్యాద పుచ్చుకుంటారు. మరి మీరేమో ఇచ్చినా వద్దంటున్నారు"

"అందరతా నాకు తెలీదు, ఎప్పటిలా 'హరి' అని పిలవండి చాలు" అనేసి లోపలికి వెళ్ళిపోయాడు.

చిన్న వయసులోనే, కొద్దికాలం సర్వీస్‌తోనే, తమ బాస్‌నీ, విశ్వమూర్తిగార్నీ ఇంప్రెస్ చేసి, ప్రమోషన్ మెట్లెక్కేసిన అతనంటే చాలా గౌరవం శ్యామలకి దానికి వెనుక కొంత అభిమానమూ లేకపోలేదు అందుక్కారణం మాత్రం హరి చూపే స్నేహభావమూ, మంచితనమే

పరశురాం అతని కోసమే ఎదురు చూస్తున్నట్లుగా "రావోయ్" అని ఆహ్వానించాడు హరిప్రసాద్‌ని.

అతన్నో కుర్చీలో కూర్చోమని సైగచేసి టేబిల్ మీదున్న బెల్ నొక్కాడు బోయ్ వచ్చి మూలగా రాక్ మీదున్న ఫ్లాస్క్‌లో కాఫీని, రెండు కప్పుల్లోకి ఒంపి ఇద్దరి ముందుంచి, వెళ్ళిపోయాడు. హరి ఇంతకు ముందు ఎన్నోసార్లు ఆఫీసు విషయాలు మాట్లాడేందుకు పరశురాం గదికి వచ్చాడు కానీ చాలాసార్లు కూర్చోటం కూడా ఉండదు. నిలుచునే అడిగేసి వెళ్ళిపోతుంటాడు అథవా కూర్చున్నా పరశురాం ఇలా కాఫీ ఆఫర్ చేసి మర్యాద చేయటం ఎప్పుడూ లేదు అందుకే కాస్త ఆశ్చర్యంగా ఉంది హరి కివాళ, పరశురాం తీరు

కాఫీ సిప్ చేస్తూ, "నీతో ఓ ముఖ్యమయిన విషయం మాట్లాడాలోయ్" అన్నాడు, పరశురాం

ఏమిటబ్బా అని, లోలోపల ఆశ్చర్యంగా ఉన్నా, "చెప్పండి" అన్నాడు హరి వినయంగా

"ఉద్యోగంలో స్థిరపడ్డావుగదా ? పెళ్ళి గురించేమయినా ఆలోచిస్తున్నావా ?"

"                    "

"మీవాళ్ళు, నీకు దగ్గర చుట్టాలెవరయినా ఉన్నారా ?"

తనకీ, ఆయనకీ మధ్య ఉన్న సంబంధం చెప్పేద్దామని నోటిదాకా వచ్చింది 'వద్దు ఇది సమయం కాదు' అనుకుని తమాయించుకున్నాడు

"ఎవరూ లేరు సార్" అన గలిగాడు అతి కష్టంమ్మీద

"అయితే డైరెక్ట్‌గా నిన్నే అడిగేస్తాను"

ఇలా అంటోంటే ఇరవయ్యయిదు సంవత్సరాల క్రితం తన మామగారు గుండారావు తనని 'కామేశ్వరిని చేసుకుంటావా' అని అడిగిన సంఘటన గుర్తొచ్చింది పరశురాంకి

"మా అమ్మాయి అరుణని నీకిచ్చి పెళ్ళి చేయాలి అని ఉంది నా మనసులో ఇన్నాళ్ళుగా చూస్తున్నావుగా ? నీ ఇష్టం ఏమిటి ?"

"                    "

హరి జవాబివ్వకపోవటమే వింతగా తోచిందాయనకి. అయినా, మర్యాదకోసం, "తొందరేం లేదు, ఆలోచించుకునే చెప్పు" అన్నాడు

"నోనో. అదికాదు సార్ అయామ్ సారీ

**జరిగిన కథ — 9 :** గుండూరావ్ కూతురు కామేశ్వరిని పెళ్లి చేసుకొంటాడు పరుశురామ్ తన భార్య మీనాక్షి కాన్పు కష్టం అయి చనిపోగా విశ్వం బెంగుళూరులో వున్న వొక ఇంగ్లీ పత్రికలో రిపోర్టర్‌గా చేరతాడు 'గోరంతదీపం' అనే వారపత్రికను పరశురామ్, విశ్వం కలసి నెలకొల్పుతారు. హరిప్రసాద్, రమణ ప్రేమించుకుంటారు హరి తనపుస్తకం పబ్లిసిటీ వర్క్‌మీద హైదరాబాదు వెళుతూంటే కరుణ వీడ్కోలు చెప్పను స్టేషన్‌కు వస్తుంది. రైల్లో తన చిన్నతనపు రోజులు జ్ఞప్తికి తెచ్చుకుంటాడు హరి — తన తండ్రి తల్లిని వదిలేయగా తను అనాధగా, తల్లి అక్కడే ఆయాగా ఒక అనాధశరణాలయంలో చేరుతారు తల్లి మరణిస్తుంది కాలేజీలో చదివే రోజుల్లోనే రావు పరిచయమవుతాడు హైదరాబాదులో రావుని కలిసిన హరి అతని ప్రవర్తనలో మార్పు రానందుకు చింతిస్తాడు హరి అతనితో తన పని ముగించుకొని అరుణ, రమణ, కరుణలకు ప్రెజెంట్స్ తీసుకొని హైదరాబాదు నుంచి వస్తాడు రమణ మనస్సులో తనకు స్థానం ఉందని తెలుసుకుంటాడు. హరి పుస్తకం 'కదిలే బొమ్మల చరిత్ర'కి నవ్య సాహితి అవార్డు వచ్చింది ఈ విషయం విని పరశురాం, విశ్వమూర్తి గార్లు సంతోషపడతారు. హరి పుస్తకాన్ని పబ్లిసైజ్ చేసేందుకు టూర్‌కు వెళితే బాగుంటుందని అతనికి సూచిస్తుంది రమణ

దయచేసి నన్ను అపార్థం చేసుకోవద్దు మీ మాట కాదని మిమ్మల్ని అవమానించాలని కాదు. నేనూ, రమణా పెళ్ళి చేసుకోవాలని ఎన్నాళ్ళు గానో అనుకున్నాం. ఆ మాట మీకు చెప్పి, నా తరఫున విశ్వంగార్ని అడగమని మిమ్మల్నే రిక్వెస్ట్ చేద్దామని అనుకున్నాను'' కాస్త వెనుక ముందాడినా చెప్పేశాడు హరి తన మనసులో మాటని.

పరశురాం ఊహించని పరిణామం ఇది అందం, చదువు, ఆస్తి, అంతస్తు అన్నీ ఉన్న అరుణని చేసుకొమ్మని అడగటమే తడవుగా సరే అంటాడని ఆశించాడు తను అతనేమో ఇలా చెబుతున్నాడు అసలు వాళ్ళిద్దరి మధ్యా అంత స్నేహం ఎలా ఏర్పడింది ? తనకీ విషయం ముందే ఎందుకు తెలీలేదు ? వాళ్ళిద్దరూ ఈ విషయాన్ని ఎవరికీ తెలీకుండా ఎలా దాచి ఉంచారు ? ఎన్నో ఆలోచనలు, ప్రశ్నలు పరశురాం మనసులో ఒక్కసారిగా సుళ్ళు తిరిగాయి అంతా కొన్ని క్షణాలు మాత్రమే ఆ హోరు తగ్గిన తర్వాత, తన ఆలోచనలు తనకే అసహ్యంగా అనిపించాయి

''అలాగా ? ఇందుకు నువ్వు సారీ చెప్పటం ఎందుకు ? రమణ నా కూతుర్లాంటిదే నువ్వు ఆ పిల్లని చేసుకుంటానంటే సంతోషించేవారిలో నేను మొదటివాణ్ణి నువ్వేం భయపడద్దు నేను విశ్వంతో మాట్లాడతానీ విషయం'' అన్నాడు ముఖంలో ఆనందాన్ని వక్తపరుస్తూ

''వెళ్ళొస్తాసర్'' అని బయల్దేరాడు హరి ఆవేళ, ఆరింటికి చిల్డ్రన్స్ పార్క్‌లో రమణని కలవాల్సి ఉంది అతను ఇవాళ జరిగిందాన్ని గూర్చి ఆమెకి చెప్పాలని ఆతృతగా బయల్దేరాడు.

కానీ అతనికి పరశురాం ఆలోచనలని తను ఎంతగా కల్లోలం చేసిందీ, గతాన్ని ఎంతగా తిరగ దోడిందీ తెలీదు

* * *

చేయాల్సిన పనంతా పక్కకి నెట్టేసి, చుట్ట కాలుస్తూ ఆలోచనలో పడిపోయాడు. పరశురాం తనకేమయిందీ రోజు ? రమణకి పెళ్ళిచేయటంలో తనకూ కొంత బాధ్యత ఉందని ఇన్నాళ్ళూ ఎలా మరిచిపోయాడు ?

ఆనాడు మంచి మనసులో తన మిత్రుడే గనుక ఆ పిల్లని పెంచే బాధ్యత తీసుకున్నంతలో తనకీ ఆ అమ్మాయికీ ఏం సంబంధమూ లేనట్లేనా ? నిజానికారోజు విశ్వం అలా తనంత తాను ముందుకు రాకపోతే ఆ పిల్లని తాను ఏ అనాథ శరణాలయంలోనో వేయటం తప్పేదికాదు ఆదే జరిగితే, తనకిన్నాళ్ళు మనసుకి ఏ మాత్రం శాంతి మిగిలేదికాదు.

తను పబ్లిషింగ్ హవుస్ ప్రారంభించిన కొద్ది రోజులకే, ప్రెస్ పనులు చూసుకోడానికి తనకిబ్బందిగాఉందని గ్రహించిన మామగారు, అసిస్టెంటుని పెట్టుకొమ్మని సలహా ఇచ్చారు ఆ మాటమీదే తను తమ్ముడు ప్రకాశాన్ని పంపమని వూరికో ఉత్తరం రాసి వేశాడు.

చిన్నాన్న తమ్ముణ్ణి పంపుతాడనే ఆశ తన కంతగా ఏమీలేదు కానీ ఆ విధంగా అయినా, కాస్త పిన్నమ్మని సంతోషపెట్ట గలుగుతానేమో నని, ప్రయత్నించాడు

వారం తిరిగేసరికి, కర్నూల్లో దిగి ఇల్లు వెతుక్కుంటూ వచ్చాడు ప్రకాశం చూడగానే తమ్ముణ్ణి గుర్తించలేకపోయాడు పరశురాం, అతనే ''నేనన్నయ్యా ప్రకాశాన్ని'' అని గుర్తు చేసేదాకా. అవును మరి ఎప్పుడో పదేళ్ల పిల్లాడుగా ఉండగా చూసిందే కద.

తమ్ముణ్ణి హృదయపూర్వకంగా ఆహ్వానించాడు పరశురాం ''పోనీ చెల్లెలికి కష్టంలో చేయూత నిచ్చే అవకాశం రాలేదు కనీసం తమ్ముడినయినా ఓ దారికి తేగలిగితే చాలు'' అనుకుని సంతోషించాడు. కానీ తమ్ముడితో బాటు కోరి కష్టాలు తెచ్చుకున్నానని అతని కప్పట్లో తెలీదు తెలిసేలోగా జరగాల్సిందంతా జరిగిపోయింది

## 26

బెల్లం ఉన్నచోట ఈగలు ముసిరినట్లు, డబ్బు చుట్టూ బంధువులు చేరటం మామూలే పరశురాం చిన్నాన్నకి చెప్పకుండా, నీ లెక్కేమిటి అన్నట్లు ఇల్లు వదిలి వెళ్లిపోవటం వల్ల ఆయనకి అతని మీద ఎంతకోపం ఉన్నా, ఈ మధ్యనే పరశురాం కాస్త నిలదొక్కుకుని నాలుగు డబ్బులు సంపాదిస్తున్నాడని ఆ నోటా ఆ నోటా



వింటుంటే, ఆయన కోపం మంచులా కరిగి విడిపోతోంది అదృష్టంతో ఆస్తిని సంపాదిం చెయ్యటమే కాకుండా, రెండు చేతులా నంపా దిస్తున్నవాణ్ని, ఏ దిక్కూ లేకపోతే తానే పెంచాడు అని చెప్పకుంటే తనకెంత గౌరవం ? ఇద్దరూ ఒకరికొకరు చేరువయితే బాగుకద అనుకున్నాడు. పల్లెలో తన పరిస్థితి అంతంత మాత్రంగా ఉంది రెండేళ్ళుగా పంటలూ సరిగ పండక నానా ఇబ్బంది పడుతున్నాడు. పరశురాం తన భాగం పొలాన్ని అమ్ముకునిపోయాక తనకి మరీ కష్టంగా ఉంది

మూడుసార్లు పరీక్షరాసి ఇంటర్మీడియిట్ గట్టెక్కలేక ప్రకాశం ఇంట్లో వచ్చిచేరాడు. ఆ అబ్బాయి చదువుకోసం, ఆలోచన లేకుండా, ఊరంతా అప్పలు చేసుకున్నాడు ఒకప్పుడు తనకి వంగివంగి దండాలు పెట్టిన ఎందరో తనకి అప్ప లివ్వటంతో, తను లోకువ అయిపోయాడు ఇప్పుడు గడపదాటి వీధి ముఖం చూడాలంటే అవమానంగా వుంటుంది, ఎవరు కనిపించి ఏ మాట అంటే పడాల్సివస్తుందో అని

సరిగ్గా ఈ పరిస్థితిలోనే పరశురాం ఉత్తరం వచ్చింది. కొడుక్కి ఉత్తరం చూపించి, బయలుదేరమన్నాడు.

ప్రకాశం అన్నని ఎప్పుడో చిన్నప్పుడు చూసిందే. తనకి ప్రత్యక్షంగా తెలీకపోయినా, ఇంట్లో అమ్మా, అక్కా చెప్పిన మాటలద్వారా తండ్రి అతన్నెలా చూసేవాడో తెలుసుకున్నాడు ఆ కోపంతో, తననెలా చూస్తాడో అని భయ పడ్డాడు, కర్నూలు వెళ్ళమని తండ్రి చెప్పగానే తండ్రితోనూ అదే చెప్పాడు. కొడుకు అమాయ కత్వానికి నవ్వాడు తండ్రి

''ఒరే పిచ్చినాగన్నా! నోట్లో నాలికలేని వెధవ వాడు ఎలాగో నాలుగు రాళ్ళు సంపాదిం చేయగానే మొనగాడయిపోతాడేమిటి? వాడి మొహం అయినా అంతకోపం వుంటే నిన్ను పంపమని ప్రాధేయపడుతూ ఉత్తరం ఎందుకు రాస్తాడు? నీకేం భయంలేదు కొన్నాళ్ళు ఆనుపానులు తెలుసుకుని వాళ్ళ నువే ఆడించాలి బొమ్మలాగ. అంతమాత్రపు ఆలోచనా, తెలివీ లేవూనీకు? ఇంతేనా!'' అని కొడుకుని పురెక్కించి, బలవంతంగా బయలుదేరదేసాడు కర్నూలుకి

తమ్ముడు వచ్చిన మొదటి రోజే పని చూపించటం ఎందుకు? కొన్నాళ్ళు జరగనీ చూద్దాం అని పరశురాం చుట్టంచూపుగా వచ్చిన వాడిలా సకల మర్యాదలూ చూశాడు ప్రకాశానికి రెండు జతలు కొత్త బట్టలు కుట్టించాడు అన్న కుట్టించిన బట్టలేసుకుని, వదిన రుచిగా భోజనం వండిపెడితే సుష్టుగా తినేసి, వూరంతా బలాదూరు తిరగటం — ఇదీ ప్రకాశం చేస్తున్న పని

నెలా, రెండు నెలలు అలాగే గడిచాయి

# గోరంత దీపం

ఏదో ఒకరోజు తనే ప్రెస్‌కొస్తానని అడుగుతాడని పరశురాం చూస్తున్నాడు

గుండూరావుకి ప్రకాశం వరసేమీ నచ్చటం లేదు ఆ మాటకొస్తే అల్లుడి పద్ధతీ సంకటం గానే వుంది స్వంత తమ్ముడు కూడా కాదు, వీణ్ణెందుకు తెచ్చి నెత్తిమీద పెట్టుకుని, ఆబోతులా మేపుతున్నాడో?— అని చిరాకుగా ఉంది ఆయనకిప్పుడు ఆరోగ్యం బాగుండటం లేదు ఎక్కువగా ఇల్లు వదలి బయటికి కూడా వెళ్ళటం లేదు చాలా మటుకు ఇంట్లోనే విశ్రాంతిగా కూచుని ఉంటాడు

ఒకరోజు అన్నాతమ్ముళ్ళిద్దరూ ఇంట్లో ఉన్న సమయం చూసుకొని, ''ఏమయ్యా నువేదో

## డీసిల్ పొగవల్ల కేన్సరు!

డీసిల్ పొగవల్ల కేన్సరు వ్యాధి రాగలదని జపాను శాస్త్రవేత్తలు తెలియ చేశారు డీసిల్ పొగలో నైట్రో పైరెన్ అనే అంగారక పదార్థం ఉంటుంది దీనిలో మూడు రకాల నైట్రోపైరన్లు ఉంటాయి ఇటీవల జరిగిన ప్రయోగాలలో శాస్త్రవేత్తలు దీనిని ద్రవరూపంలోకి మార్చి 20 ఎలుక లకు ఇంజెక్షన్లద్వారా ఇచ్చారు 320 రోజులలో వాటన్నిటికి కేన్సరు వ్యాధి వచ్చింది మరోచోట జరిగిన ప్రయోగా లలో ఈ నైట్రోపైరన్లలో సగం మోతాదును 20 చిట్టెలుకలకు ఇచ్చారు వీటిలో పది ఎలుకలకు 400 రోజులలో కేన్సరు వ్యాధి వచ్చింది ఈ పరిశోధన లతో డీసిల్ వాహనాల నుండి వెలువడే పొగను నియమితపరచటానికి కొన్ని నియమాలను పాటించవలసిన ఆవశ్యకత ఏర్పడిందని భావిస్తున్నారు

మీ తమ్ముడ్ని ఓ దారిలో పెడ్తావని మీ చిన్నాన్న పంపితే, నువు మాటాపలుకూ లేకుండా గాలి కొదిలేసినట్లున్నావే'' అన్నాడు అల్లుడితో తమాషాగా

పరశురాంది అసలే సున్నితమయిన మనసు వెంటనే మామగారి మనసులో మాట అర్థం చేసుకున్నాడు

ఆవేళే ప్రకాశాన్ని ప్రెస్‌కి వెంటబెట్టుకుని వెళ్ళాడు తమ్ముడికి అక్కడ జరిగే పని చూపి, అక్కడ అతను చేయాల్సిన వర్క్ ఏమిటో నేర్పేందుకు పరశురాంకి నెలరోజులు పట్టింది తరువాత మెల్లిగా తను అటువయిపు వెళ్ళటం తగ్గించేసాడు. ఏ వారానికొకసారో వెళ్ళినా, కొన్ని నిముషాలు మాత్రం గడిపి, కాష్, అకౌంట్సు చూసుకుని వచ్చేస్తున్నాడు

ప్రెస్‌లో పని చేసే సుందరేశన్ అనే అతనికీ, ప్రకాశానికీ బాగా స్నేహం కుదిరింది. స్నేహం కాస్త ముదిరే దాకా, పరశురాం చెవికి చేరలేదీ వార్త సుందరేశన్ ఎలాంటి వాడో అతనికి తెలుసు వాడికి లేని చెడు అలవాట్లు అంటూ లేవు వాడి జత చేరి, ప్రకాశం కూడా చెడిపోతాడని భయపడ్డాడు పరశురాం

అందుకే ఒకరోజు తమ్ముణ్ణి పిలిచి అడిగాడు ''చూడు ప్రకాశం ఆ సుందరేశన్, వాడి మనుషులూ అంత మంచివాళ్ళు కాదు అంతా గొంతులు కోసేరకాలు వాడికెన్ని చెడు అలవాట్లున్నదీ నాకు ప్రత్యక్షంగా తెలుసు వాడికి దూరంగా వుంటే బాగు అని చెప్పాలనే పిలిచింది నిన్ను''

మంచిగా చెపుదాం, ప్రకాశానికి మాత్రం చెడిపోవాలని వుంటుందా? తెలినితనం అంతే అనుకున్న పరశురాంకి, తమ్ముడు ఎదురు తిరగ టంతో తల తిరిగిపోయింది

''నా ఇష్టం నాకు ఇష్టమయినవాళ్ళతో స్నేహంగా వుంటాను అదీ నువ్వు చెప్పినట్లే చేయాలా? నేనేం నీ కింద బానిసనికాదు నువ ఏది చెప్పినా ఊకొట్టేందుకు నీ దగ్గర ఉద్యోగం చేస్తున్నాను, జీతం ఇస్తున్నావు ఇంతకన్నా మనిద్దరికీ ఏం సంబంధం వుంది?'' అని ఎగిరి పడ్డాడు ప్రకాశం ఆశ్చర్యంతో నోటిమాట రాలేదు పరశురాంకి

వెంటనే చిన్నాన్నకి ఉత్తరం రాద్దామా, లేదా వీణ్ణి ఊరికి పంపించేద్దామా అని ఎన్నో విధాలుగా ఆలోచనలు చేసాడు ఏదీ నచ్చలేదు తను ఏం చెప్పినా చిన్నాన్న, తప్పుగా అర్థం చేసుకోవచ్చు అది తన కిష్టంలేదు మంచిగా సంబంధాన్ని నిలుపుకోవాలనే, తమ్ముణ్ణి బాగు చేయాలనే సదుద్దేశంతోనే అతణ్ణి పిలిపించాడు. లేదనకుండా అంతో ఇంతో తనకి సహాయంగా ఉంటున్నాడు ప్రకాశం చిన్నతనం, కాస్త ప్రవర్తనలో లోపం, నిదానంగా చెబితే అర్థం చేసుకోడా అనిపించి అప్పటికి ఆలోచనలని వాయిదా వేసాడు పరశురాం.

రోజులు గడుస్తున్న కొలదీ ప్రకాశం రోజూ సరి అయిన సమయానికి ఇల్లు చేరటం కూడా లేకుండా అయింది కానీ పరశురాంకీ తీరికలేని పని అవటంతో ఇది గమనించటం కూడా ఆలస్యం అయింది ఎప్పుడో ఒకరోజు గమనించినా, ఆవేళ మాత్రమే అలా వచ్చాడు కాబోలు అనుకునేవాడు చివరికి కామేశ్వరి చెప్పేక అర్థం అయింది

ఒకరోజు అర్ధరాత్రి అయినా ప్రకాశం ఇల్లు చేరలేదు పరశురాం గాభరాగా, ఊరంతా తిరిగి చూసాడు గంటసేపు వీధులన్నీ గాలిస్తే ఓ సారాకొట్టు దగ్గర, సుందరేశన్‌తోపాటు తాగి దొర్లుతూ కన్పించాడు కోపంతో ఒళ్ళు తెలియ

లేదు అక్కడిక్కడే తమ్ముణ్ణీ, సుందరేశన్నీ చేర్చి, ఎముకలు విరిచేద్దామా అన్నంత ఆవేశం వచ్చింది. ఆలోచన లేకుండా ఆవేశాన్ని బయట పెట్టే తత్వం కాదు అతనిది అందుకే తమాయించుకుని, ప్రకాశాన్ని ఓ రిక్షాలో పడేసి ఇంటికి తీసికెళ్ళాడు

బలవంతంగా కూర్చోబెట్టి, చెంబుడు మజ్జిగ తాగించేడు. ఆ చంపా, ఈ చంపా వాయించాడు అప్పటికి పూర్తిగా మత్తు వదిలింది ప్రకాశానికి 'ఏమిటి, ఎక్కడున్నాను' అన్నట్లు, కళ్ళు ఆర్పుతూ తల విదిలిస్తూ చుట్టూ చూశాడు

''ఏరా దిగిందా మత్తు ! ఎక్కడికొచ్చానో అర్థమవుతుందా?'' అన్నాడు కాస్త కఠినంగానే

ప్రకాశానికిదేమి పట్టినట్లు లేదు. జరిగిందాంట్లో సిగ్గు పడాల్సిందేమీ లేనట్లు, బింకంగా అన్నగారి వయిపు చూస్తూ కూర్చున్నాడు

ఆ చూపులతో మరింత రెచ్చిపోయాడు పరశురాం.

'' రాస్కెల్ నిండా ఇరవై ఏళ్ళు లేవు నీకు ఇప్పుడే ఇలా చెడుఅలవాట్లతో, ఒళ్ళు హూనం చేసుకొని, నాశనమయిపోయి, నువ్వు బాగుపడేదేముందిరా. ఎవరినుద్ధరిస్తావనిఆయన నిన్నిక్కడికి పంపేడోగాని, నా ప్రాణానికి ఉరిలా తయారుయినావు ఛీ ! ఇదేగనుక నా స్వంత తమ్ముడి వయింటే, ఇవాళ నీ ఊపిరి తీసేసేవాణ్ణి ఫోరా నాఎదురుగా ఉండొద్దు నువ్వు కోపంలో ఏంచేస్తానో నాకే తెలీదు ''

గది గుమ్మం పక్కనే నిలుచుని కామేశ్వరి బెదురుగా చూస్తోంది ఆమె ఇప్పుడు మూడో నెల గర్భిణి ఇంటి పనంతా ఒక్కతే చేసుకు రావటంతో నీరసంగా అయిపోయింది దానికి తోడుగా అర్ధరాత్రి అయినా భోజనం నిద్ర లేకుండా పడిగాపులు కాయటం చిరాకుగా ఉంది అయినా ఏం చేస్తుంది ఏం అంటే భర్త ఏమనుకొంటాడోనని భయం

కుర్చీలోంచి లేచి నిలుచుని 'హు' అని నిర్లక్ష్యంగా తల విదిల్చి, ''స్వంత తమ్ముడిని గాదు కాబట్టే ఇంతలాకొట్టే, అవమానిస్తున్నావ్ నువ్వు నాకు అన్నయ్యివీ, నన్ను బాగా చేసే వాడివీనా? చాల్లే నిర్వాకం ఈ రోజుతో నీ ఇంటికీ నీకు సరి, నేను వేరే గది చూసున్నాను. రేపు వెళ్ళిపోతాను మరో ఉద్యోగం దొరికేదాకా నీ ప్రెస్‌లో పని చేస్తాను నా జీతం నాకు పారేయి అంతకన్నా ఎక్కువ మాట్లాడే వంటే ఏం జరిగేది . చెప్పను చేసి చూపిస్తాను'' అనేసి అవతలకి వెళ్ళి పోయాడు ప్రకాశం

అవతల కామేశ్వరి చూస్తుండగానే తమ్ముడు అంతలేసి మాటలనడం, అవమానకరంగా ప్రవర్తించడం పరుశురాంకి సిగ్గుగా ఉంది. తాను అభిమానంతో మంచి చేయిబోతే ఎందుకిలా అయింది అని ఒక వయిపు బాధగాను,



మరో వయిపు హాయిగా గడిచి పోతుంటే కోరి ఈ తద్దినాన్ని ఎందుకు తెచ్చి నెత్తిన పెట్టు కున్నానా అని పశ్చాత్తాపము అన్నీ కలసి అతని తల మీద ఎవరో మేకులు దిగవేసినట్లుగా అదరి పోతున్నాడు.

నిద్రకళ్ళతో ఏం చేయాలా అని ఇటే చూస్తున్న కామేశ్వరి ఎదురుగా కనిపించేసరికి, కోపం, ఆవేశం అంతా అటు తిరిగింది ''నువ్వింకా నిద్రపోకుండా ఎందుకట్లా బొమ్మలా చూస్తూ నిలుచున్నావు? పడుకోపో'' అని కసిరి, తరిమేసి తలుపులు వేసుకున్నాడు. ఆ రాత్రి అంతా భార్యభర్తలిద్దరికీ జాగరణే అయింది పరశురాం అక్కడే వాలుకుర్చీలో కాళ్ళు జాచి ఆలోచిస్తూ కూర్చుండి పోయాడు ఆ చుట్టు పక్కలెక్కడా సుండూరావు మేల్కొని చూస్తున్న సూచనలేమీ లేకపోయినా, తెల్లారేసరికి ఆయనకి విషయం ఎలాగూ తెలుస్తుంది అప్పుడు ఆయన తనని చూసే చూపులెలా వుంటాయో తనకి తెలుసు.

*　　*　　*

'వీడిరాత ఇంతే' అని ప్రకాశాన్ని బాగుపరచే ఆశల్ని ఒదిలేసాడు పరశురాం చేస్తున్న ఉద్యోగంలో అయినా ఎక్కువ రోజులుంటాడనే ఆశ కూడా అడుగంటింది

ప్రెస్‌లో ఆర్డర్లు సమయానికి అందడం లేదంటూ మెల్లిగా కంప్లెయింట్లు రావటం మొదలయింది అందుక్కారణం తమ్ముడి, అలసత్వం, నిర్లక్ష్యమేనని తెలుసు పరశురాంకి అప్పుడప్పుడూ ప్రెస్‌వయిపు వెళ్ళి పనివాళ్ళని కాస్త అదిలిస్తూ, పార్టీలకి సర్ది చెప్పుకుంటూ లాక్కొస్తున్నాడు ఎలాగో

ఒక్కొక్కటిగా అకౌంట్స్‌లో లొసుగులు కూడా కనిపిస్తున్నాయి ప్రతినెలా వందా రెండు వందలు కాష్ తక్కువ వస్తోంది ఇదేమిటి? అనడిగితే, నేను తీసుకున్నా, అప్పగానే లనుకో తీర్చేస్తాలే అనేసేవాడు ''ఎందుకురా ఇలా డబ్బు తగలేస్తావు ఇచ్చిన జీతమంతా ఇంటికొక రూపాయి అయినా పంపటం లేదని చిన్నాన్న గోల. అదికాక పైన ఈ డబ్బెందుకు తీస్తావు.'' అని నేరుగా అడిగినా, ఏ డొంక తిరుగుడు జవాబో ఇచ్చేస్తాడు ప్రకాశం.

మనసుండక ఒకసారి విశ్వం వచ్చినప్పుడన్నీ చెప్పుకొచ్చాడు

''నీకసలు బుద్ధిలేదురా ! వాణ్ణిక్కడికి తెచ్చి పెట్టుకోవటమే పెద్ద తప్పు. పోనీ వచ్చిన వాణ్ణి నాలుగు తగలనిచ్చి బుద్ధి నేర్పాలిసింది అదీ చేయలేక, నెత్తిమీద పెట్టుకుని ఊరేగిస్తూ, వాడు గుడినీ, గుడిలో లింగాన్నీ మింగేస్తుంటే ఎందుకు చూస్తూ కూర్చోవటం? వెంటనే ఊరికి తరిమెయ్యి రామూ !'' అని తననే తిట్టాడు విశ్వం

ఒకరోజు ప్రెస్ నుండి బ్యాంకుకు వెళ్లి డిపాజిట్ చేయాల్సిన డబ్బు రెండువేల చిల్లర పట్టుకుని పరారి అయినాడు ప్రకాశం డబ్బు పోయినందుకు బాధపడలేదు పరశురాం చివరికి తమ్ముడింకా ఏ స్థితికి దిగజారి ఏలా తంటాలు పడతాడోనని దిగులు కలిగినా, మరోవంక, కోరి రమ్మని పిలిచిన నోటితోనే పొమ్మని చెప్పవలసిన అవసరం రాకుండా, తనే వెళ్ళిపోవటం, అతని మనసుకి రిలీఫ్‌గానే ఉంది

కానీ తమ్ముడితోపాటు అన్ని సమస్యలూ విడిపోయినాయనుకోవటం పరశురాం చేసిన మరో పొరబాటు

ప్రకాశం పారిపోయి ఆరునెలలయింది ఆ మధ్యే విశ్వమూర్తి బెంగుళూరులో ఉద్యోగం వదిలేసి కర్నూలుకి వచ్చేసాడు

ఒకరోజు మిత్రులిద్దరూ పబ్లిషింగ్ కం ఆఫీస్‌లో కూర్చుని పని చేసుకుంటున్నారు ఒక వృద్ధుడు చిన్న పాత్తిళ్లలో పాపాయిని ఎత్తుకుని వచ్చాడు ఆఫీస్ దగ్గరికి



ముందు వరండా ఊడుస్తున్న నౌకరొచ్చి చెప్పగానే ఇద్దరూ బయటికొచ్చి చూశారు ఆశ్చర్యంగా ఎవరా ఈ ముసలాయన అని

"మీ లో పరశురాంగారంటే ఎవరు బాబూ ? " అనడిగాడు.

"నేనే" అన్నాడు పరశురాం

ముసలాయన చాలా దూరం నించీ నడిచి వచ్చినట్లున్నాడు ఎండలో. చమటలు కక్కుతూ అలసి ఉంది అతని ముఖం. బిడ్డనెత్తి వరండాలో నేలమీద ఓ పక్కగా పడుకోబెట్టి, తనూ పక్కనే చతికలబడ్డాడు భుజం మీద తుండుతో ముఖం తుడుచుకుని, "ఈ బిడ్డ మీ తమ్ముడుగారి కూతురు బాబూ ." అని ఇంకా ఏదో చెప్ప బోయాడు

పరశురాంకిదంతా అయోమయంగా ఉంది, ఎప్పుడో పారిపోయిన తమ్ముడికి పెళ్ళెప్పుడయిందీ. కూతురు ఎప్పుడు పుట్టిందీ—అని సందేహాలతో తల తిరిగిపోతూంది కానీ విశ్వం మాట్లాడ వద్దని సైగ చేయటంలో పెదవి విప్పకుండా వింటూ వుండిపోయాడు.

"మా ఇంట్లోనే ఓ గదిలో చానాళ్ళుగా అద్దెకున్నారండి, మీ తమ్ముడూ, అతని భార్య కానీ వాళ్ళకసలు పెళ్ళే కాలేదని, ఆరునెల్లనాడు పిల్లని అతనొదిలేసి పోయేదాకా మాకు తెలీదండి అప్పుడే ఇరుగు పొరుగు అంతా చెప్పేరు మాకు ఈ పిల్లని గదిలోంచి తరిమేస్తే మర్యాదగా వుంటుందని మా ఆడది అట్లా చేసేందుకు ఒప్పుకోలేదండి దాన్ది భలే మెత్తని మనసు లెండి నిండు చూలాలిని ఎక్కడికి పొమ్మంటాం అని అద్దె కూడా అడగటం విడిచేసింది. ఆ పిల్లకి ప్రసవం అయింది పిల్ల పుట్టింది తిండికీ, గుడ్డకీ, పిల్లని సాకేందుకు సంపాదించుకోవ టానికి ఎన్ని తంటాలు పడిందో చెప్పలేను బాబూ. మేమూ ఉన్నవాళ్ళం కాదు, ఏ

# గోరంత దీపం

సహాయమో చేసేదానికి. ఏదో చంటిపిల్ల కాస్త పెద్దయితే ఆ అమ్మాయి ఎక్కడో పని చూసు కుంటే జరిగిపోదా అనుకున్నాం. దేవుడా రాత కూడా రాసివుంటే కదా అమ్మవారు పోసి, వారంరోజులు మంచంలో తీసుకుని చచ్చిపోయింది తల్లి పిల్ల మిగిలింది మేమీ పిల్లని నెత్తిమీద వేసుకునే స్థితికాదు మా ఆడదానికి బాగా చూపు ఆనదు. నా సంగతి సరేసరి .. ఏ అనాథ శరణాలయానికో అప్పగిస్తామను కుంటుంటే, వీళ్ళనాయన వివరాలు తెలిసినాయి మీరాయనకి అన్న అని తెలిసి వచ్చాను. ఏదో మీ రక్తసంబంధం. మీకు అప్పగిస్తున్నాను. ఏం చేయాలిసిందీ మీరే చూసుకోండి బాబూ" అనేసి ముసలాయన లేచి నిలుచున్నాడు.

"మరి నే వెళ్ళొస్తాను బాబూ" అని అతను పిలుస్తున్నా జవాబు చెప్పేందుకు పరశురాం మనసు ఈ లోకంలోనే లేదు

అతనికేం చేయాలో తోచటంలేదు పాప నిద్రలో కదిలి ఏడుస్తోంది విశ్వం నెమ్మదిగా బిడ్డని ఎత్తి తన ఒడిలో పెట్టుకుని అలాగే చిచ్చికొట్టేసి నిద్రపుచ్చాడు

తమ్ముడు తన దగ్గిర వచ్చిచేరి, హద్దూ పద్దూ లేకుండా ప్రవర్తించిన రోజుల్లో, లోలోపలే విసుక్కున్న భార్య, పైకే చూపించిన మామగారు, ఇప్పుడీ పాపని ఇంటికి తీసికెళితే ఏమంటారో ?

"ఇదెక్కడి తద్దినమయ్యా బాబూ నీకు అక్కరకు రాని చుట్టాలనంతా తెచ్చి నెత్తిన పెట్టుకుంటే వచ్చేలాభం ఇదే" అని మామగారు దెప్పి పొడవటం ఖాయం. తనేం చెప్పకోవాలి ? ఎలా తల ఎత్తి మాట్లాడాలి ? పోనీ ఇంటికి తీసికెళ్ళి ఏ అనాథ పిల్లో అని చెప్పి పెంచుకుందాం అంటే ఒప్పుకుంటారా ? కామేశ్వరికీ నిండా నెలలయినాయి. ఇప్పుడో అప్పుడో ప్రసవించేలా వుంది తనకి బిడ్డ పుట్ట బోతూంటే, ఈ బజారు పిల్ల మనకెందుకు, ఏ అనాథ శరణాలయంలోనో చేర్చేయండి అంటుందేమో నిజానికి కామేశ్వరి ఎప్పుడూ తన మాటకి ఎదురుచెప్పి బాధించదు మంచిగానే మామూలు మాటలతోనే తనని ఒప్పించి చేయిస్తుంది ఏ పనయినా 'ఇల్లరికపు అల్లుణ్ణి' అనే భావం లోలోపల కనిపించకుండా ఎప్పుడూ ఉండటంవల్లనేమో, పరశురాంకూడా మొదటి నించీ భార్యని, ఎందులోనూ శాసించి ఎరుగడు ఆమె తండ్రి ఎదురుగా పరుషంగా మాట్లాడే సాహసంకూడా చేయలేదెప్పుడూ ఆయన కూతురంటే ఎంత ప్రాణమో తనకి తెలుసు

పోనీ ఈ పాపని తీసుకెళ్ళి సింగనమలలో చిన్నాన్నకి అప్పచెప్తితే. ఆ మాట తలుచుకోవా లంటేనే మనసు ఎలాగో అయిపోతూంది, ఆయన చేతుల్లో పడి తానెంత బాధపడ్డదీ, చెల్లెలు రాజ్యం ఏమయిపోయిందీ గుర్తొచ్చి. అంతకన్నా అనాథ శరణాలయంలో వేయటమే మంచిదేమో ! పరశురాం ఆలోచనలు పరిపరి విధాలుగా పోతున్నాయి

అతని మనసులో రేగుతున్న తుఫాను ఊహించగలుగుతున్నాడు విశ్వమూర్తి, మిత్రుడి ముఖాన్నిచూసి అమాయకంగా తన ఒడిలో ముడుచుకు పడుకొని నిద్రపోతున్న పాపాయి ముఖం వయిపుచూస్తూ, అప్పటికప్పుడే ఒక నిర్ణయం చేసేసుకున్నాడు విశ్వం

అదే చెప్పాడు పరశురాంకి "నువేం దిగులు పెట్టుకోవద్దురా రామూ! నేను పెంచుకుంటూ ఈ పాపని నాకు తోడుగా ఉంటుందీ చిట్టి తల్లి" అని భరోసా ఇచ్చేసాడు

(ఇంకా ఉంది)



'ఉత్తరాలు' శీర్షికకి రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.




ఆస్పత్రిలో ఉండగా యింటి నుండి ఫోన్ వచ్చింది. ఎంత మంది పేషెంట్స్ మధ్య బిజీగా ఉన్నా, అరవింద ఫోన్ నేనే అందుకోవాలన్నది అరవింద ఆజ్ఞ. ఆ సుగ్రీవాజ్ఞని దాటడం నా జన్మకి నాకో చాతకాని పని. ఫోన్‌లో అరవింద గొంతు చాలా చిలిపిగా ఉంది.

"ఏమండోయ్ శ్రీవారూ ఒక చిన్న మాట ..."

"ఏమిటో అది..."

"మా అమ్మ, చెల్లెలు సునీత, తమ్ముడు సుధీర్ వస్తున్నారు యిప్పుడే టెలిగ్రాం వచ్చింది అంచేత మీరు సాయంత్రం డ్యూటీ మీ ఫ్రెండ్‌కి అప్పచెప్పి యింటికి వేగం వస్తే బజారుకి వెళ్ళాలి డ్రెస్సింగ్ టేబిల్, డైనింగ్ టేబిల్ కొనాలి యిప్పుడు యీ చెక్క టేబిల్ బాగులేదు టి. వి కొనాలి మా తమ్ముడుకు టి వి. లేకపోతే ఒక్క క్షణం గడవదు యింకా మా అమ్మకి అసలే వాతపట్టు. ఫోమ్‌బెడ్ ఒకటి కొనాలి, యింకా " గుర్తు చేసుకొంటున్నట్టు ఒక్క క్షణం ఆగింది 'ఆఁ అన్నట్టు '

"ప్లీజ్ అరూ . ఇప్పుడు వీటన్నిటికీ డబ్బు "

"నాకు తెలుసు . మీరలా అంటారని అందుకే ఆ ఏర్పాటు నేను చేశాను.. నా పలక పర్సు మిసెస్ మెహతాగారింట్లో పెట్టుకుని ఆరు వేలు యిస్తానన్నారు మనం తాపీగా నెల నెలా డబ్బు కట్టి అవి విడిపించుకోవచ్చు "

"కాని యింత డబ్బు ఖర్చు ఇప్పుడు అనవసరమేమో అరూ . నాలుగురోజులుండి వెళ్ళిపోయేవాళ్ల ముందు గొప్పకోసం ఎన్నని కొనగలం ? రేపు మా ఫారిన్‌లో ఉన్న చిన్నాన్న వస్తున్నారని వీడియో కొనమంటావు ఖర్చులు మన తాహతుని చూసి పెట్టుకోవాలి "

నేను ఫోన్ పెట్టేశాను

పెళ్లయిన యీ ఆరేళ్లలో అరుంధతి ముందు నేను యింత నిష్కర్షగా మాట్లాడడం యిదే మొదటిసారి మాది లవ్ మేరేజ్ అరవింద అరవిరిసిన గులాబీ పువ్వులా అందంగా ఆకర్షణీయంగా ఉంటుంది. ఆ సోగ కళ్లలోని ఆకర్షణే నన్ను యీ ప్రపంచంలో నాకున్న ఒకేఒక ఆత్మబంధువైన నాన్న ప్రమేయం లేకుండా పెళ్లి చేసుకునేలా చేసింది నిజం చెప్పాలంటే మా పెళ్లి అరూ వాళ్లింట్లో కూడా యిష్టంలేదు ఆ సిటీలో పేరుమోసిన బిజినెస్ మాగ్నెట్ అయిన రామనాథంగారి పెద్ద కూతురైన అరవింద ఏడు మల్లెపూల ఎత్తుగా గారంగా పెరిగింది నాలాంటి పదిమంది ఎమ్ బి బి. ఎస్ గాళ్లని క్షణాలమీద కొనగల స్తోమతు ఆయనకుంది ఆ ఒక్క ఎమ్ బి బి.ఎస్ డిగ్రీ తప్ప యింకేం లేని నాలాటి పేదవాడికిచ్చి తన కూతుర్ని చెయ్యడానికి ఆయన సుతరామూ యిష్టపడలేదు

అరవింద నాలో ఏం చూసి మనసు పారేసుకుందో ? నాకు నేటికీ ఎప్పటికీ అర్థం కాని ప్రశ్న అది అందరినీ ఎలా పెళ్లికి ఒప్పించిందో అది ఒక రహస్యం రామనాథంగారు నన్ను పిలిపించి పెళ్లి మాటలు మాట్లాడారు అతను మా కుటుంబం గురించి, ఆస్థిపాస్థుల గురించి అడుగుతూంటే ఉన్న పదెకరాల పొలం నా చదువుకి కరిగిపోగా జీర్ణావస్థలో ఉన్న ఒక చిన్న పెంకుటిల్లు, నా మీదే ఆశలు పెట్టుకుని, నా చల్లని నీడలో, కోడలు, మనుమల మధ్య తన జీవితం నిశ్చింతంగా వెళ్లిపోతుందని ఆశగా ఎదురుచూసే ముసలి తండ్రి తప్ప యింకే ఆస్థిపాస్థులు లేవని చెప్తున్నప్పుడు నేనెంతో యిన్సల్ట్ ఫీలయ్యాను

అరవింద తల్లి నా వైపు ఏహ్యంగా పురుగుని చూసినట్టు చీదరింపుగా చూసింది నేను కావాలనే పెళ్లికి రెండురోజులు ముందుగా తనకి చెప్పకుండా పెళ్లి చేసుకుంటున్నందుకు క్షమించమనీ, టైముంటే రామాపురం వచ్చి తనని తీసుకుని వచ్చేవాణ్ణనీ రాసి శుభలేఖ జతపరిచి పోస్ట్ చేసేశాను నాన్నగారు పెళ్లికి రాకుండా ఉంటే బాగుండుననే కోరిక నా అంతరాంతరాల్లో ఉండబట్టే అలా చెయ్యగలిగానని యిప్పుడనిపిస్తుంది నాకెందుకో నాన్నగారు యీ ఖరీదైన మనుష్యుల మధ్య ఒక్క క్షణం కూడా యిమడలేరనిపించింది నాకు పెళ్లయింది ఆరేళ్లు గడిచాయి యిద్దరు పిల్లలుపుట్టారు. నేను ఏ కొద్దిసార్లో తప్ప మా అత్తవారింటికి వెళ్లలేదు

నా ఉత్తరానికి నాన్నగారు వెంటనే జవాబు రాశారు తన పెద్దరికాన్ని కించపరచి, తన ప్రమేయం లేకుండా పెళ్ళి చేసుకున్న నన్ను పల్లెత్తి మాట అనలేదు నేనేదో ఉద్ధరిస్తానని ఉన్న ఆస్థినంతా కరిగించి నాకు చదువు చెప్పించినా, నాన్న రానిదే నేను పెళ్లి చేసుకోనని ఖండితంగా చెప్పలేని నా బలహీనతని దూషించ లేదు నా వైవాహిక జీవితం ఆనందమయంగా ఉండాలని ఆశీర్వదిస్తూ అందులోనే, అరవిందకి కూడా 'అమ్మా నీకు దయగలిగి నప్పుడు యీ ముసలి మామగారిని చూడడానికి రామ్మా' అని రాసేరు మా పాలేరు చేత ఆ ఉత్తరం మా అమ్మది పాళ్లచామంతి పువ్వు కోడలికి యిమ్మని పంపించారు.

## కోటికొక్కడు

నేను సంబరంగా అది పట్టుకు వెళ్ళి అరవిందకి ఇస్తే అరవింద ఆ ఉత్తరాన్ని చదవనైనా చదవకుండా నిర్లక్ష్యంగా పక్కనే పడేసింది చామంతిపువ్వు చూసి పెదవి విరుస్తూ 'ప్స్ ఓల్డ్ మోడల్' అంది నిరాసక్తిగా ఎన్నో సార్లు అరవిందని రామాపురం తీసుకు వెళ్ళాలని అనుకున్నాను గానీ ఆ ఊరు పేరు వింటూనే అరవింద కంపరంగా భుజాలెగుర వేసేది అరవిందకీ, నాకూ అగాధమంత దూరం

అరవింద పై మెట్టు మీద ఉంది నేను కిందన ఉన్నాను భార్య భర్త ఉన్న చోటికి నడిచి రావడం యీ దేశాచారం. కాని నేను కింద నుండి పై మెట్టెక్కి అరవిందని చేరుకోవాలన్నది అరవింద ఆశయం గెలుపు అరవిందకే దక్కింది ఫలితంగా డాక్టర్‌గారు డబ్బు ఖరాఖండీ మనిషన్న పేరూ, ఊళ్ళో అప్పులూ నాకు దక్కాయి పెళ్ళయిన యిన్నాళ్ళకి మా అత్తగారు వాళ్ళు వస్తున్నారు వాళ్ళ ముందు తను అష్టైశ్వర్యాలతో తులతూగుతున్నానని ప్రదర్శించుకోవాలని అరవింద తాపత్రయం

రిక్షాలో నుండి దిగి పరధ్యాసగా మెట్టెక్కిన నేను వరండాలో ఒక మూల గోడకి చారబడి కూర్చుని మోకాళ్ళమీద తల ఆనించుకుని కునికి పాట్లు పడుతున్న నాన్నగారిని చూసి షాక్ తగిలినట్టు ఆగిపోయాను నాన్నగారు కట్టుకున్న బట్టలు మాసిపోయాయి అసలే లోతైన కళ్ళు యింకా లోతుకిపోయి కళ్ళ చుట్టూ నల్లని వలయాలు ఏర్పడ్డాయి కళ్ళజోడు ఒకవైపు విరిగిపోయి, మీతోపాటు నేనూ ముసలిదాన్ని అయాను అంటున్నట్టు అనిపిస్తోంది దాన్ని ఆయన దారంతో కట్టి ఉంచారు పక్కనే గోనె మూట, తెగిపోయిన హవాయ్ చెప్పులూ ఉన్నాయి ఏటవాలుగా ఎండ పడుతూండడం వల్ల నాన్నగారి చొక్కా అంతా చెమటతో తడిసి పోయింది మోచేతుల దగ్గిర చర్మం కిందికి వెళ్ళాడుతోంది

అస్థిపంజరానికి చర్మం సాగదీసినట్టున్న ఆయన నేడో రేపో నేలరాలబోయే పండిన పండులా ఉన్నారు ఆయనని ఆ పరిస్థితిలో చూసిన నా మనసు ఒక్కక్షణం ద్రవించి పోయింది వంగి యోచేతిమీద తట్టి "నాన్నగారూ" అని పిల్చాను నాన్నగారు ఉలిక్కిపడి కళ్ళు తెరిచి "నానీ" అన్నారు ఆ కళ్ళలో అంతులేని ప్రేమ సముద్రాలు పొంగుతున్నాయి ఎన్నాళ్ళకో నన్ను చూశానన్న ఆనందాతిరేకం కన్నీళ్ళ రూపంలో బయటికి తన్నుకొచ్చింది

"రండి" అంటూ పక్కనున్న గోనెమూట తీసి పట్టుకుని వెళ్ళి తలుపు తట్టాను తలుపు తెరుచుకుంది నా చేతిలో గోనె మూటనీ, తెగిపోయిన హవాయ్ చెప్పులు చేత్తో పట్టుకుని, మోకాలి మీదికి ఎగ్గట్టి ఉన్న మాసిన పంచెతో

నించుని ఉన్న నాన్నగారినీ చూసి అరవింద కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి

''రెండు గంటల నించీ కూర్చుని ఉన్నాడు యితనెవరు ?'' అంది

''అరూ మా నాన్నగారు'' అన్నాను మందలిస్తున్నట్టుగా అరుంధతి కళ్లలో ఆశ్చర్యం బదులు అసహ్యం చోటు చేసుకుంది నమస్కారం పెట్టి మర్యాదకైనా లోపలికి రమ్మంటుందను కొన్న అరుంధతి గిరుక్కున వెనక్కి తిరిగి లోపలికి వెళ్లిపోయింది నేను లోపలికి వచ్చాను నాన్నగారు కూడా నా వెనకాలే వచ్చారు గోనె మూట సోఫామీద పెట్టి, కూర్చోండి నాన్నగారూ అన్నాను

''నుయ్యి ఎక్కడుందో చూపించరా నానీ స్నానం చేసి సంధ్య వార్చుకోవాలి'' అన్నారు

''ఒక నిముషం ఉండండి వేడినీళ్లు పెట్టిస్తాను'' అన్నాను

''వద్దురా ఎండకి ఎండి వానకి తడిసిన శరీరమిది చన్నీళ్లు చాలు''అన్నారు నాన్నగారికి బాత్‌రూమ్ చూపించి వంటింట్లో కెళ్లాను నా అడుగుల చప్పుడు విని కూడా అరుంధతి యిటు తిరగలేదు వెనుకగావెళ్లి భుజంమీద చెయ్యి వేశాను

అరుంధతి యిటు తిరిగింది ఆ సోగకళ్లల్లో కోపం తళ తళ లాడుతోంది ''ఎందుకు వచ్చారు మీ నాన్నగారు ?'' అంది

''ప్లీజ్ అరూ ఎందుకంత కోపం ? నాన్న గారికి నేను తప్ప యింకెవరున్నారు ? చూడాలని పించిందేమో !'' అన్నాను అనునయంగా

''అంటె యింక యిది శాశ్వతంగా ఉండే తద్దినం అన్నమాట'' అంది. ''మా అమ్మ వాళ్లు వచ్చేసరికి మాత్రం ఆ పల్లెటూరి అవతారం యిక్కడ ఉండడానికి వీల్లేదు . యింకో రెండు రోజులు పైముంది ఎలా చేస్తారో మీ యిష్టం'' అంది

''అరూ'' అన్నాను దెబ్బతిన్నట్టు

''ఏం మీరు చెప్పలేకపోతే నేను చెప్తాను'' అంది

'' ముందు యింత కాఫీ పెట్టియియ్యి'' అన్నాను. అరుంధతి యిచ్చిన కాఫీ పట్టుకుని నేను వచ్చేసరికి నాన్నగారు పూజ చేస్తున్నారు పిల్లలిద్దరూ ఎదురుగా నించుని కుతూహలంగా చూస్తున్నారు. నేను అక్కడే కూర్చున్నాను పూజ అయ్యాక నాన్నగారు గంట తీసి వాయిం చారు పిల్లలిద్దరికీ పటిక పంచదార ప్రసాదం ముక్కలు యిచ్చారు,

నేను పిల్లలిద్దరినీ పరిచయం చేసి దండం పెట్టించాను నాన్నగారు కాఫీ తాగుతూ ''నానీ యిల్లు బేరం పెట్టేశానురా'' అన్నారు యింతలో వంటింట్లో ధన్‌మని గిన్నె పడ్డ చప్పుడు ఆ చప్పుడు లాగే నాగుండెల్లో బాంబులు పేలుతున్నాయి. యిన్నాళ్లకి రాకరాక వచ్చిన తండ్రిని 'నాన్నా మా అత్తగారు వాళ్లు వస్తారు, వాళ్ల ముందు నిలబడే అర్హత లేదు వెళ్లిపో' అని ఎలా చెప్పను? ఇంతలో సుధీర్ లోపలనుండి పరిగెత్తుకు వచ్చి అమ్మపిలుస్తోంది అన్నాడు నేనులేచివెళ్లాను అర్జెంటుగా తయారవ్వండి మెహతాగారింటికి వెళ్లాలి అంది పిల్లల్ని నాన్నగారికి సాయంగా వదిలేసి వెళ్లాం. మేము వచ్చేసరికి పిల్లలిద్దరూ నాన్నగారి చెరొక తొడమీద కూర్చుని పకపక నవ్వుతున్నారు నాన్నగారు కూడా బోసినోటితో పకపక నవ్వుతున్నారు మమ్మల్ని చూస్తూనే పిల్లలు పరుగెత్తివచ్చి చేతులు పట్టుకుని ఊపుతూ ''డాడీ భలే, గంటల తాతయ్య మంచి కథలు చెప్పి నవ్విస్తాడు మనం తాతయ్యని యిక్కడే ఉంచేసుకుందాం'' అన్నారు

''బాగుంది సంబరం హోంవర్కులు చేశారా లేదా ? చదువుకోమని చెప్పి వెళితే యిదా మీరు చేసిన పని ?'' అంది అరవింద నవ్వుతూ యిటే చూస్తున్న నాన్నగారి మొహం చిన్నబోయింది. మరొక గంట తర్వాత అరవింద భోజనం వడ్డించింది




నాన్నగారికి పీటమీద మఠం వేసుకుని కూర్చునితినడం అలవాటు అదే నేను అరవిందతో అంటే నన్ను మింగేలా చూస్తూ ''యిప్పుడు పీటలూ చేటలూ ఎక్కడనించి తేవడం తింటే తినమనండి లేకపోతే నాకు తెలీదు'' అంది మర్నాడు సాయంత్రం నేను ఆస్పత్రి నుండి వచ్చేసరికి పిల్లలిద్దరూ గేటు దగ్గిరికి పరుగెత్తు కొచ్చి ఫిర్యాదు చేస్తున్నట్టుగా ''చూడండి నాన్నగారూ అమ్మ తాతయ్యని అల్లా యింటిలోకి వెళ్లిపొమ్మంది మమ్మల్ని కథలు వినడానికి వెళ్లవద్దంది'' అన్నారు నేను అడుగుతాను పదండి అని అనేంతలో లోపలనుండి అరవింద మాటలు వినవచ్చాయి

''బంధువేమిటండీ, ఎత్తేస్తే ఏడు చెక్కలవుతారు మావారు డాక్టరు కదా ఫ్రీగా చెక్‌అప్‌లూ, మందులూ వస్తాయి కదా ? ఏదో బీరకాయపీచు సంబంధం కలుపుకుని వచ్చేస్తూ ఉంటారు '' అది నాన్నగారిని ఉద్దేశించి అన్నట్టు నాకు తెలియనంత మూర్ఖుణ్ణేం కాను. నా మనసు కుత కుత ఉడికిపోతోంది ఆ వచ్చింది మిసెస్ మెహతా

ఆ మరునాడు నేను లేచేసరికి నాన్నగారు లేచి తయారైపోయారు నన్ను చూస్తూనే 'నానీ నేను వెళ్తున్నానురా' అన్నారు పిల్లలిద్దరి చేతుల్లో చెరొక అయిదు రూపాయలు పెట్టారు నాన్నగారిని ఉండమని గట్టిగా అన లేకపోయిన దౌర్భాగ్యుణ్ణి నాన్నగారు వెళ్లి పోయారు అరవిందలోని చిరాకు మనిషి మాయమై మామూలు అరవింద అయిపోయింది

మరి నాలుగు రోజులనాడు ఎవరో పేషెంట్‌కి ఒంట్లో బాగులేదని ఎవరో ఒక రైల్వే పోర్టర్‌లాంటివాడు పిలవాని వస్తే వెళ్లాను ఊరికి దూరంగా, రైల్వే లైను అవతల ఒక పూరిగుడెసెలోకి తీసుకువెళ్లాడు చీకటి గుయ్యారంలాంటి ఆ చవుడుగారుతున్న కొంపలో కుక్కిమంచంమీద అచేతనంగా పడుకుని ఉన్న ఆ పేషెంట్‌ని చూడగానే నా కళ్లు బైర్లుకమ్మాయి. అతను నాన్నగారు

ఇతను మీకేమవుతారు ? అన్నాను నన్ను తీసుకువచ్చినతనితో

''ఏమీకారండి ఎందుకూ పనికిరానివాడినని అయిన వాళ్లందరూ తగిలేస్తే చేరదీసి అన్నం పెట్టి నన్నోయింటివాణ్ణిచేశారు ధర్మప్రభువులు ఎక్కడో పట్నంలో ఒక కొడుకున్నాడుట ఈయన చలవవల్లే ఉద్యోగం చేసుకుంటూ బతుకు తున్నాను నాలుగు రోజులమీదట రేల్వేస్టేషన్‌లో కన్పించారు సొమ్మసిల్లిపోయినట్టు పడుంటే తీసుకువచ్చాను అప్పటినుండీ జ్వరం ఎలాగైనా నయంచెయ్యండిబాబూ మీఋణం ఉంచుకోను '' అంటూనే తన చేతినిఉన్న ఉంగరం తీసి నా చేతిలో పెట్టబోయాడు నేను చప్పున చెయ్యి వెనక్కి తీసుకున్నాను నాన్నగారిని పరీక్షచేసి మందులు రాసి నా జేబులోంచి వందరూపాయల నోటుతీసి అతడి చేతిలోపెట్టి 'యింద మందులు, మంచి పళ్లు కొను సాయంత్రాన ఆస్పత్రికి రా మందులు యిస్తాను' అని చెప్పి అక్కడనించి ఎవరో తరుముతున్నంతగా గబగబ బయటికి వచ్చేశాను దూరం నుండి పాట లీలగా విన్పిస్తోంది

''పుట్టినరోజు పండగే అందరికీ, మరి పుట్టింది ఎందుకో తెలిసేది ఎందరికి?''

నిజమే నాలుగు రోజులు ఆదరించిన పుణ్యానికి ఏమీ కాని వ్యక్తిని యింట్లో పెట్టుకుని సేవచేసే అతడి కంటె, నేనెందులో గొప్ప ? కన్నవారి ఋణం తీర్చుకోలేని నాలాంటి వారు నూటికి తొంభై మంది ఉంటే, మా నాన్నని కన్నకొడుకులా ఆదరించిన అలాంటి వ్యక్తి కోటికొక్కడుంటాడేమో! నిజమైన పుత్రుడు అనిపించుకునే అర్హత వారికే ఉంటుంది ★

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥

## హైదరాబాదు నోట్‌బుక్

### తర్వాత ఎవరు మాట్లాడినా నచ్చని ప్రసంగం :

పాశ్చాత్య వక్తలను గురించి నాకు అంతగా తెలియదుగాని, భారతదేశం మూల మూలా తిరగడంవల్ల భారతీయ వక్తలను గురించి చాల తెలుసు నిర్దిష్ట, పరిశోధిత, పరాజిత విషయాన్నేకాక దేనినయినా జనరంజకంగా ప్రసంగించడమే నిజమైన, నిఖార్సైన వక్తృత్వం నోబెల్ బహుమతి గ్రహీత సర్ సి వి రామన్ మహావక్త అతిగహనమైన 'రామన్ ఎఫెక్ట్'ను అతిసరళంగా ప్రజాసమూహంలో ఉపన్యసించేవారు ముగ్గురు మహిళలు రెండు నిముషాలు మాట్లాడితే మూడు కప్పుల టీ కాచుకొనగల విద్యుచ్ఛక్తి పుడుతుంది– అంటూ ఆరంభించారు రామన్ ఒకమారు తన ప్రసంగాన్ని–గొప్ప వక్తలక్షణం, అతడు ప్రసంగించిన తర్వాత మరెవరిదీ జనానికి నచ్చకపోవడం భారత జాతీయోద్యమంలో ప్రభవించిన మహా వక్తలలో లాల్‌బాల్‌పాల్ లను దర్శించే భాగ్యం నాకు కలుగలేదుగాని, తాము ప్రసంగించిన పిదప ఎవరు మాట్లాడినా, ఎందుకబ్బా వీరు నోరు తెరవడం అనిపించే మహావక్తలను చూచాను సేన్‌గుప్తా ఆరడుగుల సుందర మూర్తి మూర్తీభవించిన చిత్తజుడు ఆయన ప్రసంగించిన పిదప మరెవరి ప్రసంగమూ నచ్చేది కాదు అలాటివాడే నరీమన్, వక్త వక్తృత్వశక్తే కాక దేహ సౌష్ఠవం, సౌందర్యం కూడా జనాన్ని ఆవర్జిస్తాయి తిరుచిరాపల్లి కారాగారవాసకాలంలో సుబ్బయ్యా మొదలి అనే తమిళనాయకుడు ఉండేవారట ఆయన ప్రసంగాన్ని తమిళం రానివారు కూడ మంత్రముగ్ధుల్లాగ వినేవారు పంజాబ్ నాయకుడు డాక్టర్ కిచ్లూ ప్రసంగం తర్వాత అందరి మాటలూ పేలవమే తెలుగువారిలో గంపలగూడెం కుమారరాజా, కల్లూరి సుబ్బారావు జనాన్ని ఏ లోకాలకో తీసుకువెళ్లేవారు సంస్కృత వక్తలలో సుగృహీతనామధేయులు కీర్తిశేషులు కరపాత్రీ స్వామీ ప్రసంగం విన్నవారు సంస్కృతానికి దాసులైపోవలసిందే డి ఎం కె నాయకుడు కరుణానిధి ప్రసంగం అలాటిదే అటల్ బిహారీ వాజిపేయికూడ ఆ కోవవారే శారదా సంస్కృత మాసపత్రిక సంపాదకుడు వసంతగాడ్గిల్ సంస్కృతంలో ఆటోమొబైల్ శకటాలను గురించి ప్రసంగించారు అది ఎంతటి సాహసమో చెప్పనక్కరలేదు అతడు మాట్లాడిన పిదప ఎవరు మాట్లాడినా వాక్పరిశ్రమ అనిపిస్తుంది కొందరు శబ్దాలంకారాలతో, పేనుడుతో తమ భాషా పాండిత్యం చూపుతూ చమత్కారాలు ఒలకబోస్తారు అది వక్తృత్వంకాదు ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, ఎవరు ప్రసంగిస్తే తర్వాత వచ్చే వక్తల ప్రసంగాలు పేలవమవుతాయో, అతడే మహావక్త అని ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు, సేన్‌గుప్తా, నరీమన్‌లకోవకు చెందిన వక్త కాకపోయినా, ఆయన ప్రసంగం తర్వాత ఎవరి ప్రసంగమూ జనానికి నచ్చలేదంటే అతిశయోక్తికాదు నటనలో పరిణిష్ఠితులు – అంటే వాచికాంగికాలలో పరిణిష్ఠితులు–అయిన ముఖ్యమంత్రి తెలుగుదేశం ప్రభుత్వం ప్రథమ వార్షికనివేదికను చదువుతున్నప్పుడు విన్న ఆంధ్రేతరులూ ముగ్ధులయ్యారు ముఖ్యమంత్రి తర్వాత విధానసభ ప్రతిపక్ష నాయకునికి ప్రసంగించడానికి ఇచ్చిన అవకాశం సవ్యంగా వినియోగం కాకపోయిందని నేను ఎంతో విచారించాను ముఖ్యమంత్రి ప్రసంగం తర్వాత ప్రతిపక్ష నాయకుని ప్రసంగం చాల తేలిపోయింది వ్రాసిన దానిని ఆయన సరిగా చదువనుకూడ చదువలేకపోయారు ముఖ్యమంత్రి వాచికం గంభీరోదాత్తం,సువ్యక్తం, సుమధురంకాగా, ప్రతిపక్ష నాయకుని ప్రసంగం అస్పష్టం, అభివ్యక్తరహితమై శ్రోతలకు బాధ కలిగించింది యథేచ్ఛగా అనడానికి యదచ్చగా, దురభిమానం అనడానికి దురాభిమానం, పథకాలకు మారు పతకాలు, అభివృద్ధికి బదులు అబిరుద్ది (ఏమిటీ రుద్దడం అన్నారు కొందరు), అవగాహనకు అవగాన, మొసలి కన్నీరుకు ముసలి కన్నీరు, మానభంగాలకు మానవ బంగాలు – ఇలా సుశబ్దాలు అపశబ్దాలయాయి చదవడంలో భావ ప్రకటనకు,భావావగాహనకు భాష – పాండిత్యంకాదు, కేవలం ఆవశ్యకమైన భాష–అవసరమవి మన నాయకులు గుర్తించాలి

### ఉపశ్రుతి :

గ్రామోద్యోగులు రికార్డులతోపాటు పరారీ అయ్యారట వార్త విన్నారా ? – అనడిగారు కొందరు పత్రికా పాఠకులు నన్ను అయ్యవారు అలిగితే అమావాస్య ఆగుతుందాండీ ? అలాగే, గ్రామోద్యోగులు లేకపోతే పరిపాలన స్తంభిస్తుందా ? – అని ఎదురు ప్రశ్న వేశారు మరికొందరు

**– తిరుమల రామచంద్ర ★**

*Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, Editor S Radhakrishna*

# సెనగపిండి వాడినా, పసుపు వంటికి రాసినా శరీరం తెల్లబడేనా—ఏమంటావు ఓ మనసా!

పసిమి ఛాయ ఎందులో వుంది? సెనగపిండి, నిమ్మరసం - గ్లిసరీన్, పసుపు, పాల మీగడ, దోస రసం ... ఈ పారంపరిక చిట్కాలు మహాయిస్తే చర్మానికి కాస్త నిగారింపు ఇస్తాయి అంతే. కాని వంటి ఛాయని నిజంగా తెల్లబరుస్తాయా?

## మీ చర్మం రంగును నిర్ణయించేది ఏమిటి?

మీ చర్మం లోపల మెలానిన్ అనే నల్లని రంగు పదార్థం వుంది ఇది చర్మంలో ఎంత ఎక్కువగా వ్యాపిస్తే మనుషులు అంత నల్లగా కనబడతారు. మీ చర్మం రంగు మీద ప్రభావం చూపే బయటి కారణాలు కూడా ఉన్నాయి. ఎండలో మీరు బయటికి వెళ్లినప్పుడు సూర్యరస్మిలోని అల్ట్రావయొలెట్ కిరణాలు మిమ్మల్ని మరింత నల్లబరుస్తాయి.



## వంటి చాయను పెంచడానికి సరియైన పద్ధతి ఏదైనా ఉందా?

ఉంది. మొట్టమొదటిసారిగా సాధించిన ఓ వైజ్ఞానిక విజయం ఫెయిర్ అండ్ లవ్‌లీ—నల్ల చర్మాన్ని తెల్లపరిచే క్రీమ్. ఇది మీ చర్మం నల్లబడటాన్ని అరికట్టి, తిరిగి ఎర్రగా రంగుతేలేలా చేస్తుంది.

## ఫెయిర్ అండ్ లవ్‌లీ ఎలా పనిచేస్తుంది?

లోపలా. బయటా 2 విధాలుగా.

చర్మం లోపల: ఫెయిర్ అండ్ లవ్‌లీ క్రీము చర్మం అడుగున మృదువుగా, సురక్షితంగా పనిచేసి నల్లబడుతున్న చర్మం తిరిగి రంగు తేలేలాగ చేస్తుంది

చర్మం బయట: ఫెయిర్ అండ్ లవ్‌లీలోగల 'సూర్య రస్మిని వడబోసే' ప్రత్యేక పదార్థాలు, అల్ట్రావయొలెట్ కిరణాలు మీ చర్మాన్ని నల్లబరచకుండా అడ్డగిస్తాయి. అయినప్పటికీ, సూర్యరస్మిలోని ఆరోగ్యమంతటినీ మీరు పూర్తిగా పొందగలుగుతారు

## రంగు తేలడానికి కేవలం 6 వారాలు!

ఫెయిర్ అండ్ లవ్‌లీని ఆరు వారాలపాటు క్రమం తప్పకుండా రోజుకు రెండుసార్లు రాసుకోండి మొదట, చర్మం మీద కాస్త జిమజిములాడవచ్చు. ఫెయిర్ అండ్ లవ్‌లీ పనిచేస్తున్నదనడానికి అది నిదర్శనం. ఆరు వారాల్లో ఖచ్చితమైన తేడా మీకు కన్పిస్తుంది, ఇతర్లకీ కన్పిస్తుంది, క్రమం తప్పకుండా వాడుతూ ఉండండి, ఫెయిర్ అండ్ లవ్‌లీ శరీర ఛాయతో అలాగే వుంటారు మీరు.

ఫెయిర్ అండ్ లవ్‌లీ గురించి మీరు మరిన్ని వివరాలు తెలుసుకోవాలనుకుంటే, ఈ చిరునామాకు వ్రాయండి

FAIR & LOVELY ADVISER,
P.O BOX 758,
BOMBAY 400 021.




ఫెయిర్ అండ్ లవ్‌లీ

నల్ల చర్మాన్ని ఎర్రబరిచే క్రీమ్

ఇది సహజంగా, మృదువుగా మీ వంటి చాయను పెంపొందిస్తుంది.

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS-FALOV-30-2316 TL

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA




# ఆంధ్రపత్రిక

విజయవాడ - హైదరాబాద్